తీయని రోజులు నెలలూ
తిరిగి తిరిగిపోతున్నవి
హాయిగ వసంతవాహిని
జాయగ వెలిపోతున్నది. పాతపాట—

అతను చదువుల గదికి తిరిగి వచ్చేసరికి రాత్రి ఒంటిగంట అయింది. కొవ్వొత్తి దీపాలు వెలిగించడానికి వచ్చిన నౌకరును పంపించి వేసి, నెగడు దగ్గిర పడక కుర్చీలో దభాలున కూలబడి, రెండు చేతుల తోనూ మొహం కప్పేసుకున్నాడు. ఇంతకు పూర్వం ఎన్నడూ శారీర కంగా, మానసికంగా ఇంత అలసట ఎరగడు. ఆ సాయంత్రమంతా అను కూలవతులయిన స్త్రీలతోను, సంస్కృతీపరు లయిన పురుషులతోను కాల క్షేపం చేసాడు స్త్రీలా అందగత్తెలు పురుషులా మేధావులు! తాను సంభాషణలో చాకచక్యం ప్రదర్శించి సెభాష్ అనిపించు కున్నాడు.... అయినా విసుగు, ప్రాచీన రోమనులు సైతం బాధించిన విసుగు, ఇంతగా ఎన్నడూ అనుభవించలేదు. జీవితంమీద విరక్తి ఇంతగా ఎన్నడూ ఉక్కిరి బిక్కిరి చేయలేదు. కాస్త చిన్నవాడయి నట్లయితే ఈ కష్టాలకు, ఈ విసుగుకు, ఈ చీదరకు బావురుమని ఏడ్చేవాడే కట్టెలాగ తీక్ష ణంగా మండే బాధతో అతని హృదయం నిండిపోయింది. శిశిరకాలపు చీకటిలాగా నలువైపుల నుంచీ ఏదో ఏహ్యమయిన పీడాకారం అతనిని చుట్టుముట్టు తున్నట్టుంది. ఈ చీకటినుంచి ఈ పీడాకారంనుంచి తప్పించు కోవడం ఎలాగో అతనికి తెలియలేదు. నిద్ర పడుతుందని ఆశించి లాభం లేదు. ఉహుం.–నిద్ర పట్టదు.

మెల్ల మెల్లగా బాధాకరమయిన, ప్రయాసకరమయిన ఆలోచన లలో మునిగిపోయాడు.

మానవునిలోని అహంకారం, అత్యాశ, కృత్రిమం గురించి పర్యాలోచించాడు. జీవితంలోని వివిధ దశలను ఒకదాని తరవాత ఒకటి సమీక్షించాడు. (అతని వయసు యాభైరెండు దాటింది) ఒక దశ లోనూ తలమునకలు వేయాలని అతనికి కాంక్ష కలగలేదు. ఎపుడూ

ఒకటే అనంతమయిన, అర్ధరహిత మయిన కార్యకలాపం; నిరర్ధకంగా శక్తిని వ్యయం చేసుకోవడం; కొంతవరకు సత్యమూ, కొంతవరకు కృత్రిమమూ అయిన ఆత్మవంచన — మనసును మళ్ళించుకోవడానికి ఏదో ఒకటి ! ఇంతలో హఠాత్తుగా పిడుగులా వృద్ధాప్యం వచ్చి పడుతుంది. అన్నిటి వెనకా మృత్యుభయం నానాటికీ పెచ్చుపెరిగి మనిషిని తినివేస్తుంది. ఆ తరవాత....అధఃపాతాళం! పరిస్థితులు విషమించక పోతే మంచిదే. కాని ఉక్కుకు తుప్పు పట్టినట్లు చివరికి బలహీనత, కష్టాలు వచ్చిపడతాయి సందేహం లేదు.... కవులు వర్ణించినట్టుగా ఉవ్వెత్తున లేచే తరంగాలతో జీవితసాగరం అతనికి పొడగట్టలేదు. జీవిత సాగరం ప్రశాంత మయినదిగా, నిర్మల మయినదిగా, స్వచ్ఛ మయినదిగా, నిశ్చల మయినదిగా చిత్రించు కున్నాడు. ఇక తాను ఓటిపడవలో కూర్చున్నాడు. పడవ గర్భంలో ఊరిన నీటిలోనుంచి పెద్ద పెద్ద చేపల వంటి రాక్షసాకారాలు కనిపించాయి. ఇవి జీవితాన్నుండి వేరుచేయ వీలు లేని జాడ్యం, దురదృష్టం, పిచ్చి, దారిద్ర్యం, అంధత్వం లాంటి దుఃఖాలు....శ్రద్ధగా పరికించాడు. చుట్టూ ఆవరించిన అంధకారంలోంచి ఒక రాక్షసాకారం వెలువడి, పైకి, పైపైకి లేచి, ఇంకా స్పష్టంగా ఇంకా వికారంగా గోచరించింది....ఇక ఒక్క నిమిషంలో పడవను తల కిందులు చేసేస్తుంది. కాని హఠాత్తుగా అది అస్పష్టం కాసాగింది. దూరంగా వెళ్ళి తిరిగీ మునిగిపో ప్రారంభించింది. సముద్ర గర్భంలో చేరి కనిపించీ కనిపించకుండా పొలుసులు ఆడించింది .... కాని కాలం ఖర్మం కలిసిరాగానే పడవను తలకిందులు చేస్తుంది

తల ఎగరవేసి దిగ్గున లేచాడు. ఆ మూలనుంచి ఈ మూలకు ఒకటి రెండు సార్లు పచార్లు చేశాడు. ఆ పైన వ్రాతబల్లదగ్గరకు వెళ్ళి ఒక సొరుగు తరవాత ఒక సొరుగు లాగి వాటిలోన కాగితాలు, పాత ఉత్తరాలు తిరగవేసాడు. ఆ ఉత్తరాలలో చాలా భాగం ఆడవాళ్ళదగ్గర నుంచి వచ్చినవే ! దేనికోసం వెతుకుతున్నాడో అతనికే స్పష్టంగా తెలియదు. పీడించే ఆలోచనలనుంచి తప్పించుకోడానికి ఏదో ఒక పనిలో నిమగ్నం కావాలనే అతని ఆరాటం. చేతికి అందిన ఉత్తరాలు తిరగ

వేస్తూ (ఒకదానిలో రిబ్బనుకు కట్టిన పువ్వు వాడిపోయి ఉంది) బుజాలు ఎగరవేశాడు. నెగడువంక తేరిపార జూచి ఆ అనవసర చెత్తనంతా అందులో వేసి కాల్చివేదామని ఉద్దేశించినట్లు వాటిని తీసి ఒక పక్కన పెట్టాడు. ఒక సొరుగుతరువాత ఇంకో సొరుగులోకి తొందరతొందరగా చేతులు పోనిచ్చి తేలికైన చిన్న పాతకాలపుతరహా పెట్టె ఒకటి పైకితీసి మూత తెరిచాడు. అతనికళ్ళు బాగా విచ్చుకున్నాయి. ఆపెట్టె అష్టభుజి ఆకారంలో ఉంది. అందులో పసుపుపచ్చని పత్తి పొరలు రెంటి అడుగున ఉన్న కెంపువర్ణపు శిలువ పైకి తీశాడు.

ఆ శిలువకేసి కొన్ని నిముషాలపాటు తేరిపార జూచి హఠాత్తుగా వినిపించీ వినిపించకుండా కేకపెట్టాడు. పశ్చాత్తాపం కొంత, సంతోషం కొంత అతని రూపురేఖలలో దూసుకుపోయాయి. ఎంతకాలం కింద టనో దూరమైన మనిషి కనిపించినపుడు, ఎపుడో ఒకానొకపుడు గాఢంగా తాను ప్రేమించిన వ్యక్తి ఏమాత్రం మారకుండానే ఆనాటి మాదిరిగానే హఠాత్తుగా ప్రత్యక్షమైనపుడు మానవుని మొహంలో కానవచ్చే కవళికలే అతని మొహంలో పొడగట్టాయి.

అతనులేచి, నెగడుదగ్గరకు వెళ్ళి, ఆ పడకకుర్చీలోనే తిరిగీ కూలబడి చేతులతో మొహం కప్పేసుకున్నాడు....'యీ రోజునే కని పించాలా? యిన్ని రోజులలో యీ రోజుననే కనిపించాలా?' అని తనలోతాను ప్రశ్నించుకుని, ఎన్నడో పూర్వం జరిగిన సంఘటనలను నెమరు వేసుకున్నాడు.

ఇదీ అతనికి జ్ఞాపకం వచ్చిన విషయం—

అతనిపేరు. ఇంటిపేరు ముందు చెప్పడంభావ్యం. పేరు డిమిట్రీ పావ్లోవిచ్, ఇంటిపేరు సానిన్.

ఇదీ అతనికి జ్ఞాపకం వచ్చిన విషయం—



# 1

1840 వేసవికాలం. అపుడే సానిన్‌కి ఇరవై రెండో ఏడు వెళ్ళింది. ఇటలీనుంచి రష్యా తిరిగి వస్తూ ఫ్రాంక్‌ఫోర్టు రేవులో ఆగాడు. కొద్దో గొప్పో ఇంత ఉన్నవాడు. స్వతంత్రుడు. దగ్గర చుట్టాలెవరూ లేరు. దూరపుబంధువు ఒకతను చనిపోవడంతో వారసత్వ రూపేణా కొద్దివేల రూబుళ్ళు చేతికి వచ్చాయి. ప్రభుత్వోద్యోగంలో చేరి ఆ భారం వహించేముందే ఆ ధనం విదేశాలలో ఖర్చు పెట్టేసేయాలని నిశ్చయిం చుకుని అక్షరాలా పాటించాడు. ఫ్రాంక్‌ఫోర్టు చేరుకునేసరికి పీటర్స్‌బర్గ్ వెళ్ళడానికి సరిపోయేటంత డబ్బు మాత్రమే మిగిలింది. 1840 నాటికి యూరపులో రైలుమార్గాలు లేవు. ప్రయాణీకులు అంచెటపా బండిలో ప్రయాణం చేసేవారు. సానిన్ బీవాగిన్‌లో ప్రయాణపు ఏర్పాట్లు చేసు కున్నాడు. కాని ఆ బండి రాత్రి పదింటికి గాని బయలుదేరదు. అంత వరకూ నిరీక్షించవలసిందే.

అదృష్టవశాత్తు వాతావరణం పసందుగా ఉంది; ఆనాడు మంచి పేరులో ఉన్న 'శ్వేతహంస' అనే భోజనశాలలో భోజనంచేసి సానిన్ పట్టణం చూడడానికి బయలుదేరాడు. డన్నెక్కర్ 'అరియాడ్నీ' అనే సంగీత నాటకం చూసాడు, నచ్చలేదు. గైతీమహాకవి ఇంటినిచూసాడు. గైతీ గ్రంథాలలో అతను చదివిందల్లా 'సారోస్ అఫ్ వెర్థర్' (వెర్థర్ దుఃఖాలు) అనేది ఒకటే. అదైనా ఫ్రెంచి అనువాదం. విసుగెత్తి సముద్రపుటొడ్డున పచార్లు చేశాడు, సాయంకాలం అరయింది. అలసి పోయాడు. బూట్లు దుమ్ము కొట్టుకుపోయాయి. ఫ్రాంక్‌ఫోర్టులోని ఒక మారుమూల వీధిలో ప్రవేశించాడు. ఆ వీధి అతని స్మృతిపథంలో చిర

కాలంగా హత్తుకుపోయి ఉంది. అందులో ఉన్న ఇళ్ళే బహుకొద్ది, వాటిలో ఒకదాని ముందు ఆ ఇల్లు ఇటలీ రొట్టెలవర్తకుడు, జియోవాని రోసెల్లాదని వ్రాసిన బల్లకట్టి ఉంది. ఒకగ్లాసు నిమ్మషర్బతు తాగుదామని సానిన్ లోపలికి వెళ్ళాడు. ముందుగదిలో గల్లాపెట్టె వెనక, మందుల దుకాణాలలోని రంగు అలమారాను జ్ఞప్తికి తెచ్చే అలమారాలలో బంగారు మలాం చీట్లు అంటించిన గాజుసీసాలు, రొట్టెముక్కలు, చాక్లెట్లు, పళ్ళరసాలతో నిండిన గాజుజాడీలు ఉన్నాయి. కాని ప్రాణి అంటూ కనిపించలేదు. కిటికీదగ్గరి పేముపీటమీద మాత్రం ఒక పిల్లి కూర్చుని, కళ్ళుమిటకరిస్తూ పంజా విప్పుతూ ముస్తూ అరుస్తోంది. నేలమీద ఒక కొయ్యపెట్టె ఉల్టాసీదాగా పడిఉంది. దానిపక్కన కెంపువన్నె పెద్దబంతిఒకటి సాయం సూర్యుని ఏటవాలు కిరణాలలో మెరుస్తూంది. పక్క గదిలోంచి అస్పష్టంగా ఏవోధ్వనులు వినిపించాయి. తలుపుమీద గంట గణగణా మోగింది. ఆమోత ఆగిన తరవాత 'లోపల యెవరన్నా వున్నారా?' అని అడుగుదామని సానిన్ నిరీక్షిస్తూ నిలబడ్డాడు. సరిగ్గా ఆ సమయంలోనే పక్క గదిగుమ్మం తెరుచుకుంది. ఆదృశ్యం చూసి ఉక్కిరిబిక్కిరయాడు సానిన్!

# 2

సుమారు పందొమ్మిదేళ్ళ యువతి చేతులు చాపుకుని ముందు గది లోకి ఉరుక్కుంటూ వచ్చింది. కారురంగు ఉంగరాల జుట్టు బుజాల మీద వేలాడుతోంది. సానిన్‌ని చూడగానే పరుగెత్తుకుంటూ అతని దగ్గరకు వెళ్ళి చేయి పట్టుకుని "తొందరగా, తొందరగా వాడిని రక్షించు" అని రొప్పుతూ కూడా లాక్కొని వెళ్ళింది. ఆమె చెప్పినట్లు ఎందుకు చేయాలనే పట్టుదలతో కాకపోయినా ఆశ్చర్యంతో సానిన్ వెంటనే ఆమెను అనుసరించి వెళ్ళలేదు. నేలకు అంటుకుపోయినట్లు నిలబడ్డాడు. అతని జీవితంలో ఎన్నడూ అంతటి అందం చూడలేదు. ఆమె అతని కేసి తిరిగి, "రండి, తొందరగా రండి" అని అరిచింది. ఆమె గొంతులో, చూపులో, పాలిపోయిన చెంపను వణుకుతూ పట్టుకున్న చేతి కదలికలో నిరాశాభావం కానవచ్చే సరికి సానిన్ ఒక్క క్షణంకూడా తటపటాయించకుండా ఆమె వెనకాలే ఉరుక్కుంటూ వెళ్ళాడు.

ఆ యువతి ప్రవేశించిన గదిలో పూర్వకాలపు తరహా గుర్రపు బొచ్చు సోఫామీద అచ్చంగా ఆమెను పోలిన బాలుడు, బహుశా ఆమె సోదరుడు కావచ్చు, పండుకుని ఉన్నాడు. మొహం మైనంలాగా, పాత చలవ రాయిలాగా, పారాణి రంగుగా, శవం మొహంలాగా ఉంది. కళ్లు మూసుకుని పోయాయి. ఉలితో చెక్కిన రాయిలాంటి నుదురుమీద, తీర్చి దిద్దినట్లున్న కనుబొమల మీద వత్తుజుట్టు కీనీడను ప్రసరింప జేస్తోంది. పెదవులు నలుపెక్కాయి. పళ్ళు బిగుసుకు పోయాయి. ఊపిరి పీలుస్తున్నట్టు లేదు. ఒక చేయి నేలమీద వేలాడుతోంది. ఇంకొక చేయి తల

మీద పడిఉంది. కుడితినీ గుండీలు బిగుతుగా పెట్టిఉన్నాయి. గొంతుకకు గట్టిగా ముడివేసిన 'టై' ఉంది.

ఆ యువతి బిగ్గరగా ఏడుస్తూ ఆ బాలుని దగ్గరకు పరుగెత్తి, "చచ్చిపోయాడు, చచ్చిపోయాడు" అని అరిచింది. "నిమిషం కితం యిక్కడ కూర్చుని నాతో మాట్లాడుతూ మాట్లాడుతూ హఠాత్తుగా పడి పోయాడు. కదలలేదు....అరిదేవుడా! యిక చేసేదేంలేదా? అమ్మ యింట్లో లేదు. పాంటలియోన్, పాంటలియోన్, డాక్టరేడీ ?" అని ఇటాలియన్ భాషలో అడిగింది. "డాక్టరు కోసం వెళ్ళలేదూ ?"

"నేను స్వయంగా వెళ్ళలేదు గాని లూయిసీని పంపాను" అని బొంగురుగొంతు గుమ్మంలోంచి వినిపించింది. ఒక ముదుసలి వంగి వంగి కుంటుకుంటూ గదిలోకి వచ్చాడు. మనిషిపొట్టి. నల్లగుండీల వదులు కోటు తొడిగాడు. కోటు మెడ తెల్లగా ఎత్తుగా ఉంది, పొట్టి పాటి ముతకఇజారు, ఊదాఊలు మేజోళ్ళు ధరించాడు. మొహం చిన్నది, తెల్లబడ్డ దుబ్బులాంటి జుట్టులో మోహం మరుగుపడింది. నలువేపుల అంటుకునిపోయి జడలు జడలుగా వెనకకు పడిన జుట్టు కోడిజుట్టులా ఉంది. కొనతేలిన ముక్కు, పసుపుపచ్చని కళ్ళుమాత్రమే ఆ కారు తెలుపుజుట్టులోంచి తొంగి చూస్తూండడంవల్ల కోడిపుంజు పోలిక ఇంకా స్పష్టంగా గోచరిస్తోంది.

"నేను పరుగెత్తలేను. లూయిసీ అయితే తొందరగా వెళ్ళి రాగలదు." అన్నాడు వృద్ధు ఇటాలియన్ భాషలో. నున్నగా ఉబ్బెత్తుగా ఉన్న పాదాలు మార్చుకుంటూ. ఆ పాదాలకు దూముడి వేసిన లేసు బూట్లున్నాయి. "నీళ్ళు తీసుకువచ్చాను."

కృశించి వంకరపోయిన వేళ్ళతో నీటిసీసా పట్టుకుని నిలబడ్డాడు.

"కాని డాక్టరు వచ్చేసరికి ఎమిలీ చచ్చిపోతాడు" అంది ఆమె సానిన్ వేపు చేతులు సాచుతూ. "అయ్యో! వీడిని రక్షించలేరా ?"

"ఆఘాతం! నెత్తురు తీసెయ్యాలి" అన్నాడు పాంటలియోన్ అని తామె పిలిచిన వ్యక్తి.

సానిన్‌కి వైద్యం కాస్త కూడా తెలియదు. కాని పధ్నాలుగేళ్ళ కుర్రవాళ్ళ మాత్రం ఆఘాతానికి లోనుగారని అతనికి నిశ్చతంగా తెలుసు.

"యిది మూర్ఛ. ఆఘాతం కాదు" అన్నాడు సానిన్ పాంటలియోన్‌ను సంబోధిస్తూ. "బ్రష్షులు యేమన్నా వున్నాయా?"

ఆ ముదుసలి మొహం ఎత్తి "యేవిఁటే?" అని ప్రశ్నించాడు.

"బ్రష్షులు, బ్రష్షులు!" అని తిరిగి చెప్పాడు, మొదట జర్మన్ భాషలో, ఆ తరవాత ఫ్రెంచి భాషలో. "బ్రష్షు!" అని తిరిగీ అడి గాడు కోటును బ్రష్షుతో శుభ్రం చేస్తున్నట్లు అభినయిస్తూ.

ఎలాగయితేనేం ఆ ముదుసలికి చివరికి అర్ధమయింది.

"ఓ-బ్రష్షులా? అఁ- వున్నాయి."

"యిలా తీసుకురా. కోటు తీసేసి వాటితో రుద్దుదాం."

"మంచిది....తలమీద నీళ్ళు పోయొద్దా?"

"ఉహూఁ- యిప్పుడు కాదు. తరవాత చూదాం. ఆ బ్రష్షులు తొందరగా తీసుకురా."

పాంటలియోన్ చేతిలోని సీసా నేలమీద పెట్టి గదిలోనుంచి పరు గెత్తుకుంటూ వెళ్ళాడు. ఆ మరుక్షణమే ఒక బొచ్చు బ్రష్షు, ఒక గుడ్డ బ్రష్షు తీసుకుని తిరిగి వచ్చాడు. ఉంగరాలు తిరిగిన బొచ్చుకుక్క తోక ఆడించుకుంటూ అతని వెనకాలే వచ్చింది. ఈ గొడవంతా ఎందుకో తెలుసుకోదలచినట్లు ఆ వృద్ధుని వంక, ఆ బాలిక వంక, సానిన్ వంక కుతూహలంతో చూసింది.

ఒరిగి పడుకున్న ఆ బాలుని కోటు విప్పి, మెడ పట్టీ వదులుచేసి, చొక్కా చేతులు పైకి మడతపెట్టి సానిన్ బ్రష్షు తీసుకుని తన శక్తి

నంతా వినియోగించి అతని ఎదురొమ్ము, చేతులు రుద్దాడు. పాంట లియోన్ గుడ్డ బ్రష్షు పుచ్చుకుని సానిన్ అంత పట్టుదలతోనూ ఆ బాలుని బూట్లు, లాగూ రుద్దాడు. ఇక ఆ యువతి సోఫా పక్కన మోకాళ్ళమీద కూర్చుని చేతులతో పట్టుకుని రెప్ప లార్పకుండా తమ్ముని మొహం తేరిపార జూడసాగింది.

బ్రష్షుతో రుద్దుతూ ఆమెకేసి సానిన్ ఓరచూపు చూసాడు. అరే! ఏమా అందం. ఏమా అందం!

# 3

ఆమె ముక్కు కొంచెం పొడుగు. గరుడపక్షి ముక్కులా వంగి ఉంది. పై పెదవిమీద నూగు కనిపించీ కనిపించకుండా ఛాయామాత్రంగా ఉంది. కాని ఆమె శరీరవర్ణం సరళం, పారదర్శికం. దంతంతోను, తెల్లకర్పూరంతోను పోల్చవచ్చును. నిగనిగలాడే వుంగరాలజుట్టు. ఇక ఆమెకళ్ళు కారుబూడిదరంగు, కనుపాపచుట్టూ గుండ్రని నల్లని చార. భయంతో, దుఃఖంతో కాంతివిహీనమైనా ఆమెకళ్ళు అద్భుతంగా, విజయస్ఫోరకంగా ఉన్నాయి.... అప్రయత్నంగా సానిన్ ఆలోచనలు తాను అంతకుముందువదిలివచ్చినమహాదేశంమీదికి మరలాయి. ఇటలీలో కూడా ఆమెతో సమానమైన స్త్రీ అతనికి కనిపించలేదు. ఆమె తన తమ్ముడు ఊపిరి పీల్చడం చూడాలని తహతహ పడుతున్నదా అన్నట్లు ఆగి ఆగి ఊపిరి పీలుస్తోంది.

సానిన్ రుద్దుతూనే ఉన్నాడు. ఆ యువతినేగాక ఇతరుల వంక కూడా చూసాడు. పాంటలియోన్ వింతస్వరూపం అతనిని ఆకర్షించింది. ఆ ముదుసలి, పాపం రుద్దీరుద్దీ అలిసిపోయాడు. రొప్పాడు. బ్రష్షుతో

పాటు ఎగిరిపడ్డాడు. చెమటతో తడిసిన దుబ్బుజుట్టు నీటి ప్రవాహానికి ఊడిపడ్డ పెద్ద మొక్క వేళ్ళలాగా అటూ ఇటూ కదలాడింది.

"బూట్లు తీసెయ్యి" అనబోయాడు సానిన్. ఈ అసాధారణ సంఘటనకు ఆవేశం వచ్చి ఆ కుక్క ముందు కాళ్ళమీద వంగి మొరిగింది.

"టార్టాగ్లియా-కానాగ్గియా" అని ఆ ముదుసలి బుసకొట్టాడు.

కాని సరిగ్గా అదే సమయానికి ఆ యువతి మొహంలో మార్పు వచ్చింది. కనుబొమలు ఎగరవేసింది. కళ్ళు చారెడు అయినాయి, మొహం సంతోషంతో వెలిగిపోయింది.

సానిన్ చుట్టూ చూసాడు....ఆ బాలుని చెంపలు తిరిగీ కాంతి వంత మవుతున్నాయి. కనురెప్పలు ఆడాయి. ముకుపుటాలు అదిరాయి. ఇంకా బిగుసుకుపోయి ఉన్న పళ్ళగుండా గాలి పీల్చాడు.

"ఎమిలీ!" అని అరిచింది ఆ యువతి. "ఎమిలీ, సోదరా!"

నల్లటి పెద్దకళ్ళు మెల్లిగా తెరుచుకున్నాయి. చూపు ఇంకా శూన్యంగానే ఉందిగాని అందులో మందహాసం మొలకెత్తి పాలిపోయిన పెదవుల మీదికి దిగింది కిందకు వేలాడుతున్న చేతిని కదిలించి, ఎత్తి వక్షంమీద వేసుకున్నాడు.

"ఎమిలియో!" అంటూ ఆ యువతి దిగ్గున లేచింది. ఆమె ముఖ కవళిక విస్పష్టంగా తీవ్రంగా ఉంది. బావురుమని ఏడ్చేస్తుందో విరగబడి నవ్వుతుందో అనిపించింది.

"ఎమిలీ! యేమిటిదంతా ఎమిలీ?" అని గుమ్మం అవతలనుంచి వినవచ్చింది. షోకుగా ముస్తాబైన ఒక స్త్రీ తొందర తొందరగా అడుగులు వేసుకుంటూ చక్కా వచ్చింది. తెల్లటి జుట్టు, కారు రంగు శరీరం. ఆమె వెనకాలే ఇంకో ముదుసలి వచ్చాడు. వారి వెనకాల పనికత్తె మొహం కనిపించి మాయమవుతోంది.

వారిని కలుసుకోవడానికి ఆ యువతి పరుగెత్తుకుని వెళ్ళింది.

"బతికాడు, అమ్మా, బతికాడు !" అంది తల్లిని పిచ్చిగా కావలించుకుంటూ.

"అసలు యేం జరిగింది ?" అంది ఆ స్త్రీ. "యింటికి వచ్చేసరికి డాక్టరుగారు, లూయిసీ కనిపించారు."

ఆ యువతి జరిగిందంతా తల్లికి చెప్పింది. రోగికి క్రమక్రమంగా స్పృహ వస్తోంది. డాక్టరు మందహాసం చేస్తూ రోగిని సమీపించాడు. ఇంతమందిని గాబార పెట్టినందుకు సిగ్గుపడుతున్నట్టు కనిపించాడు రోగి.

"బ్రష్షలతో రుద్దుతున్నారా ?" అన్నాడు డాక్టరు సానిన్, పాంటలియోన్‌లను సంబోధిస్తూ. "బలేపని చేసారు. మంచి ఆలోచన.... యింకేం చికిత్స చేయాలో చూదాం...."

రోగి నాడిని పరీక్షించి, "హుం— నాలుక చూపించు" అన్నాడు డాక్టరు.

ఆ స్త్రీ ఆదుర్దాగా ఆ బాలుని మీదకు వంగింది. ఇంకా పెద్దగా మందహాసం చేసి, ఆమెకేసి దృష్టి మరలించి, ఆ బాలుడు సిగ్గుపడ్డాడు.

పానకంలో పుడకలా తా నెందుకని సానిన్ దుకాణంలోకి తిరిగి వెళ్ళిపోయాడు. వీధి తలుపు పిడిమీద చేయి వేసేలోపునే ఆ యువతి ప్రత్యక్షమై అతనిని ఆపుచేసింది.

"వెళ్ళిపోతున్నారా ?" అంది అతని మొహంలోకి దయతో చూస్తూ.

"మిమ్మల్ని ఆపేయాలని లేదు గాని సాయంకాలం తిరిగి వస్తా రని మాట యివ్వండి చాలు. మేము మీ కెంతో రుణపడి వున్నాం. మీరు సమయానికి వచ్చారు గాని లేకపోతే మా తమ్ముడు మాకు దక్కేవాడు గాదు మీకు కృతజ్ఞత తెలపాలని వుంది — అమ్మకి కూడా. మీ రెవరో మాకు చెప్పాలి. మాతో కులాసాగా గడపాలి...."

"కాని యీ రాత్రికి బెర్లిన్ వెళ్ళిపోతున్నానే!" అంటూ నత్తాడు సానిన్.

"చాలా వ్యవధి వుంది" అంది ఆ యువతి ఉత్సాహంతో. "యింకో గంటలో రండి. మాతో కలిసి కప్పు చాకొలేటు తీసుకుందురు గాని వస్తానని మాట యివ్వండి. నేను తిరిగి వాడి దగ్గరకు వెళ్ళాలి. వస్తారుగదూ ?"

"వస్తాను."

ఆ అందమైన వ్యక్తి అతని చేయి తొందరగా నొక్కి ఎగిరి పోయింది. మరుక్షణంలోనే అతను వీధిలో అడుగు పెట్టాడు.

# 4

గంటన్నర తరవాత సానిన్ రొట్టెల దుకాణానికి తిరిగివచ్చాడు. అతనిని వారు తమ స్వంత కుటుంబంలోని వానినిగానే ఎంచి ఆదరించారు. ఎమిలీ అదే సోఫాలో ఇంకా కూర్చునే ఉన్నాడు. డాక్టరు ఏదో మందు వ్రాసి ఇచ్చి రోగి ఉద్రేకికావడంవల్ల గుండె జబ్బుకు లోనయ్యే ప్రమాదం ఉంది, కాబట్టి ఏమాత్రం ఉద్రేకం రాకుండాచూడమని హెచ్చరించి వెళ్ళాడు. ఆ బాలునికి మూర్ఛ తరుచువస్తూ ఉంటుంది. కాని ఇంతసేపు, ఇంతతీవ్రంగా ఎన్నడూ రాలేదు. డాక్టరు ఇక ప్రమాదం లేదని చెప్పాడు. జబ్బుచేసి కోలుకుంటున్న వానికి తగినట్టుగానే ఎమిలీ వదులు అంగరఖా వేసుకున్నాడు. తల్లి అతని మెడకు ఉన్నిరుమాలు చుట్టింది. ఎమిలీ హుషారుగా సంతోషంగా కనిపించాడు. వాతావరణం కూడా పసందుగా ఉంది. సోఫా పక్కనే గుండ్రటిబల్లమీద చాకొలేటు కప్పులతో, షర్బతు సీసాలతో, బిస్కట్లతో, రొట్టెలతో, పువ్వులతో పెద్ద చీనా కాఫీభాండంతో విరాజిల్లుతోంది. ఆరు సన్నటి మైనపువత్తులు

పూర్వకాలపు వెండిసెమ్మాలు రెంటిలో వెలుగుతున్నాయి, సోఫాకుఇంకో పక్కన ఎత్తుపీపు పడకకుర్చీ చేతులు చాచి ఆహ్వానిస్తున్నట్టుంది. సానిన్‌ని ఆపడకకుర్చీలో కూర్చోపెట్టారు. టార్టాగ్లియా (కుక్క పేరు) పిల్లితోసహా ఆ దుకాణంలో నివసించేవారంతా అక్కడే ఉన్నారు. వారితోసానిన్‌కి ఆ రోజునే పరిచయమైంది. అందరూ అనిర్వచనీయ మైన ఆనందం అనుభవిస్తున్నట్టు కనిపించారు. కుక్కకూడా అతిసంతో షంతో తెగతుమ్మింది. పిల్లిమాత్రం కదలకుండా పూర్వంలాగానే గుడ్లు మిణకరించి ఇకిలించింది. సానిన్ తానెవరో, ఎక్కడనుంచి వచ్చాడో, పేరేమిటోచెప్పాడు. అతను తాను రష్యన్‌నని చెప్పుకునేసరికి అక్కడి స్త్రీలు కొద్దిగా ఆశ్చర్యం ప్రకటించారు, ఎగదిపిరి తీసారు. తల్లీ కూతు ళ్ళిద్దరూఒకేపర్యాయం మాట్లాడుతూ అతను జర్మన్ భాష మాట్లాడడం అద్భుతంగా ఉందనీ, తమకు ఫ్రెంచి బాగా అర్థమవుతుంది కాబట్టి కావాలంటే ఫ్రెంచి తమతో మాట్లాడవచ్చునీ చెప్పారు. సానిన్ ఈ అవకాశంజారవిడవలేదు. 'సానిన్! సానిన్!' రష్యన్‌పేరు ఉచ్చరించ డానికి ఇంత సులభంగా ఉంటుందని ఆ స్త్రీలు అనుకోలేదు. అతని అసలుపేరు డి - మిత్రీ - భేషుగ్గా ఉంది. తన పడుచుతనంలో 'డెమె ట్రియో ఎసాలిబియో' అనే రమణీయమైన సంగీతనాటకం విన్నాననీ 'డెమెట్రియో' కన్న 'డిమిత్రీ' బాగుందనీ ఆ యువతి తల్లి చెప్పింది. ఈ విధంగా సానిన్ సుమారు గంటసేపు బాతాఖానీ కొట్టాడు. ఆ స్త్రీలు కూడా తమతమ స్వీయజీవిత వివరాలను సానిన్‌కు తెలియజేసారు. ఆ తల్లి సంభాషణ అంతా తాను గుత్తకు పుచ్చుకుందా అనుకునేటట్టు మాట్లాడింది. ఆమె పేరు అమొనోరా రోసెల్లీ. భర్తపేరు జియోవనీ బాటిస్టారోసెల్లీ. ఇరవై అయిదు సంవత్సరాల క్రితం ఫ్రాంక్‌ఫోర్టులో సముద్రపుటొడ్డున రొట్టెల దుకాణం పెట్టాడు. అతను మరణించినా ఆమె తిరిగి వివాహం చేసుకోకుండా అలాగే ఉండిపోయింది. ఆ జియోవనీ బాటిస్టా విసెన్‌జెన్‌నుంచి ఫ్రాంక్‌ఫోర్ట్ వచ్చాడు. మనిషి మంచివాడే కాని కాస్త కోపిష్టి, కలహప్రియుడు, రిపబ్లికను. ఈ విషయాలన్నీ చెపుతూ ఆమె సోఫాపైన ఉన్న తైలచిత్రాన్ని సానిన్‌కు వేలితో చూపిం

చింది. ఆ చిత్రకారుడుకూడా రిపబ్లికనే! ఈమాట చెపుతూ రోసెల్లీ నిట్టూర్చింది. ఆ చిత్రంలో చిత్రకారుడు పోలిక ఎక్కువగా తీసుకురాలేక పోయాడు. జియోవనీ బాటిస్టా ఆ చిత్రంలో దోపిడిదొంగలా ఉన్నాడు. మొహం భయంకరంగా ఉంది. రోసెల్లీ సతిది పార్మాపట్టణం. ఆపట్టణం పురాతనమైంది, రమణీయమైంది. అక్కడి చర్చిమీద అమరచిత్ర కారుడు కొరెగియో కుడ్య చిత్రాలు గీసాడు. ఆమె జర్మనీలో చాలాకాలం పాటు నివసించడంవల్ల పూర్తిగా జర్మనీ దేశస్తురాలైపోయింది. విచారంతో తల పంకిస్తూ తన సర్వస్వమల్లా ఆ కొడుకూ కూతురేనని చెప్పింది (అలా చెపుతూ ఆ ఇద్దరినీ వేలితో చూపింది). కూతురుపేరు జెమ్మా, కొడుకుపేరు ఎమిలీ. ఇద్దరూ మంచివాళ్లే. ఇద్దరూ చెప్పినట్టు వినేవాళ్లే. అందులో ఎమిలీ మరీను. (నేను చెప్పినట్లు వినడం లేదా యేం?' అంది కూతురు, 'నువ్వూ రిపబ్లికనువే!' అని జవాబిచ్చింది తల్లి). బాటిస్టా రొట్టెల వ్యాపారంలో మంచి నేర్పరి. అతని జీవితకాలంలో లాగా ఇపుడు వ్యాపారం సాగడంలేదు....('బలేజోరుగా సాగేది!' అన్నాడు పాంటలియోన్) అయినా పరవాలేదు.

# 5

జెమ్మా చిరునవ్వు నవ్వుతూ, నిట్టూరుస్తూ, తల్లిబుజం, తట్టుతూ వేలితో తల్లిని బెదిరిస్తూ, మధ్య మధ్య సానిన్ కేసి చూస్తూ తల్లిమాటలు వింది. కొంచెంసేపైన తరవాత లేచి తల్లిచుట్టూ చేతులువేసి గడ్డంకింద, మెడమీద ముద్దుపెట్టుకుని విరగబడి నవ్వేటట్లు చేసింది. పాంటలియోన్‌ను కూడ సానిన్‌కు పరిచయం చేసారు. అతను సంగీత నాటకాలలో ఒకపుడు పాడుతూండేవాడు గాని నాటకాలు మానివేసి ఇపుడు రోసెల్లీ కుటుంబంలో ఒకడు అయ్యాడు. స్నేహితుడుకాదు, సేవకుడుకాదు. అదొక రకం బాంధవ్యం. జర్మనీలో చాలాకాలంగా నివసిస్తున్నా జర్మన్ భాష సరిగా మాట్లాడలేడు. ఆ భాషలోని తిట్లుమాత్రం అతనికి పట్టుబడ్డాయి. వాటినైనా ఉచ్చరించడంలో తగలబెట్టేవాడు. ప్రతిజర్మనీవాడినీ 'అంట్లవెధవ' అనేవాడు. సినిగాగ్నియాలో పుట్టి పెరగడంచేత ఇటాలియన్ భాషను నిర్దుష్టంగా మాట్లాడగలడు. ఇప్పటికీ అక్కడ సామాన్య భాష ఇటాలియనే.

ప్రమాదం తప్పిన తరవాత జబ్బునుంచి కోలుకుంటున్నప్పటి మానవుని లాగానే ఎమిలీ కూడా ఒళ్ళు తెలియని సంతోషంలో పడిపోయాడు. ఆ కుటుంబంలో వారి కందరికీ అతను గారాబుకూచి. సిగ్గుపడుతూ సానిన్‌కి కృతజ్ఞత తెలిపాడు. కాని ఎక్కువసేపు తీపి పదార్థాలు, షర్బతు సేవించడంలో నిమగ్నుడయ్యాడు. సానిన్ రెండు పెద్ద కప్పుల చాకొలేటు, ఇన్ని బిస్కట్లు తినక తప్పింది కాదు. ఒకటి పుచ్చుకోవడం పూర్తికాగానే జెమ్మా ఇంకొకటి తెచ్చి సానిన్ ముందుపెట్టేది. సానిన్ తినడని మూర్ఛించలేక పోయాడు, త్వరలోనే స్వంత ఇంట్లో ఉన్నట్లే అతనికి అనిపించింది. కాలం ఇట్టే గడిచిపోయింది. ఎన్నో

విషయాలు-రష్యాను గురించి, రష్యన్ వాతావరణం గురించీ, రష్యన్ రైతులను గురించీ ముఖ్యంగా కొసాకులను గురించీ-చెప్పవలసి వచ్చింది. అంతేకాదు 1812 యుద్ధం, పీటర్ ది గ్రేట్, క్రెమ్లిన్, రష్యన్ గీతాలు, చర్చి గంటలు-వీటన్నిటి గురించీ చెప్పక తప్పిందికాదు. ఎక్కడో మారు మూలనున్న మన జన్మభూమి సరిహద్దులను గురించి మాత్రమే ఆ మహిళ లిద్దరికీ అస్పష్టంగా తెలుసు. అంతే. ఇంకేమీ తెలియదు. రోసెల్లీని సామాన్యంగా ఫ్రా లెనోరీ అని పిలుస్తారు. కిందటి శతాబ్దంలో పీటర్స్‌బర్గ్‌లో స్థాపించిన 'హిమానీ గృహం' ఇంకా నడుస్తోందా అని ఆమె అడిగేసరికి సానిన్ ఆశ్చర్యపోయాడు. ఇటీవలనే ఆమె భర్త పుస్త కాలు ఒక దానిలో ఆ హిమానీ గృహం మీది మంచి వ్యాసం చదివింది. సానిన్ ఆశ్చర్యం ప్రకటిస్తూ "రష్యాలో వేసవి అంటూ వుండదంటారా?" అని అడిగాడు. రష్యా నిరంతరం మంచుతో కప్పబడి ఉంటుందనీ, అంతా ఉన్నికోట్లు తొడుక్కొని మరీ తిరుగుతారనీ, పురుషు లంతా సైనికులనీ, ఆతిథ్యం ఇవ్వడంలో ప్రసిద్ధులనీ, రైతులు సాధుస్వభావులనీ ఇంతవరకు తాను భావిస్తున్నట్టు ఫ్రా లెనోరీ ఒప్పుకుంది. సానిన్ ఆ తల్లీ కూతుళ్ళిద్దరికీ సరైన సమాచారం అందజేయడానికి తంటాలు పడ్డాడు. రష్యన్ సంగీత ప్రసక్తి వచ్చింది. వెంటనే రష్యన్ గీతం ఒకటి పాడి వినిపించమని అందరూ సానిన్‌ని వేడుకున్నారు. ఆ గదిలో ఉన్న చిన్న పియానో అతని దృష్టిలో పడింది దానికి నల్లమెట్లు బదులు తెల్లనివి, తెల్లవాటి బదులు నల్లనివి ఉన్నాయి. అట్టే బలవంతం చేయించుకో కుండానే కుడిచేతి వేళ్ళు రెంటితోను, ఎడమచేతి వేళ్ళు మూటితోను (బొటనవేలు, మధ్యవేలు, చిటికెనవేలు) వాయిస్తూ మంద్రంలో 'రెడ్ సారఫాన్', 'కాలిబాటవెంట' అనే రెండు గేయాలు ఒకటి తరవాత ఒకటి పాడాడు. ఆ స్త్రీలు అతని స్వర మాధుర్యాన్ని సంగీత నైపుణిని పొగిడారు. అన్నిటికీ మించి రష్యన్ భాషలోని మృదుత్వాన్ని, మాధు ర్యాన్ని మెచ్చుకుని ఆ గీతాలలోని సాహిత్యాన్ని అనువదించి చెప్ప మన్నారు. సానిన్ వారి అభిమతం తీర్చాడు. కాని 'రెడ్‌సారఫాన్', 'కాలిబాటవెంట'లోని సాహిత్యం శ్రోతలలో రష్యన్ సాహిత్యం

త్యం అంటే గొప్ప భావం కలిగించవేమో నని పుష్కిన్ రచించిన 'మరపురాని ఆనంద ఘడియలు' అనేపద్యాలు మొదటచదివి, తర్వాత అను వదించి చెప్పి, ఆ తరవాత పాడి వినిపించాడు· ఆపద్యాలకు గ్లిన్‌కా సంగీతం కూర్చాడు. ఈసారి స్త్రీలు మహోత్సాహం చూపారు ఫ్రాలెనోరీ రష్యన్ భాషకు, ఇటాలియన్ భాషకు అసాధారణమైన సామ్యం ఉందని కనిపెట్టింది. పుష్కిన్, గ్లిన్‌కా - ఆ పేర్లే ఆమెకు చిరపరిచితమైనట్లు ధ్వనించాయి. సానిన్ వారిని పాడమని కోరాడు. వారూ బెట్టుచేయకుండా పాడడానికి అంగీకరించారు. ఫ్రాలెనోరీ పియానో ముందు కూర్చుంది. ఆమె, జెమ్మా కలిసి సంవాద గీతాలు పాడారు. తల్లిగొంతు ఒకపుడు మంచిదై ఉండాలి కూతురు గొంతులో బిగువులేదు గాని విన సొంపుగా ఉంది.

# 6

జెమ్మా కంఠస్వరాన్ని కంటె జెమ్మానే సానిన్ ఎక్కువగా మెచ్చుకున్నాడు. వారి వెనక ఒక పక్కన కూర్చుని ఆమె శరీర లావణ్యం ముందు ఏ తాళవృక్షమూ, తాళవృక్ష మేమిటి, ఆ మాటకు వస్తే, ఆనాడు బాగా ప్రజాదరణ పొందుతున్న బెనెక్టోవ్ పద్యాలుకూడా కొరగావని తలపోసాడు. రసవత్తరమైన ఘట్టాలు చదివేటపుడు కళ్ళుపైకెత్తి ఆమె ఇంటి కప్పువంక చూసేది. అటువంటప్పుడు దేవతలు కూడా ఆ చూపుకు లొంగిపోకుండా ఉండలేరని భావించాడు. ముసలి పాంటలియోన్ కూడా - ద్వారబంధానికి ఆనుకుని, వెడల్పాటి మెడ పట్టీలో గడ్డం, నోరు మాటుపడిపోతూంటే, విమర్శకునిలాగా గంభీరంగా వింటూ - ఆ బాలిక మొహం చూసి మెచ్చుకోకుండా ఉండలేకపోయాడు, ఇటువంటి దృశ్యం చూడడం అతనికి అల

వాటే. సంవాదగేయం పూర్తికాగానే ఫ్రా లెనోరీ ఎమిలీ గొంతు చాలా మంచిదని, కంచుగొంతని, గొంతుమారిపోయే వయసు వచ్చినందున పాడనీయడం లేదనీ తెలిపింది. అతిథిగౌరవార్థం పాంటలియోన్ పూర్వం లాగానే మళ్ళీ ఎందుకు పాడకూడదు ? వెంటనే పాంటలియోన్ అసంతృప్తి వైఖరి అవలంబించి. చేతితో జుట్టు గీరుకొని, మొహం ముడుచుకున్నాడు. "అదంతా యెన్నడో వదిలేసాను. పడుచుదనంలో వుండగా మంచి పేరు సంపాదించాను. నిజమైన, శాస్త్రీయమైన సంగీతం ఆదరణ పొందిన మహాయుగానికి చెందిన వాడిని. యిక యీ తరంవాళ్ళో కీచుకీచు మంటారు. నాటికీ నేటికీ పోలికేలేదు, నాటి సంగీతానికి నిజమైన బాణీ వుండేది. నాకు, పాంటలియోన్ సిప్పాటోలాకు మొదెనాలో పూలమాలలు వేసి సన్మానించారు. సరిగ్గా అదే సమయంలో నాటకశాలలో తెల్లపావురాలు యెగరవేసారు." అన్నాడు. అతనికి టార్బస్కీ అనే రష్యన్ స్నేహితుడుండేవాడు. రాత్రిపూట భోజనాల సమయంలో 'రష్యా రా, వచ్చావంటే బంగారం రాసులు రాసులు దొరుకుతాయి' అని ఆహ్వానించాడు, కాని పాంటలియోన్‌కి ఇటలీని, డాంటీ మహాకవి జన్మించిన ఇటలీని, విడిచి వెళ్ళడానికి మనస్కరించలేదు. ఆ తరువాత దురదృష్టవశాత్తు కొన్ని సంఘటనలు జరిగాయి. తగినంతగా ముందు జాగ్రత తీసుకోలేదు....ఇంతవరకు చెప్పి ఆ ముదుసలి ఇక తట్టుకోలేక పోయాడు కనురెప్పలు వాల్చి ఒకటి రెండుసార్లు గట్టిగా నిట్టూర్చాడు. మళ్ళీ శాస్త్రీయ సంగీతయుగాన్ని గురించీ, గార్సియా అనే సుప్రసిద్ధ పాటకుడిని గురించీ చెప్ప నారంభించాడు. గార్సియా అంటే అతనికి అపరిమిత గౌరవం.

"అతడూ మనిషంటే! నేటి వారిలాగా యెన్నడూ గొంతుచించుకునేవాడు కాదు. మంద్రంలో పాడేవాడు." ఆ ముదుసలి వడలిపోయిన పిడికిలితో చొక్కా అంచు పట్టుకుని "యెటువంటి నటుడు! యెటువంటి నటుడు! అగ్నిపర్వతం! వెసూవియస్ అగ్నిపర్వతం! ఒకమాటు అతనితో కలిసి ఒథెల్లో నాటకంలో పాడే గౌరవం, ఆనందం నాకు కలిగాయి. గార్సియా ఒథెల్లో పాత్ర, నేను ఇయాగో పాత్ర వహించాం.

ఈ మాటల దగ్గరకు వచ్చేసరికి...." ఇక్కడ పాంటలియోన్ ఒక భంగిమ పట్టి వణికే బొంగురుగొంతుతో పాడాడు. గొంతు బొంగురుగా ఉండి వణుకుతున్నా హృదయాన్ని తాకేదిగా ఉంది. "ప్రేక్షకలోకం వూగిపోయిందనుకోండి. నేను మాత్రం తక్కువ తిన్నానా? అతని తరవాత నేనూ పాడాను." అని తనూ పాడాడు.

"హఠాత్తుగా పురుములాగా, పెద్ద పులిలాగా 'పగ! పగ!" అని అరిచాడు.

"మాట్రిమోనిమో సెగ్రెటో-ప్రియాచేస్తుంటే అనే నాటకంలోని సుప్రసిద్ధ గేయం విని తీరాల్సిందే. అద్భుతం!"

ఆ ముదుసలి అసాధారణమైన గేయం ప్రారంభించి, గొంతు సవరించుకుని, చేయి ఆడిస్తూ పక్కకుతిరిగి, "నన్నెందుకు బాధపెడతారు?" అన్నాడు. జెమ్మా వెంటనే కుర్చీలోనుంచి దిగ్గున లేచి చప్పట్లుకొడుతూ "బలే, బలే!" అని కేకలు పెడుతూ ఆ దురదృష్ట జాతకుని దగ్గరకు పరుగున వెళ్ళింది. రెండు చేతులతో ప్రేమతో అతని బుజాలమీద తట్టింది. ఎమిలీ ఒకడే నిర్దాక్షిణ్యంగా నవ్వాడు. చాలాకాలం కితమే లాఫాన్‌టయిన్ 'ఈ యుగంలో దాక్షిణ్యంలేదు' అని వ్రాయనే వ్రాసాడు.

అ ముసలి పాటకుని ఓదార్చాలని సానిన్ యత్నించాడు, డాంటేని గురించి ఇటాలియన్ భాషలో అతనితో మాట్లాడాడు. కాని పాంటలియోన్ ఉపశమించలేదు. మెడ పట్టీలోకి గడ్డం ఇంకా ఎక్కువ వంచుకుని విచారంగా తేరిపార జూసాడు. పక్షిలాగా, అందులోనూ కోపంతో ఉన్న మాలకాకిలాగా, గద్దలాగా కనిపించాడు. గారాబంగా చూడబడే పిల్లవాని తాత్కాలికపు సిగ్గుతో ఎమిలీ సోదరివేపు తిరిగి, "మాల్ట్జ నాటకాలు నువు బాగా చదువుతావు, యీ అతిధిని సంతోషపెట్ట దలిస్తే మాల్ట్జ నాటకం ఒకటి చదివి వినిపించడం యుత్తమం" అన్నాడు జెమ్మా నవ్వి నువెపుడూ చమత్కారంగా మాట్లాడతావంటూ అతని చేతిమీద కొట్టింది. అయినప్పటికీ వెంటనే తన గదిలోకి వెళ్ళి చిన్న పుస్తకం ఒకటి పట్టుకుని చక్కా వచ్చింది. మేజాబల్ల ముందు దీపానికి దగ్గరగా కూర్చుని

చుట్టూ చూసింది. 'నిశ్శబ్దంగా వుండండి' అని చెప్పడానికా అన్నట్లు వేలు పైకెత్తి (ఇది పూర్తిగా ఇటలీవారి చేష్ట) చదవ నారంభించింది.

# 7

మాల్ట్జ 1830 ప్రాంతంలో ఫ్రాంక్‌ఫోర్టులో నివసించిన రచయిత. స్థానిక వ్యవహారభాషలో చిన్న చిన్న తేలిక నాటకాలు వ్రాసాడు. ఆ నాటకాలలో స్థానిక జనులను అపహాస్యం చేసాడు అ హాస్యం నిర్దుష్ట మైంది కాకపోయినా రంజింప జేస్తుంది నాటకవృత్తిలో ఆరితేరిన నటి లాగా జెమ్మా చదవగలదని తేలిపోయింది. ఆనువంశికంగా వచ్చిన అను కరణ శక్తితో ఆయా పాత్రల ప్రత్యేక వైఖరులను ద్యోతకం చేసేది. పిచ్చివాని పాత్రగాని, తెలివి తక్కువ పెత్తందారు పాత్రగాని చదివే టపుడు దివ్యమైన గొంతే, అందమైన మొహమే అనుకోకుండా నవ్వు పుట్టించేటట్టు మొహం వికృతంగా పెట్టేది, కళ్ళు కుంచిచుకునేది, ముక్కు ముడుచుకునేది, నత్తేది, కీచుకుని అరిచేది....చదువుతూన్నంత సేపూ నవ్వేదికాదు. కాని శ్రోతలు విరగబడి నవ్వుతూ చదువుకు అడ్డం వచ్చినపుడు పుస్తకాన్ని మోకాళ్ళమీదికి జారవిడిచి, తల వెనకకు వంచి, తానూ విరగబడి నవ్వేది అలా నవ్వుతూంటే ఉంగరాల జుట్టు మెడ మీదా, వణికే బుజాలమీద పడి నృత్యం చేసేది. నవ్వు అణిగిపోగానే మళ్ళీ పుస్తకం తీసుకుని తగిన ముఖ కవళికతో గంభీరంగా చదవ నారంభించేది. సానిన్ ఆమెను మెచ్చుకుంటూ తన్మయుడై పోయాడు., అంతటి అందమైన మొహం, అంత తేలికగా ఎలా హాస్యకారి అయిందీ, ఎలా సామాన్య కవళికను అలవర్చుకుందీ అని విస్తుపోయాడు. యవ్వన వతుల పాత్రలు జెమ్మా అంత నేర్పుగా చదవలేక పోయేది. ఇక ప్రేమ రంగాలు సంబాళించలేదు. వాటిలోని ప్రమాణాలలో, గంభీరోపన్యాసా

లలో తనకు నమ్మకం లేదన్నట్టు వెక్కిరింపుగా చదివేది. అసలు రచయితే ఇటువంటివి సాధ్యమైనంత వరకు వదిలివేసాడు.

సాయంకాలం ఎలా గడిచిపోయిందో సానిన్ గమనించనే లేదు. గడియారం పది కొట్టేసరికి ప్రయాణం సంగతి జ్ఞాపకం వచ్చింది. ఏదో కుట్టిన వాడిలాగా దిగ్గున లేచాడు.

"యేమిటి సంగతి!" అని అడిగింది ఫ్రా లెనోరీ.

"యివాళ రాత్రే బెర్లిన్‌కి బయలుదేరాలి. అంచెబండిలో సీటు కుదుర్చుకున్నాను"

"అంచెబండి యెపుడు బయలుదేరుతుంది ?"

"పదిన్నరకు"

"యెలాగూ ఆలస్యమైందా, వుండిపొండి. చదువుతాను" అంది జెమ్మా.

"డబ్బంతా రొఖ్ఖంగా యిచ్చేసారా లేక హుండీ యిచ్చారా ?" అని అడిగింది ఫ్రా లెనోరీ.

"అంతా యిచ్చేసాను" అంటూ సానిన్ నేర్పుగా ఒత్తి ఒత్తి పలుకుతూ మూలిగాడు.

జెమ్మా కళ్ళు కుంచించుకుని నవ్వేసరికి, అలా నవ్వకూడదని తల్లి మందలించింది.

"యీ పెద్దమనిషి వృథాగా డబ్బు తగలేసుకున్నాడు. పాపం! నవ్వుతావా, తప్పుకాదూ ?"

"మరేం పరవాలేదులే" అంది జెమ్మా. "యింత మాత్రంతో ఆయనేం కుంగిపోడు. ఓదారుద్దాంలే. కొంచెం నిమ్మ షర్బతు తీసుకోండి."

సానిన్ గ్లాసెడు నిమ్మ షర్బతు తాగాడు. జెమ్మా మళ్ళీ మాల్ట్జ నాటకం చదవ నారంభించింది. పూర్వం మాదిరిగానే హాయిగా సాగిపోతోంది.

గడియారం పన్నెండు కొట్టింది. శెలవు తీసుకుని వెళ్ళిపోవడాని కని సానిన్ లేచాడు.

"మీ రింకా కొద్ది రోజులపాటు యీ పట్నంలో వుండిపోండి. తొందరేమొచ్చింది? యింకే పట్నంలోనూ యింత హాయిగా వుండదు." కొంచెం ఆగి, మళ్ళీ, "నిజంగానే, యింత హాయిగా వుండదు." అంది మందహాసం చేస్తూ.

సానిన్ జవాబియ్యలేదు. డబ్బులేదు. వెళదామనుకున్నా వెళ్ళటానికి వీలులేదు. బెర్లిన్‌లోని ఒక స్నేహితుడికి అప్పుగా డబ్బు పంపమని వ్రాసి తెప్పించుకునే వరకు ఎలాగూ ఉండిపోవలసిందేనని తనలో తాను అనుకున్నాడు.

"అవును వుండిపోండి" అంది ఫ్రా లెనోరీ. "జెమ్మా వరుడికి మిమ్మల్ని పరిచయం చేస్తాం. అతని పేరు కారల్ క్లూబర్. దుకాణంలో తీరికలేక యివాళ యిక్కడికి రాలేదు. జీర్‌లో చూసేవుంటారు. బట్టల దుకాణం. యీ పట్నంలో కల్లా పెద్దది. పెత్తనమంతా అతనిదే. మీ పరిచయమైతే సంతోషిస్తాడు."

ఈ సమాచారం ఎందుకో దేవుడికే తెలియాలి - సానిన్‌ను విచార గ్రస్తుణ్ణి చేసింది. 'అదృష్టవంతుడు' అనే మాట అతని మనసులో మెరిసింది. జెమ్మాకేసి తేరిపార జూసాడు. ఆమె కళ్ళల్లో పరిహాసం ద్యోతక మవుతున్నట్లు అతనికి అనుమానం వేసింది. శెలవు తీసుకోవడం ప్రారంభించాడు.

"రేపు కలుసుకుందాం. తప్పకుండా వస్తావుగదూ?" అని అడిగింది ఫ్రా లెనోరీ.

"రేపు మళ్ళీ కలుసుకుందాం!" అంది జెమ్మా అనుమానంతో కాక నిశ్చితంగా వచ్చి తీరతాడనే అభిప్రాయం వెల్లడించే స్వరంతో.

"రేపు మళ్ళీ కలుసుకుందాం!" అని జవాబిచ్చాడు సానిన్.

ఎమిలీ, పాంటలియోన్, టార్టగ్లియా (కుక్క) వీధి మూలదాకా వెళ్ళి సానిన్‌ని సాగనంపి వచ్చారు. జెమ్మా నాటక పఠనంమీద అసంతృప్తిని వెల్లడించకుండా పాంటలియోన్ ఉండలేకపోయాడు.

"సిగ్గుపడాల్సింది ! వికృతంగా అలా మొహం పెట్టడం, కీచు మని అలా పాడడం, అబ్బే ! బాగాలేదు. యెవరైనా పెద్ద పెద్ద విషాద పాత్రలు మెరోపీ, క్లిటెమ్నెస్టరాలాంటివి నటించాలి. అందుకు బదులు చెత్త జర్మన్‌నాటకాలు అనుకరించి చదువుతోంది. ఆమాత్రం నేనూ చదవగలను" అన్నాడు బొంగురుగొంతుతో, గడ్డంముందుకు పెట్టి, వేళ్ళు ఎడంచేసుకుంటూ.

టార్టాగ్లియా భౌమని మొరిగింది. ఎమిలీ విరగబడి నవ్వాడు. ఆ ముదుసలి హఠాత్తుగా వెనుదిరిగి వెనకకు వెళ్ళిపోయాడు.

సానిన్ 'శ్వేతహంస' (హోటలు)కు తిరిగి వెళ్ళాడు (సామానంతా అక్కడే ఉంది). ఆశ్చర్యం వేసింది. ఆనాటి జర్మన్ - ఫ్రెంచి-ఇటాలియన్ భాషలలో సంభాషణ అతని చెవులలో గింగురుమంది.

"వరుడు !" అని మెల్లగా అనుకున్నాడు ఆ చవుకబారు హోటలు గదిలో పడుకుని. "యేమా అందం ! యింతకీ నేను యెందుకు వుండి పోయినట్టు ?"

ఆ మర్నాడు బెర్లిన్‌లోని స్నేహితునికి డబ్బుకోసం జాబు వ్రాసాడు.

# 8

తెల్లవారింది. సానిన్ లేచి దుస్తులు ధరించకముందే ఎవరో ఇద్దరు పెద్దమనుషులు మిమ్మల్ని చూడడానికి వచ్చారని హోటలు నౌకరు వచ్చి చెప్పాడు. తీరాచూస్తే ఆ ఇద్దరిలో ఒకడు ఎమిలీ. ఇక రెండవ వ్యక్తి- బాగా ఎదిగిన యువకుడు. ఆకర్షణీయమైన రూపం, తీర్చి దిద్దినట్లున్న అంగసౌష్ఠవం - జెమ్మా వరుడు హెర్ కారల్ క్లూబర్.

ఫ్రాంక్‌ఫోర్ట్ పట్టణంలోని ఏ దుకాణంలోనూ క్లూబర్ అంతటి నాగరీకుడు, మర్యాదస్తుడు, గంభీరుడు, సరసుడు లేడు. అతని పై ఖరి లోని హుందాతనానికి, ప్రవర్తనలోని ఆకర్షణీయమైన లాలిత్యానికి అనుగుణంగా ఉన్నాయి నీటైన దుస్తులు. నిజం! అతని ప్రవర్తన ఇంగ్లీషువారి ప్రవర్తన. రెండేళ్లు ఇంగ్లండులో గడిపాడు. మొదటి చూపు లోనే అందంగా, కొద్దోగొప్పో తీవ్రంగా, అతిమర్యాదగా, పరిశుభ్రంగా ఉండే ఈ యువకుడు పై అధికారులకు లొంగిఉండి, తన కిందివారిని అదమాయించడానికి అలవాటు పడ్డ వ్యక్తి అనీ, దుకాణం గల్లాపెట్టె వెనక కూర్చుని ఖాతాదార్లలో గౌరవం రేకెత్తించగలడనీ విశదమవు తుంది. పిండిపెట్టిన మెడపట్టీ చూస్తే చాలు అతను అమిత నిజాయితీ పరుడని నమ్మకం కుదురుతుంది, సందేహానికి తావుండదు. ఇక అతని గొంతు మెత్తనిది. విశ్వాసంతో ప్రతిధ్వనించే గొంతు. కాని పెద్దగొంతు కాదు.నాదంలో సౌకుమార్యం తొణికిస లాడుతుంది. అటువంటి గొంతు, 'ఆ కెంపురంగు మొఖమల్లు వారికి చూపించు', 'ఆవిడగారికి కుర్చీ తెచ్చివెయ్యి' అని దుకాణంలో పనిచేసేవారికి ఆజ్ఞలు జారీచేయడానికి బాగా అనువైన గొంతు.

హెర్ క్లూబర్ తనను తాను పరిచయం చేసుకుంటూ సంభాషణ ప్రారంభించాడు. పరిచయం చేసుకోవడంలో శరీరాన్ని వంచిన తీరు, మెచ్చుకోలుగా పాదాలుకదలించిన తీరు, మర్యాదగా మడమ మడమ తాకిన తీరు చూస్తే అతని దుస్తులు, గుణగణాలు మొదటి తరగతికి చెందిన వని భావించకుండా ఎవరూ ఉండలేరు. ఇక కుడిచేయి - తొడుగులేదు. (ఎడమచేతికి చదును చేయని తోలు తొడుగు, ఎత్తు హాటు పైభాగం నున్నగా అద్దంలా ఉంది. హాటుగుబ్బమీద రెండో తొడుగు.) నమ్రతతో, నమ్మికతో కుడిచేతిని సానిన్‌కి అందించాడు. ఆ చేయి రూపు నమ్మ శక్యం గాదు. ఒక్కొక్క వేలూ ఒక్కొక్క కళాఖండంలా ఉంది! అతి చక్కటి జర్మన్ భాషలో, తనకు కాబోయే బావమరిదికి అంత సేవ చేసినందుకు కృతజ్ఞతాభి వందనాలు తెలపడానికి వచ్చానని చెప్పాడు. ఇలా చెపుతూ ఎదమచేతిని ఎమిలీ దిక్కుగా ఆడించాడు. ఎమిలీ కంగారు పడ్డవానిలాగా కిటికీ వేపుకు తిరిగి వేలు నోట్లో పెట్టుకున్నాడు. ఆ విదేశీయునికి (సానిన్‌కి) తాను ఉపకృతి చేయగలిగితే ఎంతో సంతోషిస్తానని కూడా క్లూబర్ తెలిపాడు. సానిన్ తడబడుతూ జర్మన్ భాషలో వారిని కలుసుకోవడం తనకూ సంతోషదాయకంగానే ఉందనీ, తాను చేసిన సేవ అల్పమనీ చెప్పి కూర్చోవలసిందిగా కోరాడు. హెర్ క్లూబర్ సానిన్‌కి కృతజ్ఞత తెలపి కోటుఅంచులు మెరుపువేగంతో జాపి కుర్చీలో కూలబడ్డాడు, కుర్చీలో తేలికగా ముండ్లమీద కూర్చునట్లు కూర్చున్నాడు. ఏదో మ ర్యా ద కో స ం కూర్చున్నాడే గాని ఏ నిమిషాన లేచి చక్కాబోతాడో అని అనిపించింది. నిజంగానే వెంటనే లేచి చక్కాబోయాడు. వెళుతూ చమత్కారంగా నమ్రతతో అడుగువేసి దుకాణానికి తొందరగా వెళ్ళవలసి ఉండడంవల్ల ఇక ఏ మాత్రం నిలవడానికి వీల్లేదు - వ్యాపారంముందు ఆ తరవాత తక్కినవి అని చెప్పి, మర్నాడు ఆదివారం అవడంవల్ల ఫ్రా లెనోరీ, జెమ్మాల అనుమతితో సోడెన్‌కు వినోదయాత్ర ఏర్పాటు చేసాననీ దానికి అతనిని ఆహ్వానించే భాగ్యం లభించినందుకు సంతోషిస్తున్నాననీ వినోదయాత్రకు విచ్చేసి తరింపజేస్తారని విశ్వసిస్తున్నాననీ తెలిపాడు. సానిన్ వినోద

యాత్రకు వెళ్ళి తరింపజేయడానికి నిరాకరించలేదు. గౌరవాభివందనాలు తిరిగి తెలియజేసి హెర్ ష్లూబర్ వెళ్ళిపోయాడు. బటానీ పచ్చపట్లాం సొగసుగా తళుక్కుమంది. నిగనిగలాడే కొత్తబూట్లుకూడా ఇంపుగా కిర్రుమన్నాయి.

# 9

సానిన్ కూర్చోమని ఆహ్వానించినా ఎమిలీ కూర్చోకుండా కిటికీ దగ్గరే నిలబడ్డాడు. కాబోయే బావగారు వెళ్ళిపోయిన మరుక్షణంలోనే వెనుదిరిగి సిగ్గుపడుతూ ఇంకా కొంచెంసేపు అక్కడ ఉండవచ్చా అని అడిగాడు చంటిపిల్లవానిలాగా మూరాంచేస్తూ. "యివాళ నా వంట్లో కులాసాగా వుంది. కాని డాక్టరు పనేమీ చేయకూడదన్నాడు."

"ఓ- అలాగేవుండు, నాకేమాత్రం అడ్డుకాదు." అన్నాడు సానిన్ ఏ పనీ చేయకుండా కూర్చోడానికి వంక దొరికితే చాలు సంతోషించే నిజమైన రష్యన్‌లాగా.

ఎమిలీ అతనికి కృతజ్ఞత తెలిపాడు. బహు కొద్ది సేపటిలోనే అతనిని చనువు చేసుకున్నాడు. గదితో పరిచయు మేర్పరచుకున్నాడు. సానిన్ వస్తువులను పరిశీలించాడు. ప్రతి వస్తువు ఎక్కడ కొన్నదీ, ఎందుకు ఉపయోగపడేది అడిగి తెలుసుకున్నాడు. క్షవరం చేసుకోవడంలో సానిన్‌కు సాయపడ్డాడు. మీసాలు పెంచితే బాగుంటుందని సూచించాడు. తల్లిని గురించి, అక్కను గురించి, పాంటలియోన్‌ను గురించి, టార్టాగ్లియాని గురించీ వారు జీవించే విధానం గురించి, ఎన్నో వివరాలు సానిన్‌కి తెలియజేసాడు. అంతకు ముందున్న సిగ్గంతా మాయమైపోయింది. సానిన్ ఆ కిందటి రోజున ప్రాణం రక్షించడం వల్లగాక మనిషి మంచివాడవడం వల్ల ఎమిలీ అతని ఆకర్షణకు లోను

గాకుండా ఉండలేక పోయాడు. వెనువెంటనే సానిన్‌కు తన రహస్యా లన్నీ చెప్పేసాడు. తల్లి తనచేత వ్యాపారం చేయించాలని నిశ్చయించిందని ప్రత్యేకంగా నొక్కి చెప్పాడు. తాను జన్మతా కళాకారుడననీ, సంగీతజ్ఞుడననీ, పాటకుడననీ, నాటక రంగమే తనకు తగిన వృత్తి అని గట్టిగా నమ్ముతున్నాననీ తెలిపాడు. పాంటలియోన్ కూడా అతనిని ప్రోత్సహించాడు. హెర్ క్లూబర్ వాళ్ళ అమ్మ పక్షం వహించాడు. ఆమె దగ్గిర అతని పలుకుబడి ఎక్కువ. అసలు ఎమిలీ వ్యాపారంలోకి దిగాలనే భావం క్లూబర్ మనసులో పుట్టిందే. వ్యాపారం కంటె గొప్ప వృత్తి లేదని క్లూబర్ అభిప్రాయం. ముఖమలు గుడ్డలు అమ్మడం, బేరగాళ్ళను మోసగించడం, వాళ్ళ దగ్గిరనుంచి అధిక ధరలు గుంజడం-ఇదీ క్లూబర్ జీవితాశయం!

"సరేగాని, వేళయింది, యింటికి వెళదాం రండి" అన్నాడు ఎమిలీ. సానిన్ దుస్తులువేసుకుని బెర్లిన్ స్నేహితునికి ఉత్తరం వ్రాయడం పూర్తిచేసాడు.

"అప్పుడే?"

"మరేం పరవాలేదు" అన్నాడు ఎమిలీ అతనికి దగ్గరగా జరుగుతూ, "వెళదాం పదండి తపాలా కచేరీమీదుగా మా యింటికి పోదాం. జెమ్మా సంతోషిస్తుంది! మాతోపాటు ఫలహారం చేయొచ్చు....అమ్మతో నా విషయం గురించీ, నా భవితవ్యం గురించీ మాట్లాడవచ్చు...."

"అలాఅయితే సరే పద" అన్నాడు సానిన్. ఇద్దరూ కలిసి బంగాలు దేరారు.

# 10

అతను కనిపించే సరికి జెమ్మా ఎంతో సంతోషించింది. ఫ్రా లెనోరీ ఆప్యాయతతో ఆదరించింది. ఆ కిందటి రోజున అతను వారిద్దరి మెప్పు పొందినట్టు స్పష్టమైంది. "మరిచేబోకేం!" అని ముందుగా సానిన్ చెవిలో ఊది ఫలహారాలు తెమ్మని చెప్పడానికి వెళ్ళాడు ఎమిలీ.

"మరిచేపోను" అని జవాబిచ్చాడు సానిన్.

ఫ్రా లెనోరీకి వంట్లో బాగుండలేదు. తల నొప్పితో బాధపడుతూ కదలకుండా పడక కుర్చీలో కూర్చుంది. జెమ్మా పచ్చని వదులుపాటి గాగరా ధరించింది. నడుముకు నల్లటి తోలు పటకా పెట్టుకుంది. ఆమె కూడా అలిసిపోయి పాలిపోయినట్లు కనిపించింది. కళ్ళకింద నల్లటి చక్రాలు ఏర్పడ్డాయి. కాని కళ్ళ కాంతి తగ్గలేదు. పైగా ఆ తెల్లదనం ఆమె మనోహరా కృతికి మరింత ఆకర్షణీయతను, ఏదో నిగూఢతను తెచ్చిపెట్టింది. నిగనిగలాడే నల్లటి ఉంగరాలజుట్టును సవరించుకోవడానికి జెమ్మా చేతులు ఎత్తినపుడు, ఆ చేతుల అందానికి సానిన్ ముగ్ధుడైపోయాడు. రాఫేలు చిత్రించిన ఫోర్నేరినా వేళ్ళలాగా పొడుగ్గా, లలితంగా, నీటుగా చెక్కినట్లున్న వేళ్ళనుంచి దృష్టిని మరలించుకోలేకపోయాడు.

ఆ రోజు బాగా ఉష్ణంగా ఉంది. ఫలహారాల అనంతరం సానిన్ వెళ్ళిపోవడానికి లేచాడు. కాని అటువంటి రోజున ఉన్నచోటనే ఉండిపోవడం ఉత్తమమని చెప్పడంతో అతను అంగీకరించి ఉండిపోయాడు. అతనూ, ఆ గృహిణులు కూర్చున్న వెనకగదిలో చక్కగా, చల్లగా ఉంది. కిటికీలోనుంచి చూస్తే కసింద పొదలతో నిండిన తోట కని

పిస్తుంది. పచ్చని పూలతో విలసిల్లే జొంపాలలో అసంఖ్యాకమైన తేనెటీగలు, కందిరీగలు, ఒక్కుమ్మడిగా ఝుమ్మమన సాగాయి. వాటి ఝుంకారం సగం సగం తెరిచిన కిటికీలోనుంచి, తెరలలోనుంచి విన వస్తోంది. బయట గాలి ఉష్ణంతో నిండిపోయింది. కాని పసందుగా సురక్షితంగా ఉన్న ఆ గది ఇంకా హాయిగా ఉంది.

ఆ కిందటి రోజున లాగానే సానిన్ ఎక్కువగా మాట్లాడాడు కాని రష్యాను గురించి గాని, రష్యన్ జీవితాన్ని గురించిగాని మాట్లాడ లేదు. ఫలహారాలు అయీ అవగానే హెర్ క్లూబర్ దగ్గర జమా ఖర్చు లెక్కలు వ్రాయడం నేర్చుకోవడానికి ఎమిలీ సరాసరి వెళ్లాడు. సానిన్ తన యువ స్నేహితుని (ఎమిలీని) సంతృప్తి పరచడానికి కళలు, వ్యాపా రాల లోని లాభ నష్టాలను పోల్చి చూపాడు. ఫ్రా లెనోరీ వ్యాపారం లాభసాటిదని వాదించింది. అతనికి ఆశ్చర్యం కలిగింది. ఆమె అలా వాదిస్తుందని అనుకుంటున్నదే. కాని జెమ్మా కూడా తల్లిఅభిప్రాయంతో ఏకీభవించింది.

"కళాకారుడు - ముఖ్యంగా పాటకుడయితే" అంది రివ్వున చేతిని కిందికి వాలుస్తూ "అందరిని మించిపోవాలి. లేకపోతే ప్రయోజనం లేదు. మించిపోయేదీ లేనిదీ యెలా తెలుస్తుంది ?"

ఈ చర్చలలో పాంటలియోన్ కూడా పాల్గొన్నాడు. (వయసు, చేసిన పనికాలం యజమానుల ముందు కూర్చోపడానికి హక్కు కలి గించాయి. పైగా ఇటాలియన్లు ఇలాంటి మర్యాదలను ఏక్కుచ్చిగా పాటించరు.) కళలపక్షంవహించి వాదించడం అతనికి సహజమేకదా ! నిజంచెప్పాలంటే, అతని వాదనలో పసలేదు....ఆవేశాన్నుంచి జనించే ఒకానొక ప్రేరణ ఉండడం అతి ముఖ్యమంటూ వాదన ప్రారంభించాడు. ఫ్రా లెనోరీ దీనికి జవాబు చెబుతూ అతనికి ప్రేరణ ఉన్నమాట తథ్యమే కాని....

"నాకు శత్రువులున్నారు" అన్నాడు పాంటలియోన్ చిరచిర లాడుతూ.

"యీ ప్రేరణను కలిగివున్నా ఎమిలీకి శత్రువులుండరని నమ్మక మేమిటి ?" అంది ఫ్రా లినోరీ ఇటాలియన్ పద్ధతిని చనువుగా మాట్లాడుతూ.

"సరే అయితే దుకాణం పెట్టించు" అన్నాడు పాంటలియోన్ కోపంతో. "కాని జియొవాన్ బాటిస్టా రొాట్టెల వ్యాపారి అయినా యిలా చేసేవాడు కాదు "

"నాభర్త జియొవాన్ బాటిస్టా సబబుకుకట్టుబడేమనిషి. యవ్వనంలో కా స్త కోపిష్టి కాకపోతే...."

కాని ఆ ముదుసలి చెప్పేది వినిపించుకోకుండా, "ఆ(-జియొవాన్ బాటిస్టా !" అని మందలింపు ధోరణిలో మరల మరల అంటూ వెళ్ళిపోయాడు. ఎమిలీయేగనక దేశభక్తితో ఉగ్రూతలూగి ఇటలీని విముక్తికి శక్తినంతా దారపోయాలని కాంక్షిస్తే భవితవ్యాన్ని అటువంటి మహా పవిత్రాశయంకోసం బలిపెట్టడానికి అనుమతించవచ్చు గాని నాటకరంగం కోసరమా, ఉహూ(-అంది జెమ్మా. వానిమీద ఫ్రా లినోరీ ఆందోళన వ్యక్తంచేస్తూ సోదరుని తప్పుదోవ పట్టించవద్దనీ, ఆమెలాగానే సాహసికుడైన రిపబ్లికన్‌గా ఉండనిచ్చి సంతృప్తి పడమనీ కూతురును వేడుకుంది. ఈ మాటలు చెపుతూ ఫ్రా లెనోరీ మూలిగింది. తల బద్దలైపోయేటంత తలనొప్పి ఉందని గోల పెట్టసాగింది. సానిన్‌మీదఉండే గౌరవం కొద్దీ ఫ్రా లెనోరీ కూతురుతో ఫ్రెంచి భాషలో మాట్లాడింది.

వెనువెంటనే జెమ్మా తల్లికి ఉపచారాలు చేయడంమొదలుపెట్టింది. వుడికొలోనుతో ముందుగా నుదురు తడిపి దానిమీద నోటితో ఊదింది. చెంపలు సౌమ్యంగా ముద్దిడుకుంది. తలగడామీద తల్లితలను పెట్టి మాట్లాడవద్దని చెప్పి మళ్ళీ ముద్దు పెట్టుకుంది. ఆ తరవాత సానిన్‌కేసి తిరిగి యదార్థ ఉద్వేగాన్ని ద్యోతకం చేసే కొంటె గొంతుతో తనతల్లి ఎంత అద్భుతమైందీ, ఒకొప్పుడు కళ్ళు ఎంత అందంగా ఉండేవీ వర్ణించిచెప్పింది. "ఒకప్పుడేమిటి ? యిప్పుడూ అందమైనవే. ఆవిడవంక చూడండి, చూడండి ఆ కళ్ళు యెంత అందంగా వున్నాయో "

జెమ్మా జేబులోనుంచి టపీమని జేబురుమాలు తీసి దానితో తల్లి మొహం కప్పింది. తరవాత మెల్లమెల్లగా అంచు పట్టుకుని కిందికి లాగింది. క్రమక్రమం ఫ్రా లెనోరీ నుదురు, కనుబొమలు, కళ్ళు బయట పడ్డాయి. ఒక క్షణం ఆగి కళ్ళు తెరవమని తల్లిని కోరింది. తల్లి తెరిచే సరికి మెచ్చుకుంటూ (నిజానికి ఫ్రా లెనోరీవి అందమైన కళ్ళు) జేబు రుమాలు ఇంకా కిందికి లాగి తిరిగీ ముద్దిడుకుంది. ఫ్రా లెనోరీ నవ్వి తల తిప్పి దౌర్జన్యం నటిస్తూ కూతురును అవతలకు తోసేసింది. జెమ్మా తల్లిని లాలిస్తూ పెనుగులాడుతున్నట్టు నటించింది. అయితే ఆ పెనుగు లాడే విధంలో ఫ్రెంచివారి ధూర్తత్వం లేదు. ఇటలీవారి లాలిత్యం వ్యక్తమయింది. ఆ లాలిత్యంలోకూడా గుప్తమైన శక్తి దాగిఉంది.

చివరికి ఫ్రా లెనోరీ అలసిపోయానని చెప్పింది....ఆ పడక కుర్చీలో అలాగే పడుకుని ఒక కునుకు తీయమని జెమ్మా వెంటనే తల్లికి సలహా ఇస్తూ "నేనూ ఈ రష్యన్ పెద్దమనిషీ చిటుక్కుమనకుండా కూర్చుంటాలే" అంది ఇందుకు జవాబుగా ఫ్రా లెనోరీ మందహాసంచేసి, కళ్ళు మూసుకుని, ఒకటి రెండు సార్లు నిట్టూర్చి కునుకు తీయసాగింది. ఆమె పక్కనే ఒక ఆసనంమీద జెమ్మా లాఘవంగా కూర్చుంది, ఆసనంలో కదలనైనా కదలకుండా, సానిన్ కాస్త కదిలితే చాలు, పెదవి మీద వేలువేసుకుని మెల్లగా 'యిష్' అని అదమాయిస్తూ ఓరచూపు చూస్తూ కూర్చుండిపోయింది. తల్లి తలకింది తలగడాను రెండవ చేతితో ఆసరాగా పట్టుకుంది. చివరకు అతనుకూడా కళ్ళముం దరి దృశ్యాన్ని మెచ్చుకోవడంలో నిమగ్నుడై కదలకుండా కూర్చుని మంత్ర ముగ్ధుడిలా ఒకవిధమైన మైకంలో పడిపోయాడు. పురాతనమైన ఆకుపచ్చని పాత్రలలో పూర్తిగా వికసించిన గులాబీల కెంపువర్ణంతో సగం చీకటిగది వెలుగుతోంది. తెల్లటి తలగడామీద చేతులు ముడుచు కుని అలసిపోయి ఆమె నిద్రపోతోంది. ఇక ఆయువతి, మాంచి చలాకీ మనిషి. దయగలది, తెలివిగలది, పరిశుద్ధమైనది. మాటలకు అందని అందం. లోతుకళ్ళు, నల్లనివి అయినా మెరిసిపోతున్నాయి....ఇదంతా ఏమిటి ? కలా ? కట్టుకథా ? అసలు అతను ఇక్కడ ఎందుకు ఉన్నట్టు?

# 11

పీధివాకిలిమీది గంట గణగణా మోగింది. ఉన్నిటోపీ పెట్టుకుని ఎర్రటి వేస్టుకోటు ధరించి ఒక రైతుకుర్రవాడు దుకాణాణంలోకి అడుగు పెట్టాడు. ఉదయంనుంచి ఒకరూ దుకాణంలోకి కొనడానికి రాలేదు. "చూచారా బేరసారాలు!" అంది ఫ్రా లెనోరీ నిట్టూరుస్తూ పలహారాలు చేస్తుండగా. ఇపుడు నిరాటంకంగా కునుకుతీస్తోంది. తలగడా కిందనుంచి చేయి తీస్తే తల్లికి మెలకువ వస్తుందేమోననే భయంతో జెమ్మా సానిన్ చెవిలో "వెళ్ళి నా బదులు దుకాణం సంగతి చూడండి" అంది.

వెంటనే సానిన్ కాలి వేటనవ్రేళ్ళమీద నడుస్తూ దుకాణంలోకి వెళ్లాడు. ఆ కుర్రవాడు మూడు ఔన్సుల పిప్పరమెంటు బిళ్ళలు కావాలని అడిగాడు.

"యెంత పుచ్చుకోవాలి?" అని ద్వారంగుండా సానిన్ మెల్లిగా అడిగాడు.

"ఆరు క్రూజ్జర్లు *" అంది జెమ్మా మెల్లిగా.

సానిన్ మూడు ఔన్సులు తూచి, కాగితంకోసం చుట్టూ వెతికి తీసి, శంఖు ఆకారంగా చుట్టి, దానిలో పిప్పరమెంటు బిళ్ళలు వేసి పొట్లం కట్టి కుదించి, మళ్ళీ కట్టు గల్లాపెట్టె మీదుగా అందించి డబ్బులు తీసుకున్నాడు....ఆ కుర్రవాడు పొట్టమీద చేతులతో ఒత్తుకుంటూ ఆశ్చర్యంతో సానిన్‌కేసి తేరిపారజూచాడు. ఇక వెనక గదిలో తెరలుతెరలుగా వచ్చే నవ్వును ఆపుకోవడానికి నోటిమీద చేయి వేసుకుని

---

* జర్మన్ రాగినాణెం.

జెమ్మా కూర్చుంది. ఆ కుర్రవాడు వెళ్ళిపోగానే ఇంకో వాడకందారు, ఆ తరవాత ఇంకో వాడకందారు చొప్పునవచ్చారు. "బహుశా అదృష్టాన్ని పట్టుకొచ్చానేమో!" అనుకున్నాడు సానిన్. రెండో వాడకందారుగ్లాసుడు షర్బతు కావాలని అడిగాడు. ఆ తరవాత వచ్చిన వాడకందారు అర పౌన్సుల మిఠాయి కావాలన్నాడు. పట్టుదలతో చెంచాలు చప్పిడి చేస్తూ, పళ్లాలు కదిలిస్తూ, తొందరగా పెట్టెలలో, జాడీలలో చేతులు పెడుతూ వారి వారి కోరికలు తీర్చాడు. తీరా లెక్క చూసుకునే సరికి షర్బతు తక్కువ ఖరీదుకు అమ్మినట్లు తేలింది. కాని మిఠాయిమాత్రం రెండు క్రూడ్జర్లు ఎక్కువకు అమ్మాడు. జెమ్మా నవ్వు అణచుకోలేక పోయింది. వర్ణించలేని ఉత్సాహం, అనుభవిస్తున్నట్లు సానిన్‌కి అనిపించింది. ఆ మనోహరమైన స్త్రీ వ్యక్తి గుమ్మంలోనుంచి కొంటెగా తొంగిచూస్తుంటే తాను షర్బతులు, మిఠాయి అమ్ముతూ ఎల్లకాలమూ ఉండిపోగలనని భావించాడు. కిటికీ ముందర బాదంచెట్ల జొంపాలలోనుంచి వేసవి ఎండ చొచ్చుకువచ్చి మధ్యాహ్న సూర్యుని పచ్చ కిరణాలతో ఆ గది నంతటినీ నింపింది. అతని హృదయం మధురాతి మధురమైన సోమరితనానికి, బాధ్యతలు లేని ఆనందానికి, యవ్వనానికి, యవ్వనపు మొదటి పొంగుకు లొంగిపోయింది.

నాలుగో వాడకందారు కప్పు కాఫీ కావాలన్నాడు. పాంటలియోన్‌ను పిలవ వలసి వచ్చింది (ఎమిలీ హోర్‌క్లాబర్ దుకాణం నుంచి ఇంకా తిరిగిరాలేదు.) సానిన్ లోపలికి వెళ్ళి జెమ్మా పక్కన కూర్చున్నాడు. ఫ్రా లెనోరీ ఇంకా కునుకుతీస్తూనే ఉంది. కూతురుకు అమిత సంతృప్తి కలిగింది. "అమ్మ తలనొప్పి నిద్రట్లో తగ్గిపోతుంది" అంది జెమ్మా. సానిన్-ఇంకా మెల్లిగా చెవిలో-తనుచేసిన వ్యాపారం గురించి చెప్పాడు. అతి గంభీరంగా సరుకుల ధరలు వల్లెవేసాడు. జెమ్మాకూడా అంత గంభీరంగానూ ధరలు చెప్పింది. ఇద్దరూకూడా వినోదకరమైన నాటకం ఆడుతున్నామనే భావంతో తమలో తాము నవ్వుకోవడంలో మునిగిపోయారు. హఠాత్తుగా వీధిలోనుంచి చితారుమీద పాట వినిపించింది. ఆ పాట ఒక

సంగీతనాటకం లోనిది. ఆ విషాదస్వరం నిలకడగా ఉన్న గాలిలో వణికిపోతూ ఈలవేస్తూ బావురుమంది. జెమ్మా అదిరిపడి "....అమ్మకి మెలుకువ వచ్చేసుందేమో!" అంది. సానిన్ వెంటనే వీధిలోకి పరుగెత్తి పాట ఆపి వెళ్ళిపొమ్మని ఆ చితారుమనిషికి ఇన్ని క్రూజర్లు పారేసాడు. సానిన్ తిరిగి రాగానే జెమ్మా తల పంకించి, విచారంగా మందహాసం చేసి కృతజ్ఞత తెల్పింది. వినిపించీ వినిపించనట్లుగా వీబర్ రచించిన పాట పాడసాగింది. ఆ పాట మనోహరంగా ఉంది. అందులో మాక్స్ తొలివలపులోని అద్భుతాలను వ్యక్తీకరిస్తాడు. ఆ తరవాత ఆమె సానిన్‌ను డెర్ ఫ్రీస్చట్జ్, వీబర్‌లు అంటే ఇష్టమేనా అని అడిగింది. తాను ఇటలీ స్త్రీ నయినా అటువంటి సంగీతమే తనకు ఎక్కువగా నచ్చుతుందని చెప్పింది. సంభాషణ వీబర్ నుంచి కవిత్వం, కల్పన, హాఫ్‌మన్‌ల మీదికి మరలింది. ఆ రోజులలో హాఫ్‌మన్ రచనలు ఎక్కువ ప్రచారంలో ఉన్నాయి.

కొద్దిగా గురక పెడుతూ ఫ్రా లెనోరీ నిద్రపోతూనే ఉంది. సూర్యకిరణాలు తలుపులగుండా సన్నటి పేలికలగా ఎడతెగకుండా కదలాడుతూ నేలమీదనుంచి సామానుమీద, జెమ్మా దుస్తులమీద, పూలరేకుల మీద, ఆకులమీద పడుతున్నాయి.

# 12

జెమ్మాకి హాఫ్‌మన్ అంటే పెద్ద ఇష్టమేమీ లేదు. పైగా అతని రచనలు ఆమెకు విసుగెత్తించేవి అతని కథలలోని అస్పష్టమైన. చోద్యమైన ఉత్తరాది స్వభావం కాంతివంతమైన దక్షిణాది స్వభావానికి సరిపడనిది. జెమ్మా దక్షిణాదికి చెందినదాయె! "అతని కథలు కట్టుకథలు, పిల్లలకోసం రాసినవి" అంది నిరసనగా. హాఫ్‌మన్ కథలలో కవితా ధోరణి లేదనికూడా ఆమెకి చూచాయగా జ్ఞాపకం ఉంది. కాని ఒక కథ మాత్రం ఆమెకి బాగా నచ్చిందట. ఆ కథ పేరు మరిచేపోయింది. ఇపుడు మళ్ళీ జ్ఞాపకం చేసుకుంటే ఆ కథ మొదలు ఆమెకి నచ్చిందట గాని, చివరభాగం చదివినట్టు గుర్తులేదట, చదివినా మర్చేపోయి ఉంటుంది. ఒక రొట్టెల దుకాణంలో ఒక యువకుడు ఒక అతిలోక సౌందర్యవతిని కలుసుకున్న కథ అది. ఆ బాలికను ఎల్లప్పుడూ ఎక్కడ బడితే అక్కడికి ఒక విచిత్రమైన ముసిలాడు, మహాదుష్టు వెంబడిస్తూండేవాడు. మొదట చూపులోనే ఆ యువకుడు ఆమెను ప్రేమించాడు. తనకు స్వేచ్ఛ ప్రసాదించ వలసిందని ప్రార్ధిస్తున్నట్లు ఆ యువతి అతని వంక జాలికలిగేటట్టు చూసింది. ఒక్క క్షణం అతను బయటికి వెళ్లాడు. మళ్ళీ వచ్చేసరికి అక్కడ ఆ యువతీ లేదు. ఆ ముసలివాడూ లేడు. ఆమెను వెదకడం కోసం ఉరుక్కుంటూ బయలుదేరాడు. ఆచూకీ తెలిసేది. వెంటపడేవాడు. కాని ఎంత ప్రయత్నించినా వారిని కలుసుకోలేక పోయాడు. ఆ సౌందర్యవతి శాశ్వతంగా మాయమై చక్కాపోయింది. కాని ఆమె ప్రార్ధనాపూర్వక దృష్టిని అతను మరువలేక పోయాడు. చేజేతులా జీవిత సౌఖ్యాన్ని జారవిడిచాననే భావంతో యమబాధన పడసాగాడు.

హాఫ్‌మన్ తన కథను సరిగ్గా ఇలాగే ముగించి ఉండకపోవచ్చు, గాని జెమ్మాకి ఇలా ముగిసిందనే జ్ఞాపకం.

"అలా కలుసుకోవడం, విడిపోవడం మనం అనుకున్న దాని కంటె ఎక్కువగా జరుగుతాయని నమ్ముతున్నాను" అంది.

సానిన్ నోరు మెదపలేదు....కాని ఒకటి రెండు నిమిషాల తరవాత సంభాషణ హెర్ క్లూబర్ మీదికి మరలించాడు. అతని పేరు ఎత్తడం ఇదే మొదటి తడవ. అప్పటివరకు అతనిని గురించి ఆలోచించనే లేదు.

ఈ తడవ జెమ్మా మట్లాడలేదు. చూపు మరల్చి ఆలోచనా పూర్వకంగా చూపుడువేలి గోటిని కొరుక్కుంటూ కూర్చుంది. తరవాత తన వరుని పొగిడింది. ఆ మర్నాడు వినోదయాత్రకు వెళ్ళడానికి అతను చేసిన ఏర్పాట్లను గురించి చెప్పి సానిన్‌ని త్వరతగతి తేరిపారజూచి మళ్ళీ మాట్లాడకుండా కూర్చుంది.

మాట్లాడడానికేమీ తోచక సానిన్ తల గోకుకొనసాగాడు.

ఎమిలీ చప్పుడు చేసుకుంటూ గదిలోకి చక్కావచ్చాడు. ఫ్రౌ లెనోరీ ఆ చప్పుడుకు మేలుకుంది....ఎమిలీ రావడంతో సానిన్‌కి భారం దించినట్లయింది.

ఫ్రౌ లెనోరీ కుర్చీలోనుంచి లేచింది. ఇంతలో పాంటలియోన్ వచ్చి వంట అయిందని చెప్పాడు. ఒకప్పుడు అతను సంగీత పాటకుడు ఇప్పుడు ఈ కుటుంబానికి స్నేహితుడు, సేవకుడు, వంటమనిషి.

# 13

భోజనాల అనంతరం కూడా సానిన్ అక్కడే కూర్చుండిపోయాడు. అతనిని వెళ్ళిపోకుండా చేయడానికి మండుటెండ వంకదొరికింది. ఎండ తగ్గిన తరవాత కసిందచెట్లనీడను కూర్చుని కాఫీ తాగుదాం రమ్మని ఆహ్వానించారు. సానిన్ ఆ ఆహ్వానాన్ని అంగీకరించాడు. పరమానంద భరితుడయాడు. స్తంభించిపోయి విసుగు పుట్టించే జీవిత వాహినిలో శక్తివంతమైన ఆకర్షణ దాగి ఉంటుంది. భూతభవిష్యద్వర్తమానాలు లెక్కచేయకుండా సంతోషంతో ఆ ఆకర్షణకు లొంగిపోయాడు. జెమ్మాలాంటి యువతిపక్కన ఉండడమే పరమభాగ్యంగా ఎంచుకున్నాడు. త్వరలోనే ఆమెను విడిచి వెళ్ళిపోతాడు. బహుశా ఇక ఎన్నటికీ కలుసుకోకపోవచ్చు. కాని ఈ లోపున ఉల్లాడ్ కవిగీతంలోలాగా మాయపడవ వారిని జీవిత వాహినిని దాటించింది. ఓ ప్రయాణీకుడా, సంతోషించు, సంతోషించు! ఆ ప్రయాణీకునికి జగమంతా ఆకర్షణీయంగా, ఆనందమయంగా పొడగట్టింది. ఫ్రా లెనోరీ చీట్లపేక ఆటకు ఆహ్వానించింది. పాంటలియోన్ ఆట్టే కష్టంగాని ఇటలీ దేశపు ఆట నేర్పి అతని దగ్గర చాలా క్రూజ్జర్లు గెల్చుకున్నాడు. అతనికి సంతోషమైంది. ఎమిలీ కోరిక మీద పాంటలియోన్ టార్టాగ్లియా (కుక్క) చేత కదం తొక్కించాడు. ఆ కుక్క అడ్డుపెట్టిన కర్రమీదుగా దూకింది. 'మాట్లాడింది' (అంటే మొరిగిందన్నమాట), తుమ్మింది, ముట్టితో తలుపు మూసింది. చినిగిపోయిన చెప్పు యజమానిదగ్గరకు తెచ్చింది. నెత్తిన కోసుటోపీ పెట్టుకుని ద్రోహం చేసినందుకు నెపోలియన్ చక్రవర్తిచేత చావుచివాట్లు తిన్న బెర్నదోటీ సేనానిపాత్ర నటించింది, నెపోలియన్‌పాత్ర పాంటలియోన్

వహించాడని వేరే చెప్పాలా! బాగా అభినయించాడు. పాంటలియోన్ రొమ్ముమీద చేతులు కట్టుకున్నాడు. కంటిమీదకు కుచ్చుటోపీ లాక్కున్నాడు, ఫ్రెంచి భాషలో మోటుగా కఠినంగా మాట్లాడాడు. అబ్బ! ఏమి ఫ్రెంచి, ఏమిఫ్రెంచి! రెండు కాళ్ళమధ్య తోక పెట్టుకుని కుక్క ముడుచుకుని కూర్చుని ఏదో తప్పుచేసినదానిలా కళ్ళు మిణకరించింది. టోపీ కిందనుంచి పక్కచూపులు చూడసాగింది. నెపోలియన్ గొంతెత్తి మాట్లాడినపుడల్లా బెర్నడోటీ వెనక కాళ్ళమీద లేచింది. చివరివరకు ఫ్రెంచి జాతీయతను నిలబెట్టాలనే సంగతి మరిచేపోయి నెపోలియన్ 'ఓరీ ద్రోహీ!' అని కేకవేసాడు, ఇటాలియన్‌లో. దానిమీద బెర్నడోటీ దుందుడుకుగా సోఫాకిందకు పరుగెత్తి నాటకం ఆఖరైపోయిందని చెప్పడానికి అన్నట్లు సంతోషంతో మొరుగుతూ తిరిగివచ్చింది. ప్రేక్షకులంతా కడుపుబ్బా నవ్వారు. సానిన్‌ను మించి నవ్వినవాళ్ళే కనిపించలేదు.

జెమ్మా సంతోషంతో మధ్య మధ్య కీచుమని అరుస్తూ ఎడతెంపు లేకుండా నవ్వింది....ఓ-ఆమె నవ్వు! ఆ కేరింతలకే ఆమెను ముద్దిడుకోవచ్చు.

ఎలాగైతేనేం చీకటి పడింది. వెళ్ళిపోవలసిన వేళైంది. పరస్పరం పదేపదే శెలవు తీసుకుంటూ 'రేపు మళ్ళీ కలుద్దాం' అంటూ (ఎమిలీ అతనూ నిజంగా ముద్దిడుకున్నారు.)సానిన్ హోటలుకు వెళ్ళిపోయాడు., ఆ యువతి ఆకారం కీసీడలా అతనిని విడనాడలేదు, ఆమె నవ్వూ విచారం, ప్రశాంతత, ముభావం - ఈ అవస్థలు ఒకటితరవాత ఒకటి వచ్చిపోతున్నా, అన్ని అవస్థలలోనూ ఆమె ఆకర్షణీయంగానే ఉంది. ఒకొక్కప్పుడు బాగావిప్పుకుని పగటిలా సంతోషంతో ధగధగలాడుతూ, ఒకొక్కప్పుడు కనురెప్పల వెంట్రుకలకింద. సగం మాటుపడి నిశలాగా ప్రగాఢంగా, నల్లగా ఉన్న ఆమె కళ్ళు తక్కిన ఆకారాలన్నిటిని తుడిచిపెట్టివేసి ఏదో చిత్రమైన మాధుర్యంతో అతని కళ్ళముందు తారాడాయి.

హెర్‌క్లూబర్ సంగతి, ఫ్రాంక్‌ఫోర్ట్‌లో ఉండిపోవడానికి గల కారణాల సంగతి ఒకటేమిటి నిన్న అతనిని బాధించిన విషయాలన్నిటిని గురించీ ఒక నిమిషం కూడా అతను ఆలోచించలేదు.

# 14

కాని సానిన్ విషయంలో ఒకటి రెండు మాటలు చెప్పవలసిన సమయం వచ్చింది.

అతను మనోహరుడైన యువకుడు. పొడగరి బక్క పల్చన. కొద్దిగా మసకమసకలాడే మనోరంజకమైన ఆకృతి. దయ ఉట్టిపడే నీలాలకళ్ళు. బంగారుచాయ జుట్టు. లేతగులాబీరంగు శరీరచ్ఛాయ. ఇక ముఖ కవళికలో నిరాడంబరం, విశ్వాసం, నిష్కాపట్యం, బాధ్యతా రాహిత్యం గోచరిస్తాయి. మొదట చూపులో బేలతనంకూడా పొడగట్టుతుంది. గౌరవనీయమైన పై తరగతి కుటుంబాలలోని బాలురను గుర్తు పట్టడానికి ఆ ముఖకవళిక తోడ్పడుతుంది. ఈ పిల్లలు చాలా మంచివాళ్లు. పచ్చిక మైదానాలమధ్య అంతూ పొంతూ లేని గ్రామీణ జిల్లాలలో పుట్టి పెరిగినవారు. తడబడే నడక. తడబడే మాట, పసినవ్వు....కొంగ్రొత్తదనం, ఆరోగ్యం-అన్నిటికీ మంచి శాంతస్వభావం - ఇవీ సానిన్ లక్షణాలు. అంతేకాదు అతనేం తెలివితక్కువ మొద్దుకాదు. కొంత విజ్ఞానం సంపాదించుకున్నవాడు విదేశాలలో తిరిగినా కొంగ్రొత్త దనం కోల్పోలేదు. ఆనాటి ఉత్తమ యువకులను ఎదుర్కొన్న ఆందోళనలు అతనికి తెలియవు.

మన రచయితలు 'కొత్త పాత్రల' కోసం అన్వేషించి విఫలులై ఇటీవల ఏమైనా సరే కొంగ్రొత్తదనం నిలబెట్టుకోవాలని నిశ్చయించుకున్న యువకులను, సెయింట్ పీటర్స్‌బర్గుకు దిగుమతి అయే సరికొత్త ఫ్లేన్స్‌బర్గు గుల్లచేపలలాంటివారిని చిత్రించసాగాడు. ఇలాగే పాచికలకు దిగాం కాబట్టి, అతను మననల్లరేగడ తోటలలో బాగా పెరిగి, ఇటీవలనే

అంటుకట్టిన సీమరేగిచెట్టులాగా పూర్వకాలపు పెద్దమనిషి గుర్రపుశాలలో బాగా మాలీసు చేయగా నిగనిగ లాడుతూ అపుడే తర్ఫీదు పొంద నారంభించిన గుర్రపు పిల్లలా ఉన్నాడు.

తరవాత సానిన్‌ను కలుసుకున్నవారు, జీవితంలో నలిగిపోయి యవ్వనపు నిగనిగ మాయమైన తరవాత కలుసుకున్నవారు, అతనిని గుర్తుపట్టలేరు.

---

ఆ మరునాడు సానిన్ ఇంకా పక్కమీదనుంచి లేవకముందే ఎమిలీ బాగా ముస్తాబై చేతితో బెత్తం పట్టుకుని గదిలోకి ఉరుక్కుంటూ వచ్చాడు. సువాసనతైలం రాసాడేమో జుట్టు తలకు అంటుకుపోయింది. హెర్ క్లూబర్ బండిలో ఒక నిమిషంలో వచ్చేస్తాడనీ, వాతావరణం బహు పసందుగా ఉండేటట్లుందనీ. అందరూ సిద్ధంగా ఉన్నారు గాని తలనొప్పి తిరిగి వచ్చినందువల్ల తన తల్లి మాత్రం రావడంలేదనీ. చెప్పాడు. ఒక్క క్షణం కూడా వృథాపుచ్చడానికి వీల్లేదని సానిన్‌ను తొందరపెట్టాడు. నిజం, సానిన్ ఇంకా అలంకరించు కుంటూండగానే హెర్ క్లూబర్ వచ్చేశాడు. తలుపు తట్టి గదిలో ప్రవేశించి, వంగి నమస్కరించి, సానిన్‌కి ఇష్టమైనంత సేపు వేచి ఉంటానని చెప్పి కూర్చున్నాడు. హాటుతీసి మోకాళ్ళమీద తేలికగా ఆనించి పెట్టుకున్నాడు. ఆ దుకాణదారు కిందనుంచి పైదాకా బాగా ముస్తాబైనాడు. సువాసన తైలాలు రాసుకున్నాడు. ప్రతి కదలికతోపాటు సువాసన ఘుమ్మని కొట్టింది. విశాలమయిన బగ్గీలో వచ్చాడు. బగ్గీ తెరిచిఉంది. దానికి బాగా ఎత్తైన, బలమైన, గుర్రాలు పూన్చారు. అవి అందమైనవి మాత్రం కావు. పావు గంట తరవాత సానిన్, హెర్ క్లూబర్, ఎమిలీ, రొట్టెల దుకాణానికి ఈ బగ్గీలోనే మహోత్సాహంతో సాగిపోయారు. ఫ్రా లెనోరీ ఏమైనాసరే వినోదయాత్రకు రానని మొండికేసింది. జెమ్మా తల్లితోపాటే ఉండి పోదామనుకుంది గాని తల్లి ఆమెను బయటికి పంపించివేసింది.

"నా కోసం యెవరూ వుండక్కర్లేదు" అని వారికి నమ్మ పలికింది. "నిద్రపోతానుగా. పాంటలియోన్ని కూడా మీతో పంపుతాను. గల్లాపెట్టె దగ్గిర యెవరూ వుండరు. అంతే."

"టార్టాగ్లియాను కూడా తీసుకుపోమా?" అంటూ వేడుకున్నాడు, ఎమిలి.

"ఊఁ– తీసుకువెళ్ళండి !"

వెంటనే టార్టాగ్లియా సంతోషంతో ముందు సీటులోకి ఉరికి దవడలు నాకుకుంటూ కూర్చుంది. ఇటువంటి వినోదయాత్రలకి అది అలవాటు పడిఉందని స్పష్టంగా తెలుస్తూనేఉంది. జెమ్మా నీరుకావి రంగు రిబ్బను కట్టిన పెద్ద గడ్డిటోపీ పెట్టుకుంది. అంచు ముందువైపు వంగి సూర్య కిరణాలనుంచి ఆమె ముఖాన్ని రక్షిస్తోంది. ఆ హాటు నీడ ఆమె పెదవులదాకా పడింది. ఆ పెదవులు ముద్దగులాబీ రేకులలాగా పాటల వర్ణంతో అతి సున్నితంగా ఉన్నాయి. కళ్ళు చంటిపిల్ల కళ్ళ లాగా సిగ్గుతో మెరిసిపోతున్నాయి. జెమ్మా వెనకసీటులో సానిన్ పక్కగా కూర్చుంది. ఎదుర్‌గా హెర్‌క్లూబర్, ఎమిలీ కూర్చున్నారు. ఫ్రౌ లెనోరీ తెల్లటి విగ్రహం కిటికీదగ్గిర కనిపించింది. జెమ్మా ఆమెకేసి జేబురుమాలు ఊపింది. గుర్రాలు దౌడుతీయసాగాయి.

# 15

ఫ్రాంక్‌ఫోర్టునుంచి అరగంటప్రయాణపు దూరంలో సోడెన్ అనే చిన్నపట్టణం ఉంది ఆపట్టణం టామస్ కొండలవరుసమీద అందంగాకట్టబడిఉంది· ధాతుజలానికి రష్యాలోకల్లా పేరుపడింది. ఈ జలం బలహీనమైన గుండెలు గలవారికి మంచిగుణం ఇస్తుంది. ఫ్రాంక్‌ఫోర్ట్‌లోని జనులు ఎక్కువగా విలాసార్థం ఇక్కడికి వెళుతూంటారు. సోడెన్‌లో చక్కటి ఉద్యానవనం ఉంది. మంచి పానీయశాలలు అనేకం ఉన్నాయి. వీటిలో పొడుగాటి నిమ్మచెట్ల నీడలో, గంగిరేణిచెట్ల నీడలో కూర్చుని బీరూ, కాఫీ సేవించవచ్చు. ఫ్రాంక్‌ఫోర్టునుంచి సోడెన్‌వెళ్ళే రోడ్డు సముద్రపు కుడిఒడ్డునే వెళుతుంది. రోడ్డుకు ఇరుపక్కలా పళ్ళచెట్లు నాటబడ్డాయి. రహదారి బహుచక్కనిది. బగ్గీ సాఫీగా వెళుతూంటే సానిన్ రహస్యంగా జెమ్మాకి, ఆమె వరునికి గల సంబంధం పరిశీలించాడు. వాళ్ళిద్దరూ కలిసిఉండగా అతను చూడడం ఇదే మొదలు. ఆమె మహా ప్రశాంతంగా, స్థయిర్యంగా, మామూలుకన్న ఎక్కువ బింకంగా, గంభీరంగా ఉంది. ఇక హెర్‌క్లూబర్ తను, తన ఆధీనంలోని విద్యార్థులు ఏదో హానికరంకాని నమ్రతతో కూడిన వేడుక అనుభవించే అవకాశం కల్పించిన ఇంటి పంతులులాగా కనిపించాడు. అతను జెమ్మా విషయంలో ప్రత్యేకశ్రద్ధ తీసుకుంటున్నట్లు సానిన్‌కి తోచలేదు. ఈ ప్రత్యేకశ్రద్ధనే ఫ్రెంచివారు అనురాగం అంటారు. వివాహం నిశ్చయమైందనే భావంలోనే ఉన్నాడు హెర్‌క్లూబర్. అందుచేత ప్రత్యేకంగా శ్రద్ధచూపవలసిన అవసరంగాని, గొడవపడవలసిన అవసరంగాని అతనికి కనిపించలేదు. కాని ఒక్క నిమిషంకూడా నమ్రత అతనిని విడనాడలేదు. మధ్యాహ్న

భోజనాలకు ముందు సోడెన్ చుట్టూఉన్న లోయలలో సులోబీలమీద బహుదూరం విహరించినపుడు. ప్రకృతి రమణీయతను అనుభవించే టపుడు ఈప్రకృతి యెడగూడా అధికార దర్పం మధ్య స్థిరమైన నమ్రత తోనే వ్యవహరించాడు ఉదాహరణకి, ఒక లోయవెంట ప్రవహించే సెలయేరు మరీ సూటిగా ప్రవహిస్తోందనీ, అందంగా వంకరలు తిరిగితే బావుండేదనీ చెప్పాడు. జీనువాయిపిట్ట నడవడిని మెచ్చుకోలేదు. దాని అరుపు విసుగెత్తిస్తోందన్నాడు. జెమ్మా అలసిపోయినట్టు కనిపించలేదు. పైగా సంతోషం అనుభవిస్తున్నట్టు కనిపించింది. కాని సానిన్‌కి మాత్రం అతను ఎరిగినజెమ్మాగా ఆమె కనిపించలేదు. ఆమె ఆకృతి మరుగుపడ లేదు. ఆమె అందం అంతగా ఎన్నడూ వెలిగిపోలేదు. కాని ఆమె తనలోతాను కుంచించుకు పోయినట్లు పొడగట్టింది. గొడుగు వేసుకుని చేతితొడుగులు తీసివేయకుండానే మర్యాదగల యువతిలాగా ధీమాగా, తాపీగా నడిచింది. ఎక్కువగా మాట్లాడలేదు. ఎమిలీకూడా ప్రయాస పడు తున్నట్లు కనిపించాడు, సానిన్ అంతకన్నాను. సంభాషణ జర్మన్ భాషలో సాగడం అతనిని మరీ కలతపెట్టింది. టార్టాగ్లియా ఒకటే కులాసాగా కాలం గడిపింది. దారికి అడ్డంవచ్చిన పిట్టలమీదికి పిచ్చిగా మొరుగుతూ దూకింది. గోతులమీదుగా, మొరడులమీదుగా, విరిగిపడిన చెట్లమీదుగా ఉరికింది నీళ్ళలో మొండిగా దూకింది. తొందర తొందరగా నీళ్ళు తాగింది. శరీరం ఝాడించింది, మూలిగింది. నాలుక చాచి బాణంలా మరుక్షణంలో నీటిబయటకు పరుగెత్తింది, అతిధులను వినోదపర్చడానికి అవసరమని తనకితోచిందల్లా హెర్ క్లూబర్ చేసాడు, బాగా విస్తరించు కున్న సిందూరపుచెట్టుకింద కూర్చుందాం రమ్మని అందర్నీ ఆహ్వానిం చాడు. పక్కజేబులోనుంచి 'నవ్వుతావు, నవ్వితీరతావు' అనే గ్రంధం తీసి దానిలోని హాస్యకథలు బిగ్గరగా చదవసాగాడు. డజను కథలు చది వాడుగాని అవి నవ్వు పుట్టించలేదు. సానిన్ ఒక్కడే మర్యాదకోసం ఇకిలించాలని యత్నించాడు. ఒకొక్క హాస్యకథా చదవడం పూర్తి కాగానే క్లూబర్ వ్యాపారసరళిలో చిన్నగా నమ్రతతోనవ్వాడు. పన్నెండు గంటలకు సోడెన్‌లోని మంచి హోటలు ఒకదానికి అంతా తిరిగివెళ్లారు.

మధ్యాహ్న భోజనాలవేళ అయింది.

హెర్‌క్లూబర్ నలువేపులా మూయబడిన ఒక వేసవి వసతి గృహంలో భోజనాలు చేదామని సూచించాడు, కాని హఠాత్తుగా జెమ్మా తిరగబడింది. హోరుబయట తోటలో హోటలుముందు వేసిన చిన్న మేజాముందు కూర్చుని భోజనం చేయదలచానని చెప్పింది. ఒకే మొహాలు చూసి చూసి విసుగెత్తిందనీ, కొత్త మొహాలు చూడాలని ఉబలాటంగా ఉందనీ అన్నది. మేజాలమీద అప్పటికే కొత్తగా వచ్చిన అతిధులు కూర్చునిఉన్నారు.

'నూత్నవధువు పిచ్చితలంపులకు' లొంగిపోయి పెద్ద నౌకరుతో సంప్రదించడానికి హెర్‌క్లూబర్ వెళ్ళాడు. జెమ్మా కిందకు చూస్తూ పెద వులు బిగించుకుని కదలకుండా నిలబడింది. సానిన్ తనవంక స్థిరంగా, ప్రశ్నార్థకంగా చూస్తున్నాడని గ్రహించి కలతపడింది. అరగంటలో వంట సిద్ధమవుతుంది. ఈలోపున 'తొమ్మిది సూదుల' ఆట ఆడదామనీ, ఆ ఆటలో ఆకలి ఎక్కువవుతుందనీ అన్నాడు క్లూబర్ తిరిగివచ్చి. అతను గొప్ప ఆటగాడు. కొయ్యబంతిని విసిరేముందు ధీమాగా కండ రాల తీరు ప్రదర్శించి, నీటుగా చేయి విసిరి ఒంటికాలిమీద నిలబడే వాడు. బాగా వ్యాయామం చేసినవాడు. చక్కని అంగసౌష్టవం. చేతులు తెల్లగా మహా అందంగా ఉంటాయి, బంగారు పూవులు కుట్టిన ఇండి యన్ తువాలుతో తుడుచుకునేవాడు,

భోజనాలవేళ అయింది. అందరూ ఎవరి మేజాదగ్గరికి వారు చేరు కున్నారు.

# 16

జర్మన్ భోజనం ఎలా ఉండేదీ అందరికీ తెలిసిందే. క్రైమా వుండలు, దాల్చినచెక్కతో పప్పుచారు, బెండులా పొడిగా ఉండి తెల్లటి కొవ్వు ముద్దలు ముద్దలుగా వేలాడే ఉడికిన గొడ్డుమాంసం, బింక బింక ఆలుగడ్డ, మెత్తని బీటువేళ్ళు, పుగాకులాంటి మునగకాయ, ద్రాక్షసారాతో నీలిములుగు చేపలు తాండ్రతో మాంసంకూరలు, పుల్లని వ్యంజనాలతో కుడుములు! కాని బీరూ, సారా అద్భుతంగా ఉన్నాయి. ఈ సోడెన్ హోటలు యజమాని ఇటువంటి భోజనంతో అగంతకులను తృప్తి పరుస్తుంటాడు. భోజనాలు బాగానే జరిగిపోయాయి. నిజం! ప్రత్యేకంగా ఉత్సాహమేమీ కనిపించలేదు. 'మనం యెక్కువగా ప్రేమించేవారి గౌరవార్థం' హెర్ క్లూబర్ పానీయం సేవిస్తున్నా ఉత్సాహం కలగలేదు. అంతా యోగ్యంగా గౌరవప్రదంగా జరిగింది. భోజనాల తరవాత పలచని చిలుమురంగు అచ్చమైన జర్మన్ కాఫీ ఇచ్చారు హెర్ క్లూబర్. నిజమైన పెద్దమనిషిగా, సిగరెట్టు కాల్చడానికి జెమ్మా అనుమతి కోరాడు. కాని హఠాత్తుగా తలవని తలంపుగా-పెద్ద నీచమైంది కాకపోయినా-అసహ్యకరమైన సంఘటన జరిగింది.

. పక్క మేజాలలో ఒక దానిమీద సముద్రపు రక్షణదళానికి చెందిన అధికారులు కూర్చుని ఉన్నారు. వారి చూపులను బట్టి, గుసగుసలను బట్టి జెమ్మా అందం వారిని ముగ్ధులను చేసిందని స్పష్టమవుతూనే ఉంది వారిలో ఒకతను బహుశా ఫ్రాంక్‌ఫోర్ట్‌లో ఉండిఉంటాడు, అంతకు ముందే ఆమెను చూచినవాడిలా చూడసాగాడు. ఆమె ఎవరో అతనికి తెలుసు. ఆ మిలిటరీ పెద్దమనిషి బాగా తాగినట్టున్నాడు. బల్లమీద బారుగా

సిసాలు పేర్చిపున్నాయి. హఠాత్తుగా గ్లాసు చేతితో పుచ్చుకుని లేచి జెమ్మా కూర్చున్న మేజాదగ్గరకు వెళ్ళాడు. మాంచి వడుచుదనంలో పున్నాడు. చక్కనివాడు, ఆహ్లాదం కలిగించే ఆకృతి; కాని తాగడంవల్ల ఈ లక్షణాలన్నీ పక్రించాయి. చెంపకండరాలు పీక్కుపోయాయి. కణ కణలాడే కళ్ళు అహంకారంతో గిర్రున తిరిగాయి. మొదట అతని సహ చరులు ఆపాలని చూసారు గాని తరవాత మానుకున్నారు. నిజానికి ఏం జరుగుతుందో చూదామనే ఆసక్తి వారికి కలిగింది.

కొద్దిగా తూలుతూ జెమ్మాకు ఎదురుగా వచ్చి ఆ అధికారి ఆగి బిగ్గరగా అరిచాడు. అది బలవంతంగా అరిచినట్లుంది. ఆ గొంతులో ఆంతరంగిక పోరాటం గోచరించింది.

"ఫ్రాంక్‌ఫోర్ట్‌లోకల్లా, ఫ్రాంక్‌ఫోర్టేమిటి ప్రపంచంలోకల్లా అంద మైన దుకాణం పిల్ల ఆరోగ్యం కాంక్షిస్తూ తాగుతున్నాను." (గ్లాసులోని సారా ఒక్క గుక్కన తాగెసాడు). "దివ్యమైన వేళ్ళతో గిల్లిన యీ పువ్వును బహుమానంగా స్వీకరిస్తున్నాను." జెమ్మా పళ్ళెం పక్కగా మేజామీద ఉన్న గులాబీపూవును తీసుకున్నాడు. మొదటలో ఆమెకు ఆశ్చర్యం వేసింది. భయం వేసింది మొహం పాలిపోయింది....ఆ తర వాత భయం కోపంగామారింది. అమితసిగ్గుపడింది.తననుఅవమానించిన వ్యక్తిమీద స్థిరంగా దృష్టి నిలిపింది. కళ్ళు నల్లబడ్డాయి. కోపంతో మండి పోయాయి. వ్యాకులంతో నిండిపోయాయి. అణచుకోలేని కోపంతో కణ కణ లాడాయి. ఈ చూపుకు ఆ అధికారి తడబడి అస్పష్టంగా ఏదో గొణిగి తన స్నేహితుల వద్దకు వెళ్ళాడు. వారు నవ్వుతూ పరియాచ కంగా కరతాళ ధ్వనులు చేస్తూ సమాదరించారు.

హెర్‌క్లూబర్ దిగ్గున లేచి పెద్దగా కాకపోయినా హుందాగా, "దారుణం, మహాదారుణమైంది!" అని తీవ్ర స్వరంతో నౌకరును పిలిచి తక్షణమే బిల్లు ఇమ్మని అడిగాడు....అంతేకాదు, బగ్గీ తీసుకు రమ్మని చెప్పాడు, అవమానం పొందే ప్రమాదం ఉంది కాబట్టి యోగ్యు లైన వారెవరూ హోటలుకు వెళ్ళడం మంచిది కాదని కూడా అన్నాడు.

అంతవరకు కదలకుండా కూర్చున్న జెమ్మా ఈ మాటలు విని దీర్ఘంగా నిట్టూరుస్తూ హెర్ క్లాబర్ కేసి తేరిపారజూచింది .... ఆ అధికారివంక ఎటువంటి స్థిరమైన చూపు పరచిందో సరిగా అటువంటి చూపే క్లాబర్ వంక కూడా పరపింది....ఎమిలీ కోపంతో గజగజా వణికిపోయాడు. "లే, మీన్ ఫ్రాలీన్" అన్నాడు క్లాబర్ అదే తీవ్ర స్వరంలో. "యిక్కడ వుండడం మంచి పనికాదు. మనం లోపలికి, హోటలు లోపలికి వెళదాం పద."

జెమ్మా మాట్లాడకుండా లేచింది. క్లాబర్ మోచేతిని ఎత్తాడు. ఆమె మోచేతిలో చేయిపెట్టింది. ఠీవిగా అడుగులు వేసుకుంటూ ఆమెను హోటలు లోపలకు తీసుకువెళ్ళాడు. వారు భోజనాలు చేసిన స్థలంనుంచి దూరమవుతున్న కొద్దీ అతని వైఖరిలాగానే అడుగులుకూడా ఠీవిని అల వర్చుకోసాగాయి. పాపం! ఎమిలీ వారి వెనకే కాళ్ళీడ్చుకుంటూ వెళ్లాడు.

కాని హెర్ క్లాబర్ నౌకరుకు శిక్షగా చిల్లిగవ్వ అయినా బహుమాన రూపంలో ఇవ్వకుండా బిల్లు లెక్క చూస్తూండగా, సానిన్ ఆ అధికారులు కూర్చున్న మేజా దగ్గరకు పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ వెళ్ళి జెమ్మాను అవమానించిన అధికారిని (ఆ సమయంలో ఆ గులాబీ పువ్వును వాసన చూడమని ఒకొక్కరికీ అందిస్తున్నాడు.) సంబోధించి ఫ్రెంచి భాషలో విస్పష్టంగా "మీరు యిపుడు చేసిన పని నిజాయితీపరుడు చేయవలసిన పని కాదు. మీరు ధరించే యూనిఫారానికి తగింది కాదు. మిరు వట్టి నీచులని చెప్పడానికే వచ్చాను." అన్నాడు. ఆ యువకుడు దిగ్గున లేవబోయాడు గాని తక్కిన అధికారులలో ఒకతను, కొంచెం పెద్దవాడు, చేతియూపుతో వారించి కూర్చోబెట్టాడు, సానిన్ కేసి తిరిగి ఫ్రెంచి భాషలోనే "యెవరవు నువ్వు? ఆ యువతికి చుట్టానివా, సోదరుడవా లేకపోతే వరుడివా?" అని అడిగాడు,

"నేను ఆమెకు పరిచయస్తుడిని మాత్రమే" అన్నాడు సానిన్. "నేను రష్యన్ను. అటువంటి అవమానం జరుగుతూంటే చూస్తో

పూరుకోలేను. యిదిగో నా చిరునామా చీటీ, అక్కడ నన్ను కలుసుకో వచ్చు."

ఇలా చెపుతూ సానిన్ తన చిరునామా చీటీని బల్లమీదకు విసిరి వేసాడు. ఒక అధికారి గులాబీపువ్వును పళ్ళెంలోకి జారవిడిస్తే సానిన్ వెంటనే దానిని తీసుకున్నాడు. ఆ యువకుడు కుర్చీలోనుంచి లేవాలని తిరిగి యత్నించాడు గాని అతని స్నేహితుడు తిరిగి "తొందర పడవద్దు, డాన్‌హాఫ్! అంటూ వారించాడు. అలా వారించి తానే స్వయంగా లేచి ఒళ్ళంతా బిగపట్టి సానిన్‌కు సైనికవందనం అర్పించి, గొంతులో కాని నడతలో గాని ఏ మాత్రం గౌరవం చూపెట్టకుండా తమ పటాలంనుంచి ఒక అధికారి ఆ మర్నాటి ఉదయం సానిన్ గదికి వస్తాడని తెలియజేసాడు. సానిన్ జవాబుగా తల కొద్దిగా వంకించి తొందర తొందరగా తన అనుచరులను చేరుకున్నాడు.

---

సానిన్ గైరుహాజరు కావడం, అధికారులతో సంభాషించడం గమనించనట్లు నటించాడు హెర్ ఖ్లూబర్. గుర్రాలను బగ్గీకి పూన్చు తున్న బగ్గీవాడిమీద మెల్లగా పనిచేస్తున్నావని మండిపడుతూ తొందర చేసాడు. జెమ్మా సానిన్‌తో ఒక్కమాటైనా మాట్లాడలేదు సరికదా, అతని వంక చూడనైనా చూడలేదు. కాని ముడివడ్డ కనుబొమలు, పాలి పోయి నొక్కుకున్న పెదవులు, నిశ్చలనం ఆమెలోని ఆందోళనను వ్యక్తంచేసాయి. సానిన్‌తో మాట్లాడాలని, ప్రశ్నించాలని వాంఛించిందల్లా ఒక్క ఎమీలీమే. సానిన్ ఆ అధికారుల దగ్గరకు వెళ్ళడం ఏదో తెల్లటి కాగితంముక్క - అది చీటీయో, అట్టముక్కో - అందివ్వడం చూసాడు....పాపం! ఆ బాలుని గుండెలు టకటకా కొట్టుకున్నాయి. చెంపలు వేడెక్కాయి. సానిన్ మెడ కావలించుకోవడానికి, ఏడవడానికి, సానిన్‌తో కలిసి వెళ్ళి మృగప్రాయులైన ఆ అధికారులను ముక్కలు ముక్కలు కింద కొట్టివేయడానికి సంసిద్ధుడయాడు. కాని ఆవేశాన్ని

అణచుకుని తన రష్యన్ మిత్రుడి ప్రతి కదలికను జాగ్రతగా పరికించ డంతో తృప్తిచెందాడు.

చివరికి ఎలాగైతేనేం బగ్గీవాడు గుర్రాలను బగ్గీకి పూన్చాడు. అంతా బగ్గీలోకి ఎక్కారు. ఎమిలీ టార్టాగ్లియా తరవాత ముందు సీటు లోకి ఉరికాడు. అక్కడే అతనికి హాయిగావుంది. క్లూబర్ మొహం కనిపించదు. ఇప్పుడు క్లూబర్ అంటే అతనికి పూర్తిగా అసహ్యం పుట్టింది

---

దోవ పొడుగునా హెర్ క్లూబర్ ఒక్కడే మాట్లాడాడు. ఎవరూ అతను చెప్పింది కాదనాలేదు ఔననాలేదు. నాలుగువేపులా మూసిన వేసవి వసతి గృహంలో భోజనాలు చేదామంటే ఎవరూ వినిపించుకో కుండా తప్పిదంచేసారు. అలా చేసివుంటే ఈ అసహ్యాకరమైన సంఘ టన జరిగేదికాదు అన్నాడు. ఆ తరవాత తీవ్ర విమర్శకు దిగాడు. ఆ విమర్శలోనూ కొంత ఉదారఛాయ గోచరించింది. ప్రభుత్వం అధికారు లను విచ్చలవిడిగా తిరగనివ్వడం క్షమించరానిది. క్రమశిక్షణ విషయం పట్టించుకోవడం లేదు. పౌరులను తగు విధంగా గౌరవించడం లేదు. అందువల్ల అసంతృప్తి ఎక్కువవుతోంది. అసంతృప్తి విప్లవానికి దారి తీస్తుంది. దీనికి విచారకరమైన ఉదాహరణ (సానుభూతితోను తీవ్రం గాను నిట్టూర్చాడు) ఫ్రెంచి విప్లవం అంటూ విమర్శించాడు. తాను ప్రభుత్వాన్ని గౌరవిస్తాననీ ఇటువంటి విచ్చలవిడికి అసమ్మతి వెల్లడించ కుండా ఉండలేకపోయినా ఎన్నటికీ విప్లవవాదిని కానని చెప్పాడు. అంతతో ఊరుకోక నీతి అవినీతి మీద, గౌరవం ఆత్మగౌరవం మీద మామూలు ధోరణిలో మాట్లాడాడు.

మధ్యాహ్నం భోజనాలముందు షికారుకు వెళ్ళినపుడే హెర్ క్లూబర్ అంటే జెమ్మాకి అసంతుష్టి ఏర్పడ్డది. అందుచేతనే ఆమె సానిన్‌ను దూరాన ఉంచింది. అతను అక్కడ ఉండడంవల్ల ఆందోళన చెందినట్లు కనిపించింది. ఇలా క్లూబర్ వాగుతూంటే అతను తన వరుడైనందుకు

జెమ్మా సిగ్గుపడింది. ఇంటికి చేరుకునే ముందు నిజంగా బాధపడ వొచ్చింది. అంతకు ముందులాగా సానిన్‌తో మాట్లాడకుండా మనసును నిరోధించుకున్నా అతనివంక హఠాత్తుగా ప్రార్థనా పూర్వకంగా చూపు బరపింది....ఇక సానిన్‌లో హెర్ క్లూబర్‌మీద కోపంకంటె జెమ్మా మీద దయ ఎక్కువైంది. ఆ మరునాడు ద్వంద్వయుద్ధానికి సవాలు అంగీకరించవలసి ఉన్నా, ఆనాడు జరిగిన సంఘటనలకు సానిన్ సంతోషించాడు. కాకపోతే ఆ సంతోషం స్పష్టం కాలేదు.

చివరికి బాధాకరమైన వినోదయాత్ర ఆఖరైంది. బగ్గీ రొట్టెల దుకాణం ముందు ఆగింది. జెమ్మాకు బగ్గీలోనుంచి దిగడంలో సాయం చేస్తూ సానిన్ అధికారుల దగ్గరనుంచి తీసుకున్న గులాబిపువ్వును జెమ్మా చేతిలోపెట్టాడు. ఆమె మొహం సిగ్గుతో కెంపువారింది. అతని చేతిని వత్తి తక్షణమే ఆ పువ్వును దాచేసింది. చీకటి ఇంకా పడలేదు. అయినా సానిన్ లోపలికి వెళ్ళదలచుకోలేదు. జెమ్మాకూడ లోపలికి రమ్మని అతనిని ఆహ్వానించలేదు. అంతేకాదు, పాంటలియోన్ గుమ్మంలో ప్రత్యక్షమై ఫ్రా లెనోరీ పండుకుందని చెప్పాడు. ఎమిలియో సిగ్గుపడుతూ సానిన్ దగ్గర శెలవు తీసుకున్నాడు. సానిన్ ప్రవర్తన అతనికి పరమాద్భుతం అనిపించింది. దూరదూరంగా ఉండసాగాడు. క్లూబర్ సానిన్‌ను హోటలుకు తీసుకువెళ్ళి దిగబెట్టి అతి మర్యాదగా శెలవు పుచ్చుకున్నాడు. ఆ జర్మను గంభీరుడు ఆత్మవిశ్వాసం గలవాడు. అయినా బిడియపడ్డాడు నిజానికి ఎవరికి వారే అంతా తిరిగి బిడియ పడ్డారు.

సానిన్ తొందరగానే బిడియాన్ని వదిలించుకున్నాడు. దాని స్థానంలో అస్పష్టమైన, సంతోషప్రదమైన, ఆనందప్రదమైన ఒకానొక మనోవస్థ ప్రవేశించింది. మనసులోనుంచి ఆలోచనను తరిమివేసి ఈల వెసుకుంటూ ఆత్మ సంతృప్తితో ఆ గదిలో అటూ ఇటూ పచార్లు చేసాడు.

# 17

"ఆ అధికారి వచ్చి చెప్పేదేమిటో వినేందుకు పది గంటలదాకా నిరీక్షిస్తాను పది దాటింతరవాత వస్తే నా కోసం వెతుక్కొనసీ." అనుకున్నాడు సానిన్ ఆ మరునాటి ఉదయం అలంకరించుకోవడం పూర్తికాగానే. కాని ఆ జర్మన్లు పెందలకడే లేచేవారు. గడియారం తొమ్మిది కొట్టిందో లేదో నౌకరు రెండవ లెఫ్టనెంటువాన్ రిచ్చర్ వచ్చాడని సానిన్‌కు తెలియజేసాడు. సానిన్ ఆ పెద్దమనిషిని లోపలకు తీసుకుని రమ్మని నౌకరుకు చెప్పాడు. ఆ అగంతకుని ఆకారం చూసే సరికి సానిన్‌కి ఆశ్చర్యం వేసింది. అతను పిల్లవాడిలా ఉన్నాడు, ఇంకా గడ్డం మొలవనేలేదు. హెర్‌వాన్ రీచ్చర్ హుందాగా కనిపించాలని యత్నించాడు గాని ఏమాత్రం లాభం లేకపోయింది. కలవరపాటును కూడా దాచుకోలేక పోయాడు. కుర్చీలో కూర్చొనబోయాడు. కత్తి అడ్డువచ్చింది. కాలుజారి పడ్డాడు. తడబడుతూ, నత్తుతూ గ్రామ్య ఫ్రెంచి భాషలో ఆ కిందటిరోజున అవమానకరంగా మాట్లాడినందుకు క్షమాపణ చెప్పమని అడగడానికి తన్ను తన స్నేహితుడు బారన్ వాన్‌డాన్‌హాఫ్ పంపాడని చెప్పాడు. హెర్ వాన్‌సానిన్ గనక క్షమాపణ చెప్పడానికి నిరాకరిస్తే బారన్ వాన్‌డాన్‌హాఫ్ ద్వంద్వయుద్ధానికి సవాలు చేసాడనీ తెలిపాడు. దానిమీద సానిన్ తాను క్షమాపణ చెప్పదలచుకోలేదని ద్వంద యుద్ధానికి సిద్ధమేననీ జవాబిచ్చాడు. హెర్ వాన్‌రీచ్చర్ ఇంకా నత్తిగానే ఎవరితో, ఎప్పుడు, ఎక్కడ అవసరమైన ప్రాథమిక సంభాషణలు జరప దలచారని అడిగాడు. రెండుగంటలలో తిరిగి రావలసిందనీ ఈలోగా సహాయకుణ్ణి కుదుర్చుకుంటాననీ సానిన్ జవాబిచ్చాడు. ("యెవరిని కుదుర్చుకోను ?" అని తనలో తాను అనుకున్నాడు.) హెర్ వాన్‌రిచ్చర్

లేచి శెలవు తీసుకో నారంభించాడు....కాని అనుతాపం చుట్టుముట్టగా గుమ్మంలో ఆగి సానిన్ వంక తిరిగి తన స్నేహితుడు బారన్‌వాన్‌డాన్ హాఫ్ కొంతవరకు నిన్నటి సంఘటనకు తనదే తప్పు అని భావిస్తు న్నాడనీ అందుకని ఏదో కాస్త క్షమాపణ చెపితే సంతృప్తి పడదలచాడనీ గొణిగాడు. తన తప్పేమీ లేదు కాబట్టి కాస్తఅయినా ఎక్కువైనా క్షమాపణ చెప్పేది లేదని సానిన్ ప్రత్యుత్తర మిచ్చాడు.

"అలా అయితే" అని వాన్‌రిచ్చర్ ఇంకా ఎక్కువగా సిగ్గు పడుతూ "స్నేహపూర్వకంగా ఒకరిమీద ఒకరు కాల్పులు చేసుకోవాలి."

"నాకేమీ అర్థం కావడంలేదు" అన్నాడు సానిన్. "అయితే గాలి లోకి కాల్చాలా ?"

"ఎబ్బెబ్బే, అదేంకాదు" అని నత్తుతూ వాన్‌రిచ్చర్ పూర్తిగా సిగ్గుపడుతూ, "మీ యిద్దరూ పెద్దమనుషులు అవడంచేత అలా అన్నాను....మీ సహాయకునితో మాట్లాడతాను—" అంతటితో ఆపి వెళ్ళిపోయాడు.

ఆ లెఫ్టినెంటు వెళ్ళిపోగానే సానిన్ కుర్చీలో కూలబడి నేలవంక తదేకదృష్టితో చూసాడు. "యిదంతా యేమిటి ? నా జీవితం హఠాత్తుగా యెంత విచిత్రమైన గాడిలో పడింది ! నా గత జీవితమంతా, నా భావి జీవితమంతా హఠాత్తుగా అర్ధరహితమై పోయినట్లు కనిపిస్తోంది. ఫ్రాంక్ ఫోర్ట్‌తో ద్వంద్వయుద్ధం చేయడం ఒక్కటే మిగిలిందల్లా." ఈ కింది గీతం పాడుతూ నృత్యం చేసిన అతని పినతల్లి - పిచ్చిది - జ్ఞాపకం వచ్చింది.

రాజా నా రాజా
నా అవల్దారు రాజా
రావోయి నావెంట
రావోయి రాజా !

ఆ పిచ్చిది పాడినట్టు తానూ పాడుతూ విరగబడి నవ్వాడు.

రావోయి నావెంట
రావోయి రాజా !

"దీని విషయం యేదో చూడాలి. వ్యవధికూడా ఆట్టేలేదు." అన్నాడు బిగ్గరగా. దిగ్గున లేచి చూసేసరికి ఎదురుగా చేతిలో చీటీ పట్టుకుని పాంటలియోన్ ప్రత్యక్షమయాడు.

"చాలామాట్లు తలుపుకొట్టాను. మీరు పలకలేదు. బయటికి వెళ్ళారని అనుకున్నాను" అంటూ గొణిగి ఆ ముదుసలి చీటీ అందించాడు. "యిది సినోరినా జెమ్మా మీ కిమ్మని యిచ్చింది."

సానిన్ ఆ చీటీని యాంత్రికంగా అందుకుని ఊడతీసి చూసాడు. అతనికి తెలిసిందే ఒకానొక వ్యవహారం విషయమై ఆందోళనపడు తున్నాననీ, వెంటనే అతనిని చూడాలని ఉందనీ జెమ్మా ఆ చీటిలో వ్రాసింది.

"సిన్యోరినా చాలా ఆదుర్దాపడుతోంది" అంటూ ప్రారంభించాడు పాంటలియోన్. ఆ చీటీలో ఏమి వ్రాసిఉందో అతనికి తెలుసు. "మీరు యేం చేస్తున్నారో చూసి తీసుకురమ్మని చెప్పింది."

ఆ ముదుసలికేసి సానిన్ తేరిపారజూచి, ఆలోచించాడు. ఒక భావం హఠాత్తుగా అతని మనసులో తళుక్కుమని మెరసింది. మొట్ట మొదట అది అసంభవం అసంగతం అని తోచింది....

"అయినా....యెందుకు కాకూడదు?" అని తనను తాను ప్రశ్నించు కున్నాడు.

"మాన్షియర్ పాంటలియోన్ !" అని పిలిచాడు బిగ్గరగా.

ఆ వృద్ధు అదిరిపడి, మెడ పట్టీలోకి గడ్డం పోనిచ్చి సానిన్‌వంక తదేక దృష్టితో చూసాడు.

"నిన్నేం జరిగిందో నీకు తెలుసుగా" అన్నాడు సానిన్.

పాంటలియోన్ పెదవులు చప్పరించి ముందరిజుట్టు వెనకకు విసిరివేసికొని.

"ఆఁ - తెలుసు" అన్నాడు.

(ఎమిలీ ఇంటికి రావడంతోనే అంతా అతనికి చెప్పాడు)

"ఆఁ-తెలుసునన్నమాట. మంచిది....నన్ను చూడడానికి ఒక అధికారి యిపుడే వచ్చి వెళ్లాడు. ఆ నీచుడు నన్ను ద్వంద్వయుద్ధానికి సవాలు చేశాడు, సవాలు అంగీకరించాను. కాని నాకు సహాయకులు లేరు. నా సహాయకుడుగా వుండడానికి అంగీకరిస్తావా ?"

పాంటలియోన్ ఆదరిపడ్డాడు. కనుబొమలు పైకెత్తాడు. అవి ముందుకు వేలాడుతున్న జుట్టులో మాటుపడిపోయాయి.

"నిజంగా పోట్లాడవలసిందేనా ?" అన్నాడు ఎలాగో ఒకలాగు ఇటాలియన్ భాషలో ఇప్పటివరకు ఫ్రెంచి భాషలో మాట్లాడుతున్న వాడల్లా.

"తప్పదు. యింకే తోవతొక్కినా శాశ్వతంగా నన్ను నేను అవమానపర్చుకోవడమే అవుతుంది"

"హుఁ - నేను మీకు సహాయకుడినిగా వుండడానికి యిష్టపడక పోతే యింకోకడిని చూసుకుంటారన్నమాట"

"ఆఁ - తప్పకుండా"

పాంటలియోన్ చూపు కిందకివాల్చి, "మీరు ద్వంద్వయుద్ధం చేయడంవల్ల ఒకానొక మనిషికి అప్రదిష్ట వచ్చి పడదనుకుంటున్నారా?"

"అప్రతిష్ట వస్తుందనుకోవడంలేదు. యేమైనా గత్యంతరంలేదు"

"హుఁ -" పాంటలియోన్ మెడపట్టీలోకి ఇంకా కుంచించుకు పోయాడు. "క్లూబర్ సంగతేమిటి ?" అని హఠాత్తుగా అన్నాడు మొహం పైకెత్తి.

"అతని సంగతా ? మరేం లేదు"

"యిష్ !" పాంటలియోన్ అసహ్యభావంతో బుజాలు ఎగర వేసాడు. "ఏమైనా, మీకు కృతజ్ఞుణ్ణి." అన్నాడు కొంచెం ఆగి గద్గద

స్వరంతో. "ప్రస్తుత నీచస్థితిలో నున్న పెద్దమనిషిగా గుర్తించినందుకు-యిలా గుర్తించి మీరు మీ వుదారస్వభావాన్ని వెల్లడించారు. కాని మీ ప్రతిపాదనను నేను ఆలోచించాలి."

"వ్యవధి లేదు. మాన్షియర్ సి....సిప్పా...."

"....టోలా" అంటూ అందించాడు ఆ వృద్ధు. "ఆలోచించుకోవడానికి ఒక గంట వ్యవధి యివ్వండి చాలు. నాకెంతో వుపకారం చేసిన ఆవిడ కూతురు యీ వ్యవహారంలో చిక్కుకుంది....ఆలోచించుకోవాలి....తప్పకుండా....ఒక గంటలో నా నిర్ణయం తెలియజేస్తాను పోనీ ముప్పావుగంటలో"

"సరే, అలాగేకానీ"

"యిక....సినోరినా జెమ్మాకు యేం జవాబు చెప్పను"

సానిన్ కాగితం తీసి దానిమీద, "ప్రియమైన స్నేహితురాలా, ఆదుర్దా పడవద్దు. మూడు గంటల్లో నీ దగ్గిరికి వచ్చి అంతా చెపుతాను. సానుభూతి చూపినందుకు యెంతో కృతజ్ఞుణ్ణి" అని టూకీగా వ్రాసి పాంటలియోన్ చేతికి ఇచ్చాడు.

ఆ ముదుసలి దానిని జాగ్రత్తగా పక్కజేబులో పెట్టుకుని "ఒక గంటలో" అంటూ బయలుదేరాడు. కాని హఠాత్తుగా వెనుదిరిగి, సానిన్ దగ్గిరకు పరుగెత్తుకువెళ్ళి చేయి పుచ్చుకుని, దానిని తన గుండెలమీద పెట్టి నొక్కుకుని" మహానుభావా! వుదారహృదయా! యీ ముసలి పీనుగను నీ వీరహస్తం నొక్కనీ" అన్నాడు. అలా అని వెనకకు వురికి చేతులు రెండూ ఎత్తి చక్కాబోయాడు.

సానిన్ అతను వెళ్ళిన దిక్కే చూసాడు....వార్తాపత్రిక ఒకటి తీసుకుని చదవడానికి కూర్చున్నాడు. అక్షరాలమీద దృష్టి సారించాడు, కాని లాభం లేకపోయింది. ఒక్కమాటా అర్థంకాలేదు.

# 18

ఒక గంట తరవాత నౌకరు మరలా సానిన్ దగ్గిరకువచ్చి మాసిపోయిన పాతకార్డు అందించాడు. దానిమీద "పాంటలియోన్ సిపాటోలా, మొడెనాప్రభువు ఆస్థాన గాయకుడు" అని వ్రాసిఉంది. నౌకరు వెనకాలే పాంటలియోన్ స్వయంగా వచ్చాడు, ఆ పాదమస్తకం మూరిపోయాడు. నల్లటి పాతపొడుగుకోటు తెల్లటి బిరుసు వేస్టుకోటు ధరించాడు. వేస్టుకోటుమీద రాగిగొలుసు వేలాడుతోంది. బిగుతుగా నల్లగాఉన్న ఇజారుమీద బరువైన యమనరాయి సికాముద్ర ఊగుతోంది. కుడిచేతిలో కుందేలు బొచ్చుతోచేసిన నల్లటిహాటు, ఎడమచేతిలో మంద పాటితోలు చేతి తొడుగులజత ఉన్నాయి. మెడపట్టి మామూలుకన్న వెడల్పుగా, ఎత్తుగా ఉంది. వైడూర్యపు పిన్ను బిరుసుబనీనుకు పెట్టబడి ఉంది. కుడిచూపుడు వేలుకు మండుతున్న హృదయాన్ని పట్టుకున్న రెండుచేతుల ఆకారంలో సికాఉంగరం అలంకృతమైంది. ఆ ముదుసలి దుస్తులు పాతవాసన - కర్పూరం కస్తూరి కలిపిన వాసన వేస్తున్నాయి. ఆదుర్దాగా, గంభీరంగా ఉన్న అతనిపై ఖరికి ఎంతటి ఉదాసీనుడైనా ఆశ్చర్యపడక మానడు. సానిన్ అతనిని కలుసుకోవడానికి లేచాడు.

"నే సహాయకుడిగా పని చేస్తాను" అన్నాడు పాంటలియోన్ ఫ్రెంచిభాషలో. నాట్యం చేసేవాడిలాగా బూట్ల మొనలు దూరంగా పెట్టి నిలబడి నడుంవంచి నమస్కరించాడు "ఆదేశాలకోసం వచ్చాను. చచ్చే దాకా పోరాడవలసిందేనా ?"

"అంతవరదాకా యెందుకు, మాన్షియర్ సిపటోలా !" నిన్న నేను అన్నమాట వుపసంహరించుకోవాలని నాకు లేదు. అయినా నాకు రక్తపిపాసలేదు. కాస్త ఆగావంటే నా ప్రత్యర్థి సహాయకుడు ఒక్క

నిమిషంలో వస్తాడు. మీ యిద్దరూ ఒక ఒప్పందానికిరావడానికి యత్నిం చండి. నేను పక్కగదిలోకి వెళ్ళిపోతాను. నామాట నమ్ము. నీవుపకారం యెన్నటికీ మరిచిపోను. హృదయపూర్వకంగా కృతజ్ఞత తెలుపుతాను"

"అన్నిటినీ మించి గౌరవం" అని జవాబిచ్చి పాంటలియోన్ సానిన్ కూర్చోమనేవరకూ ఆగకుండా ఒక పడకకుర్చీలో కూలపడ్డాడు. "ఆ గల్లాపెట్టె మనిషికి అతని కర్తవ్యమేమిటో అర్థం కాకపోతే, లేక అతను వట్టి పిరికివాడైతే మరీ అద్దాన్నం! యెందుకూ కొరగాని వాడు. అంతే? యిక ద్వంద్వయుద్ధ నియమాల విషయం - నేను నీకు సహాయకుడిని. నీ క్షేమం నాకు అతిప్రధానమైంది. నేను పాడువాలో నివసించినపుడు అక్కడ అశ్వికదళం ఒకటి వుండేది. అందులోని అధికారులు చాలామందితో నాకు చనువు కలిగింది, వారి గౌరవమర్యాదలపద్ధతి నాకు తెలుసు. యీ విషయాలు నేను తరుచు మీ టార్‌బుస్కీతో చర్చించాను.... ఆ సహాయకుడు తొందర్లోనే వస్తాడా ?

"యే నిమిషాన్నయినా రావచ్చు. - ఓ-అదిగో, రానేవచ్చాడు !" అన్నాడు సానిన్ కిటికీగుండా తేరిపారజూస్తూ.

పాంటలియోన్ లేచి, గడియారం వంక చూసి, ముంగురులు సవరించుకుని, లాగు కాలు అంచున వేలాడుతున్న నాడా బూటులోకి దోపుకున్నాడు. ఆ రెండవ లెఫ్టనెంటు ఇంకా సిగ్గుపడుతూ, కలవర పడుతూ ప్రవేశించాడు.

సానిన్ వారిద్దరినీ ఒకరి నొకరికి పరిచయం చేసాడు.

ఆ వృద్ధుని ఆకారం చూసేసరికి రెండవ లెఫ్టనెంట్‌కి ఆశ్చర్యం వేసింది. తనకు అపుడే పరిచయమైన ఈ కళాకారుడు పాకశాస్త్రంలో మంచి నేర్పరి అని ఎవరైనా అతని చెవిలో ఊదితే ఏమనేవాడో? కాని పాంటలియోన్ ద్వంద్వయుద్ధపు ఏర్పాట్లు తనకు నిత్యకృత్యం అన్నట్లుగా ప్రవర్తించడానికి యత్నించాడు. అతని గత నాటకజీవిత స్మృతులు ఇపు డెంతగానో తోడ్పడ్డాయి. నాటకంలో పాత్ర వహించినట్టే సహాయకుని పాత్రను వహించాడు. ఉభయులూ ఒక్క క్షణం మౌనంగా ఉండి పోయారు.

పాంటలియోన్ ఆ మౌనాన్ని భగ్నమొనర్చాడు.

"యిక ప్రారంభిద్దామా ?" అన్నాడు సికాముద్ర అల్లలాడిస్తూ.

"ఓ-అలాగే" అని జవాబిచ్చాడు రెండవ లెఫ్టెనెంటు. "కాని.... అసలువారిలో ఒకరి సమక్షంలో...."

"యిపుడే వెళ్ళిపోతాను" అని సానిన్ వంగి నమస్కరించి పడక గదిలోకి వెళ్ళి తలుపు మూసివేసాడు.

పక్కమీద వాలి సానిన్ జెమ్మాను గురించి ఆలోచించసాగాడు.... కాని మూసిన తలుపుగుండా సహాయకుల సంభాషణ వినవచ్చింది. సంభాషణ ఫ్రెంచిభాషలో సాగింది. ఉభయులూ ఆ భాషను నిర్దాక్షిణ్యంగా తమకు ఇష్టంవచ్చినట్లు ఖూనీ చేస్తున్నారు. పాంటలియోన్ పాడువా ఆశ్వికదళ ప్రసక్తి, టార్చ్యుస్కీ ప్రసక్తి మరల తెచ్చాడు. రెండవ లెఫ్టనెంటు 'క్షమాపణ', 'సౌజన్యం' అంటూ మొదలుపెట్టాడు. కాని ఆ ముదుసలి 'క్షమాపణ' సంగతి వినిపించుకోలేదు. ప్రపంచంలోని అధికారు లందరూ ఒకానొక అమాయకపు కన్నె కాలిగోటికి కూడా సరిపోలరు అంటూ హఠాత్తుగా మొదలు పెట్టాడు. సానిన్‌కి భయం వేసింది...."సిగ్గుచేటు ! సిగ్గుచేటు !" అని పదే పదే పునరుద్ఘాటించాడు పాంటలియోన్. మొట్టమొదట రెండవ లెఫ్టనెంటు ఈ మాటలను పట్టించుకోలేదు గాని తరవాత తరవాత ఆ యువకుని గొంతు కోపంతో వణికిపోయి వినిపించింది. నీతులమీద ఉపన్యాసం వినడానికి తానక్కడకు రాలేదని ఖండితంగా చెప్పాడు....

"నీ వయసులో నీతివాక్యాలు వినడం మంచిది" అన్నాడు పాంటలియోన్.

ఆ సహాయకు లిద్దరిమధ్య చర్చలు మాటిమాటికీ తారాస్థాయి నందుకున్నాయి. గంటసేపు చర్చించి ఈ క్రింది షరతులను ఉభయులూ అంగీకరించారు.

బారన్ వాన్‌డాన్‌హాఫ్, మాన్షియర్ డి సానిన్ ఉభయులూ హనో సమీపంలోని చిన్న అడవిలో ఆ మరునాటి ఉదయం పది గంటలకు

కలుసుకోవాలి. ఇరవై అడుగుల దూరంలో నిలబడి ఒకరి మీద ఒకరు కాల్పులు సాగించాలి. • సహాయకులు సంజ్ఞ చేయగానే రెండుసార్లు మాత్రమే కాల్చాలి, పిస్తోళ్ళు ఒంటిగొట్టపువి మాత్రమే అయివుండాలి. హెర్ వాన్‌రిచ్చర్ వెళ్ళిపోయాడు. పాంటలియోన్ పడక గది తలుపు గంభీరంగా తెరిచి సమావేశ ఫలితాలను సానిన్‌కి తెలియజేసి "బలే రూసో ! బలే ! నీదే విజయం !" అన్నాడు

కొద్ది క్షణాల తర్వాత ఇద్దరూ రోసెల్లీ దుకాణానికి బయలు దేరారు. ద్వంద్వయుద్ధం సంగతి అతి రహస్యంగా ఉంచుతానని పాంటలియోన్ వాగ్దానం చేసేటట్టు చేసాడు సానిన్. ప్రతిదానికీ జవాబుగా వేలు పైకెత్తి, కళ్ళు కుంచించుకుని వెంటవెంటనే రెండు మారులు 'రహస్యం' అని చెవిలో ఊదాడు. పాంటలియోన్ తిరిగి యువకుడుగా మారిపోయినట్టు కనిపించాడు. అడుగు భారంగా పడడం లేదు· ఈ అసాధారణ సంఘటన-అసంతుష్టికర మైనప్పటికీ వెనక రంగ స్థలంమీద సవాలు చేసిననాటి, సవాలు అందుకున్న నాటి మనిషి అయి పోయాడు. గాయకులు బడాయికోర్లని అందరికీ తెలిసిందేగా!

# 19

సానిన్‌ను ఆహ్వానించడానికి ఎమిలీ పరుగెత్తుకుంటూ ఎదురేగాడు. గంటకు పైనుంచి సానిన్ రాకకోసం నిరీక్షిస్తున్నాడు. నిన్నటి గొడవ సంగతి తన తల్లికేమీ తెలియదనీ, ఆ విషయం ఏమాత్రం ఎత్తవద్దనీ మళ్ళీ తనను దుకాణానికి పంపుతున్నారనీ సానిన్ చెవిలో చెప్పాడు.... దుకాణానికి వెళ్ళడం నా కిష్టంలేదు, ఎక్కడైనా దాక్కుంటానని కూడా చెప్పాడు. కొద్ది సెకండులలో ఇదంతా చెప్పి హఠాత్తుగా సానిన్ భుజం ఒత్తి ఉద్రేకంతో సానిన్‌ను ముద్దుపెట్టుకుని తుర్రుమని వెళ్ళిపోయాడు. దుకాణంలో జెమ్మా కనిపించి ఏదో చెప్పబోయింది గాని మాట పెగల లేదు. ఆమె పెదవులు కొద్దిగా వణికాయి. కళ్ళు కుంచించుకుని చుర చుర పక్కచూపులు చూసింది. ఆ విషయంలో మరేమీ జరగలేదని నమ్మబలికి ఓదార్చాలని సానిన్ తొందరపడ్డాడు.

"యివాళ మిమ్మల్ని చూడడానికి యెవరూ రాలేదా ?" అని ఆమె అడిగింది.

"వచ్చాడు. అతనితో చర్చించి....సంతృప్తికరమైన నిర్ణయానికి వచ్చాను."

జెమ్మా తిరిగి గల్లాపెట్టె వెనకకు వెళ్ళింది.

"నా మాటలు నమ్మడంలేదు"తనలో తాను అనుకున్నాడు సానిన్ అయినా వెనక గదిలోకి వెళ్ళాడు. అక్కడ ఫ్రా లెనోరీ కనిపించింది.

తల నొప్పి కొంచెం తగ్గింది. కాని విచారంగా ఉంది. సానిన్‌ని చూసి ఆప్యాయంగా మందహాసం చేసి అతనికి వినోదం కలిగించే

మనోస్థితిలోలేనని హెచ్చరించింది. సానిన్ ఆమె పక్కన కూర్చుని ఆమె కనురెప్పలు వాచి ఎర్రగా ఉన్నాయని గమనించాడు.

"యేమిటి ఫ్రా లెనోరీ ! యేడుస్తున్నట్లున్నావే ?"

"యిష్ !...." అంది మెల్లిగా కూతురు ఉన్న గదికేసి తల పంకించి చూపిస్తూ. "బిగ్గరగా అముక్కు అనకు"

"యేడవడం దేనికి ?"

"ఆఁ- మాన్షియర్ సానిన్ ! యెందుకో నాకే తెలీదు."

"యెవరన్నా అవమానించారా ?"

"ఉహుఁ- లేదు .... హఠాత్తుగా యెందుకో యేడుపొచ్చింది. జియోవాన్ బాటిస్టా....నా యవ్వనం....యెంత తొందరగా గడిచిపోయిందీ జ్ఞాపకం వచ్చాయి నేను ముసలిదాన్ని అయిపోతున్నాను .... యీ భావానికి అలవాటుపడలేక పోతున్నాను. అంతా వెనకటిలాగానేవుంది.... కాని ముసలితనం - అదీ, అదీ !" ఫ్రా లెనోరీ కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగాయి "ఆశ్చర్యంతో చూస్తున్నావుగదూ .... కాని నువ్వూ ముసలి వాడివి అయిపోయాక....అదెంత బాధాకరమో అప్పుడు నీకు తెలిసి వస్తుంది."

సంతానాన్ని జ్ఞాపకం చేసి ఆమెను ఓదార్చాలని సానిన్ యత్నించాడు. ఆ సంతానంలో ఆమె తన యవ్వనం చూచుకుని సంతుష్టి పడవచ్చని చెప్పాడు. ఇదంతా పొగిడించుకోడానికి యత్నమని వేళాకోళం చేసి చూసాడు.... కాని ఆమె పరియాచకపు స్వరంలో కాకుండా యిక కట్టిపెట్టుమని వేడుకుంది. జీవితంలో మొదటిసారిగా ఈ విధమైన బాధ, వృద్ధాప్యం వచ్చిపడిందనే బాధ, ఓదార్చితే పోదని సానిన్ గ్రహించాడు. చేయగలిగినదల్లా వృద్ధాప్యాన్ని గడిచిపోనివ్వడమే. చీట్లపేక ఆడదామని సూచించాడు. అంతకంటె చేయదగిందేమీ అతనికి తోచలేదు. పేకాడడానికి ఇష్టపడింది. ఆమెకు ఉల్లాసం కలిగినట్లు కనిపించింది.

మధ్యాహ్నం భోజనాల పర్యంతం, ఆ తరవాత సానిన్ ఆమెతో చీట్లపేక ఆడాడు. పాంటలియోన్ కూడా ఆడాడు. అతని ముంగురులు

ఎన్నడూ అంతగా ముందుకు వాలలేదు. మెడపట్టీలోకీ గడ్డం అంతగా ఎన్నడూ చొచ్చుకుపోలేదు. అతని ప్రతి కదలికలోనూ గంభీరత తొణికిసలాడటంతో చూపరులు ఏ రహస్యం అతి శ్రద్ధగా కాపాడుతున్నాడా అని ఆశ్చర్యపోకుండా ఉండలేకపోయారు.

కాని రహస్యం రహస్యమే!

ఆరోజంతా సానిన్‌కు అతనిమీద గల అమిత గౌరవభావాన్ని వెల్లడించడానికి ఎంతో కష్టపడ్డాడు. నిశ్చిత గాంభీర్యంతో స్త్రీలకంటే ముందుగా సానిన్‌కు భోజనం వడ్డించాడు. పేకాటలో డబ్బంతా సానిన్‌కి ఇచ్చివేశాడు. పుచ్చుకొనకపోతే మరి మాటాడలేదు. అసందర్భంగా ప్రపంచంలోకల్లా రష్యన్లు మహోదారులనీ, పరాక్రమవంతులనీ, దృఢమనస్కులనీ స్తుతించాడు.

''బలే నక్కవినయాలు'' ! అనుకున్నాడు సానిన్.

మదాం రోసెల్లీ మనోస్థితికంటే, ఆమెకూతురు అతని ఎడ ప్రవర్తించినవిధం అతనికి ఎక్కువ ఆశ్చర్యం గొలిపింది. ఆమె అతనిని తప్పించుకుని తిరగలేదు. పైగా అతను అక్కడ ఉన్నంతసేపూ అతని పక్కనే కూర్చుంది. మాట్లాడుతూంటే విన్నది. అతనికేసి చూసింది. కాని అతనితో సంభాషణకుమాత్రం దిగలేదు. అతను ఆమెను పలకరించినపుడల్లా మెల్లగా లేచి అగదిలోనుంచి వెళ్ళిపోయేది. కొద్దినిమిషాల తరవాత తిరిగివచ్చి ఏదో ఆలోచిస్తున్నదానిలాగా, ఆశ్చర్యపోతున్నదానిలాగా మెదలకుండా ఏ మూలనో కూర్చునేది. చివరికి ఫ్రా లినోరీ సైతం ఆమె అసాధారణ ప్రవర్తనను గమనించి 'ఏమిటి సంగతి' అని ఒకటి రెండుసార్లు అడిగింది,

"అబ్బే! మరేంలేదు" అని జవాబిచ్చింది జెమ్మా.

" అప్పుడప్పుడూ యిలా వుంటూవుంటాను. అంతే. నీకు తెలుసుగా"

"అవును నిజం" అని అంగీకరించింది ఆమెతల్లి.

ఈవిధంగా ఆరోజంతా మరీ ఉల్లాసంగా కాకుండా మరీ మందకొడిగా కాకుండా, వేడుక కలిగించకుండా విసుగు పుట్టించకుండా గడిచి

పోయింది. జెమ్మాయే గనక ఇంకోవిధంగా ప్రవర్తించి ఉంటే, సానిన్ డాబులుకొట్టాలనే ప్రలోభానికి కొద్దిగానైనా లోనయేవాడే. లేదా వెళ్ళి పోయేటప్పుడు విషాద ఉద్వేగానికి వశమైపోయేవాడే· కాని జెమ్మాతో మాట్లాడే అవకాశం లేనందున కాఫీ తాగేముందు పావుగంటసేపు పియానో వాయిస్తూ కూర్చున్నాడు.

ఎమిలీ ఆలస్యంగావచ్చి హెర్ క్లూబర్ విషయం అడుగుతా రేమోనని తొందరగా తన గదికి వెళ్ళిపోయాడు. సానిన్ వెళ్ళిపోయే సమయమైంది,

జెమ్మా దగ్గర శెలవు తీసుకోసాగాడు,ఎందుకోగాని పుష్కిన్‌రచన 'యజిని ఒనెజిన్ లోలెన్స్కీ', ఓల్గాలు ఒకరినొకరు విడిచిపోవడం అతనికి జ్ఞాపకంవచ్చింది. ఆమెచేతిని గట్టిగా నొక్కి మొహంలోకి చూడాలని యత్నించాడు కాని ఆమె వేళ్ళు వదిలించుకుని కొద్దిగా పక్కకు తిరిగింది·

# 20

పోర్చిలోకి అడుగుపెట్టేసరికి నక్షత్రాలన్నీ కనిపించాయి. అహా! చిన్నవి, పెద్దవి, పచ్చనివి, ఎర్రవి, ఊదావి, తెల్లవి అసంఖ్యాకం! అన్నీ ఎడతెగకుండా మినుకు మినుకుమంటూ ప్రకాశిస్తున్నాయి· ఇంకా చంద్రో దయం కాలేదు. వెన్నెల లేకపోయినా ఆ సంధ్యావెలుగులో ప్రతిదీ స్పష్టంగా కనిపిస్తోంది సానిన్ వీధి చివరిదాకా నడిచివెళ్ళాడు....అప్పుడే ఇంటికి చేరుకోవాలని లేదు పరిశుభ్రమైన గాలిలో ఊరికే తిరుగుతూ ఆనందించాలని అనిపించింది. వెనకకు తిరిగి రోసెల్లీ రొట్టెల దుకాణం ఉన్న ఇంటిదగ్గరకు చేరుకున్నాడో లేదో వీధి కిటికీ ఒకటి హఠాత్తుగా చప్పుడుచేసుకుంటూ తెరుచుకుంది. ఆ నలుచదరపు చీకటికిటికీలో (గదిలో దీపంలేదు) ఒక స్త్రీ ఆకారం కనిపించి సానిన్‌ని పేరుపెట్టి పిలిచింది.

"మాన్షియర్ డిమిట్రీ?"

కిటికీదగ్గరికి దౌడుతీసాడు....ఎవరోకాదు జెమ్మా! ఆమె కిటికీ చట్టానికి ఆనుకుని బయటికి వంగింది.

"మాన్షియర్ డిమిట్రీ!" అంటూ ప్రారంభించి జాగ్రతాస్వరంతో "యివాళల్లా నీకొకటి యివ్వాలని చూసాను....కాని నిశ్చయించుకోలేక పోయాను. కాని యిపుడు హఠాత్తుగా నిన్ను చూసేసరికి విధిరాత అనిపించింది...."

ఇలా అని జెమ్మా అప్రయత్నంగా ఆగింది. ఇంక మాట్లాడలేక పోయింది. ఆ క్షణంలో ఒక అసాధారణ సంఘటన జరిగింది.

అంతవరకు ఆకాశంలో మచ్చుకైనా మబ్బులేదు అంతా పూర్తిగా నిశ్చలంగా ఉంది. అప్పుడు హఠాత్తుగా అతితీవ్రంగా గాలి దుమారం లేచింది. భూమికంపించింది. నక్షత్రకాంతి రెపరెపలాడింది. గాలి సుళ్ళు తిరిగింది. గాలిదుమారం శీతలంగా లేదు, వెచ్చగా ఉంది. చెట్లని, ఇంటి పైకప్పులను,గోడలను రోడ్డును తాకింది. సానిన్ హాటును ఎగరకొట్టివేసింది. జెమ్మా ఉంగరాల జుట్టును ఆడించివేసింది. కిటికీ కమ్మీకి సమాన ఎత్తులో సానిన్ తల ఉంది. అతను అప్రయత్నంగా దానికి దగ్గరసా చేరాడు. జెమ్మా అతని తలకు వక్షస్థలం నొక్కిపెట్టి రెండుచేతులతో అతని భుజాలను పట్టుకుంది. ఆ మహాకల్లోలం ఒక నిమిషంపాటు సాగింది. ఆ తరవాత పెద్ద పెద్ద పక్షిమూక ఎగిరిపోయినట్లు, గాలిదుమారం శక్తి ఉడిగి అణిగిపోయింది. మళ్ళీ పూర్తిగా నిశ్చలత రాజ్యం చేసింది.

సానిన్ తల పైకెత్తి ఎంతో అందమైన మొహంలోకి, భయంతో ఉద్రేకంతో నిండిన మొహంలోకి, పెద్ద పెద్ద కళ్ళల్లోకి, భయం గొలిపే దివ్యమైన కళ్ళలోకి చూసాడు. అంత అందం కంటపడేసరికి గుండె ఒక క్షణం ఆగిపోతుందేమోననిపించింది. అతని ఎదురు రొమ్ముమీదికి వచ్చి పడిన పట్టులాంటి ఉంగరాల జుట్టును ముద్దిడుకుని బ్రహ్మాండంమీద "ఓ-జెమ్మా!" అనిమాత్రమే అనగలిగాడు.

"యేమిటిది? మెరుపా!" అని అడిగింది ఆకాశంకేసి చూస్తూ. ఆమె చేతులు ఆతని భుజంమీద ఇంకా అలానే ఆనుకుని ఉన్నాయి.

"జెమ్మా!" అని తిరిగీ అన్నాడు సానిన్.

ఆమె నిట్టూర్చి వెనుతిరిగి గదిలోకి చూసింది. ఆ తర్వాత గభీమని దుస్తులలోనుంచి వాడిపోయిన గులాబిపువ్వు ఒకటి తీసి సానిన్‌మీదికి విసిరివేసింది.

"యీ పువ్వు నీ కిద్దామనుకున్నా...."

ఆ కిందటిరోజున అతను అధికారుల దగ్గరనుంచి గుంజుకున్న గులాబీపువ్వు అదేనని సానిన్ గుర్తించాడు.

కాని ఇంతలోకే కిటికీ మూతపడింది. నల్లటి కిటికీ అద్దాల వెనక ఏమీ కనిపించలేదు. మసక మసకలాడనుకూడా లేదు....

సానిన్‌హాటు లేకుండానే హోటలుకు తిరిగి వెళ్ళాడు....హాటు పోయిందనే విషయమే గమనించలేదు.

## 21

తెల్లవారవచ్చేముందు నిద్రపోదామని పండుకున్నాడు. అందులో ఆశ్చర్యం ఏముంది? ఆ వేసవి సుడిగాలి తాకుడుతో వెనువెంటనే-జెమ్మా అందమైందనిగాదు, అతి ఆకర్షణీయమైందనిగాదు, ఆ విషయం అతనికి ఇదివరకే తెలుసు- ఆమెను ప్రేమిస్తున్నానని గ్రహించాడు. సుడిగాలిలాగానే ప్రేమకూడా హఠాత్తుగా వచ్చిపడింది. ఇక ఈ తెలివి మాలిన ద్వంద యుద్ధం! అతి విషాదకరమైన విపత్సూచనలు అతనిని చుట్టు ముట్టినవి. ద్వంద యుద్ధంలో చావలేదే అనుకో.... ఇంకొకరికి ప్రధానమైన ఆ యువతి మీద తన ప్రేమగతి ఏమవుతుంది? ఆ 'ఇంకొకడు' పెద్ద ప్రమాదకరమైన ప్రత్యర్థి కాకపోయినా, జెమ్మా

కూడా అతనిని ప్రేమిస్తే, అసలు ఇదివరకే ప్రేమించిందేమో.... యేం జరుగుతుంది? ఏమిటీ ప్రశ్న? అంత అందమైన మనిషి ....

గదిలో అటూ ఇటూ పచార్లుచేసి మేజాబల్లముందు కూర్చు న్నాడు. తెల్లకాగితంతీసి నాలుగు పంక్తులు గీచి వెంటనే కొట్టివేశాడు... జెమ్మాను గురించి- నక్షత్రకాంతిలో, చీకటి కిటికీచట్రంలో గాలికి చిందర పందరైన జుట్టుతో నిలబడిన జెమ్మా సుందరాకృతిని గురించి ఆలోచించాడు. గ్రీకుదేవత విగ్రహంలాగా చెక్కినట్లున్న చేతులు జ్ఞాపకం వచ్చాయి. భుజాలమీద ఆ చేతులభారం తిరిగీ అనుభూతికి వచ్చింది .... ఆమె కిటికీలోనుంచి విసిరివేసిన గులాబీపువ్వు బయటికి తీసాడు. వాడిపోతున్న రేకులు మామూలు గులాబీపువ్వుకంటె ఎక్కువ సువాసనను విరజిమ్ముతున్నట్లు అతనికి అనిపించింది,

"యిక చచ్చిపోతే, వికలాంగుడయితే?"

దుస్తులు మార్చుకోకుండా సోఫాలో పండుకుని నిద్రపోయాడు.

---

ఎవరో అతని భుజంమీద తట్టారు. కళ్ళు తెరిచేసరికి ఎదురుగా పాంటలియోన్ కనిపించాడు.

"బాబిలన్ యుద్ధానికి ముందు అలెగ్జాండరు నిద్రపోయినట్టు నిద్ర పోతున్నాడు" అంటూ ఆశ్చర్యం ప్రకటించాడు ఆ ముదుసలి.

"యెన్నిగంటలయింది?" అనిసానిన్ అడిగాడు.

"పావుతక్కువయేడు. హానోకి రెండుగంటల ప్రయాణం మనం ముందుగా అక్కడకు చేరుకోవాలి. రష్యన్లు యెపుడూ శత్రువులకి ముందుంటారు. ఫ్రాంక్‌ఫోర్ట్‌లో వున్న బగ్గీలలోకల్లా ఉత్తమమైన బగ్గీ అద్దెకు తీసుకున్నాను."

సానిన్ మొహం కడుక్కోసాగాడు.

"పిస్తోళ్ళు యేవీ?"

"ఆయనగారు తీసుకువస్తున్నాడు. పైగా డాక్టర్ని కూడా వెంట తీసుకువస్తున్నాడు."

ఆ కిందటిరోజులాగా బాగా ఉత్సాహంగా కనిపించాలని పాంటలియోన్ యత్నించడం విస్పష్టమైంది. కాని బగ్గీలో ఎక్కి సానిన్ పక్కనకూర్చున్నతరవాత,బగ్గీవాడు కొరడా ఝుళిపించినతరవాతగుర్రాలు దౌడుతీస్తుంటే పాడునా అశ్వికదళ స్నేహితుడైన పాంటలియోన్‌లో హఠాత్తుగా మార్పువచ్చింది. కలవరపడ్డట్టు, కంగారు పడ్డట్టుకనిపించాడు. సరిగా కట్టని గోడలాగా అతనిలో ఏదో కూలిపోయినట్టుంది.

"మేమేంజేస్తున్నాం, భగవాన్" అన్నాడు బొంగురుగొంతుతో. జుట్టుకుదుళ్లు పట్టుకుని "నేనేంచేస్తున్నాను? ముసిలివెధవని పిచ్చివెధవని!"

సానిన్ ఆశ్చర్యంతో పాంటలియోన్ నడుంచుట్టూ చేయివేసాడు.

"అవునవును" అన్నాడు వృద్ధుడు. "మనమిద్దరమూ పూర్తిగా అనుభవించాలి - అయినా నేను పిచ్చివాడిని, పిచ్చివాడిని. అంతా చక్కగా ప్రశాంతంగా జరిగిపోతోంది....యింతలో హఠాత్తుగా - టాటా - ట్రా-టా-టా!"

"బృందగానంలోలాగా" అన్నాడు సానిన్ బలవంతాన చిరునవ్వు తెచ్చుకుంటూ. "అయినా యిందులో నీ తప్పేముంది?

"నా తప్పేంలేదు తెలుసు. అయినా తొందరపడ్డాను. క్రూరం! క్రూరం!" అని పదే పదే అన్నాడు పాంటలియోన్ ముంగురులు వెనుకకు ఎగరవేసి నిట్టూరుస్తూ.

బగ్గీ సాగిపోతోంది

---

ఉదయం శోభాయమానంగా ఉంది. ఫ్రాంక్‌ఫోర్ట్ వీధులు అప్పుడే మేలుకొని పరిశుభ్రంగా హాయిగా ఉన్నాయి. కిటికీలు తగరపురేకులులాగా మెరిసిపోతున్నాయి. టోలుగేట్లు దాటి వెళ్ళేసరికి పైన ఇంకా వెలవెలబోతున్న ఆకాశంలో భరతపక్షుల కూతలు బిగ్గరగా వినిపించాయి. హఠాత్తుగా మలుపులో ఎత్తయిన బూరుగుచెట్ల చాటునుంచి చిరపరిచిత

మైన వ్యక్తి ఆకారం ప్రత్యక్షమై వారివైపు నాలుగు అడుగులు వేసి ఆగింది. సానిన్ మళ్ళీ చూసాడు.... అదే! ఏమిలీ!

"యేమిటి? అతనికి అంతా తెలుసునాయేం? అని అడిగాడు సానిన్ పాంటలియోన్ కేసి తిరిగి "నేను పిచ్చివెధవనని చెప్పలా!" అంటూ మూలిగాడు ఆ దురదృష్ట ఇటాలియను. గొంతు నిరాశతో కీచుమంది.

"రాత్రంతా ఆ ధౌర్భాగ్యపుకుంక నన్ను చంపుకు తినేసాడు. యేంచెయ్యను? వుదయం అంతా చెప్పేసాను."

"యిదేనా రహస్యం" అనుకున్నాడు సానిన్ తనలోతాను.

ఎమిలీ నిలబడ్డచోటికి బగ్గీ వచ్చింది. సానిన్ గుర్రాలను ఆపమని బగ్గీ వాడికి చెప్పి ఆ 'దౌర్భాగ్యపుకుంక'ను రమ్మని పిలిచాడు. తప్పటడుగులు వేసుకుంటూ ఎమిలీ బగ్గీని సమీపించాడు. గుండెజబ్బు చేసిననాటిలాగానే మొహం పాలిపోయి ఉంది. నిలబడలేకపోయాడు.

"యిక్కడేం జేస్తున్నావు?" అని అడిగాడు సానిన్ కఠినంగా.

"యింటిదగ్గర వుండమంటే యిలా వచ్చావేం?"

"నన్నుకూడా మీతో రానీండి" అని వేడుకున్నాడు ఎమిలీ వణికే కంఠస్వరంతో ప్రార్థనాపూర్వకంగా చేతులుజోడించి బాగా జ్వరంలో ఉన్నవాడిలాగా పళ్ళు పటపటలాడిస్తూ. "మీకేం అడ్డురాను. నన్ను మీతో తీసుకుపొండి. తీసుకుపొండి."

"నేనంటే నీకు యేమాత్రమైనా ప్రేమ గౌరవం వుంటే తక్షణం యింటికో, హెర్ క్లూబర్ దుకాణనికో వెళ్లు. యీ విషయం ఒక్క ముక్కకూడా యెవరితో చెప్పకుండా నేను తిరిగి వచ్చేవరకు నిరీక్షిస్తూ వుండు" అన్నాడు సానిన్.

మీరు మళ్ళీ తిరిగి వచ్చేవరదాకా!" అని మూలిగాడు ఎమిలీ బీటు వారిన గొంతుతో. "మీరే గనక ...

"ఎమిలీ!" అన్నాడు సానిన్, బగ్గీవానివైపు హెచ్చరికగా చూస్తూ. "గుండె నిబ్బరంచేసుకో. యింటికివెళ్ళు. ఎమిలీ! బతిమాలుకుంటా.

నామాట వినుబాబూ! నన్ను ప్రేమిస్తున్నానంటున్నావుగా! అలా అయితే యింటికి వెళ్ళిపో."

ఇలా అని సానిన్ చేయి జాపాడు. ఎమిలీ వెక్కి_వెక్కి_ ఏడుస్తూ ముందుకు ఉరికి సానిన్ చేతిని నుద్దిడుకుని పొలాలగుండా ఫ్రాంక్ ఫోర్ట్ వైపుకి సరుగెత్తాడు.

"యింకో విశాల హృదయం!" అని గొణిగాడు పాంటలి యోన్. కాని సానిన్ విచారంగా అతనికేసి తేరి పారజూచేసరికి ఆ ముదుసలి ఒక మూల నక్కి_ కూర్చున్నాడు. తప్పు తనదేనని ఆ వృద్ధునికి తెలుసు. నిముష నిముషానికీ అతని ఆశ్చర్యం ఇనుమడిస్తోంది. సానిన్‌కి సహాయకుడిగా పనిచేయతలచింది నిజంగా అతనేనా? ఉదయం ఆరుగంటలకల్లా యింటిదగ్గరనుంచి బయలుదేరి బగ్గీ తీసుకు వచ్చి అన్ని ఏర్పాట్లు చేసింది నిజంగా అతనేనా? అన్నిటికీమించి కాళ్ళు నెప్పులు పుట్టి మహాబాధాకరంగా ఉంది.

అతనికి ఉత్సాహం కలిగించాలని ఉద్దేశించి సానిన్ అతన్ని మాటల్లో దింపాడు.

"నీ పూర్వపు వుత్సాహమంతా యేమైపోయింది, సినార్‌సిపటోలా? నీ పూర్వ పరాక్రమం యేమైపోయింది?"

సినార్‌సిపటోలా శరీరమంతా బిగపట్టుకుని మొహం చిట్లించాడు.

"పూర్వ పరాక్రమమా?" అన్నాడు గంభీర స్వరంతో.

"యింకా కొంత మిగిలేవుంది!"

మళ్ళీ ఒళ్ళు బిగబట్టుకొని తన జీవిత విశేషాలు, సంగీత నాటకాలనుగురించి, గార్సియను చెప్పసాగాడు. హానో చేరుకొనేసరికి ఇంకోమనిషి అయిపోయాడు. బాగా ఆలోచిస్తే మాట అంతటి శక్తివంతమైనది, అంతట శక్తివిహీనమైనదీ ప్రపంచంలో ఇంకొకటి లేదని తోస్తుంది.

# 22

ద్వంద్వయుద్ధం ఏ అడవిలో జరుగుతున్నదో ఆ అడవి హానోకి పావుమైలుదూరంలో ఉంది. పాంటలియోన్ చెప్పినట్లుగానే సానిన్ అతనూ ముందుగా అక్కడకు చేరుకున్నారు. అడవి సరిహద్దు లోనే ఆగమని బగ్గీవానికి చెప్పి దట్టంగా పెరిగిన చిట్టడవి చీకటిలోనికి మాయమయారు. ఇంకా ఒక గంటసేపు వారు నిరీక్షించాలి.

నిరీక్షించడం సానిన్‌కి ఎక్కువ బాధాకరంగా లేదు. పక్షులకిలకిలా రావాలువింటూ,తూనీగలు ఎగరడం అవలోకిస్తూ ఆఇరుకుదోవలో పచార్లు చేసాడు. అటువంటి పరిస్థితిలో ఉన్న అందరూ రష్యన్లలాగానే అతనూ ఆలోచించకుండా ఉండాలని ప్రయత్నించాడు, ఆ కిందటిరోజు తుపానుకు కూలిపోయిన ఒకానొక నిమ్మచెట్టుకనపడేసరికి ఆలోచనలకు దాసుడై పోయాడు.

ఆ చెట్టు ఆకులు వాడిపోయాయి. చెట్టు చావడానికి సిద్ధంగాఉంది. "యేమిటిది? శకునమా?"అనేభావం అతనిమనసులో దూసుకుపోయింది. కాని ఆ మరునిమిషంలోనే ఈలను వేస్తూ, పడిపోయిన నిమ్మచెట్టుమీదుగా ఉరుకుతూ, బాటలో పెద్దపెద్ద అంగలువేసుకుంటూ నడిచాడు. ఇక పాంటలియోన్ ఒకటే గొణుగుడు మొదలుపెట్టాడు. జర్మన్లను తిట్టి పోసాడు, దగ్గాడు, వీపు మోకాళ్ళు రుద్దుకున్నాడు అందోళనలో ఆవ లించాడు. అలా ఆవలించేసరికి అసలే చప్పిబుగ్గల మొహమేమో మరింత వికారంగా కనిపించింది. సానిన్ అతడిమొహంచూసి విరగ బడి నవ్వాడు.

సాఫీగా ఉన్న రోడ్డుమీది బగ్గీచక్రాల ధ్వనులు వారి చెవుల బడ్డాయి. "వస్తున్నారు" అన్నాడు పాంటలియోన్. లేచి టంచనుగా నిల

బడ్డాడు. కాని క్షణికం గుండెలు పీచుపీచుమన్నాయి. దానిని మరుగు పరచాలని బిగ్గరగా "బదీర్!" యివాళ ఉదయం చలిగా వుంది అన్నాడు. గడ్డి, ఆకులు దట్టమైన మంచుతో కప్పబడ్డాయి. కాని ఉష్ణం అడవి మధ్యలోకి చొచ్చుకువస్తోంది.

చెట్లనీడలకింద ఇద్దరు అధికారులు కనిపించారు. వారివెంట పొట్టిగా బొద్దుగా ఉన్న వ్యక్తి వచ్చాడు మొహం నిద్రమత్తు మొహంగా ఉంది. అతను పటాలపు శస్త్ర చికిత్సకుడు ఎందుకైనా మంచిదని కూడా కూజాతో నీళ్ళు తీసుకునచ్చాడు. శాస్త్రచికిత్సకు కావలసిన ఉపకర ణాలు కట్టుగుడ్డలు వగైరా సంచిలోపెట్టి సంచి ఎడమ బుజానికి తగి లించుకున్నాడు. ఈసూదిరి వినోదాలవల్ల అతనికి బాగా డబ్బు గిడు తుంది. ప్రతి ద్వంద్వయుద్ధంలోనూ ఉభయపక్షాలవారూ చెరో ఎనిమిది చెర్వాకట్స్‌లు చొప్పున ఇస్తారు. హెర్ వాన్ రిచ్చర్ పిస్తోళ్ళపెట్టె తెచ్చాడు. హేర్ నాన్ డాన్ హాఫ్ చేతిలోని హంటరును గిరగిరా తిప్పాడు. ఈ ద్వంద్వయుద్ధం హోర్బాటానికి ఆఖరిమెట్టుగా భావించాడు.

"పాంటలియోన్!" అంటూ సానిన్ ఆముదుసలి చెవిలో "యేదైనా ప్రమాదం జరగవచ్చు, నీకుతెలియందేముంది, నేనే గనక....చచ్చిపోతే, నా ప్రక్కజేబులో వున్న కాగితంముక్క బయటికితియి. అందులో పువ్వు చుట్టబడివుంది. ఆపువ్వును సినోరినాజెమ్మాకుయివ్వు. వినిపించిందా యిస్తానని మాటయివ్వు."

ఆ ముదుసలి విచారంగా అతనికేసి చూసి అంగీకార సూచకంగా తలఊపాడు....కాని సానిన్ ఏమిచేయమని చెప్పిందీ అర్థమైందో లేదో దేవుడికి ఒకడికే తెలియాలి.

సాంప్రదాయానుసారంగా ప్రత్యర్థులు, వారి సహాయకులు వంగి ఒకరి కొకరు నమస్కరించుకున్నారు. ఒక్క డాక్టరులోమాత్రం చలనం ఏమీ కనిపించలేదు. గడ్డిమీదకూర్చుని, "ఔదార్యంగా వినయంచూపించ వలసిన అవసరం నాకేంలేదు" అని చెప్పడానికో అన్నట్లు ఆవలించాడు. హెర్ వాన్ రిచ్చర్ ద్వంద యుద్ధానికి స్థలం నిర్దేశించమని హెర్ సిపటో లానికోరాడు. హెర్ సిపటోలా ఉద్రేకంతో (అతని మనోకుడ్యం కులగి

పోయింది). "నీకు యేది వుత్తమమని తోస్తే అది చేయి. నేనుచూస్తూ నుంచుంటాను" అన్నాడు.

హెర్వాన్ రిచ్చర్ కార్యకలాపం ప్రారంభించాడు. ఆ అడవి లోనే అతనికి పూలచెట్లతో నిండిన చక్కటి ఖాళీస్థలం కనిపించింది. అడుగులు లెక్కపెట్టి, తొందర తొందరగా ఒక కర్రముక్క చివర సన్నగా చెక్కి దానిలో ఇరువైపులా గీతలు గీశాడు, పెట్టిలోనుంచి పిస్తోళ్ళు బయటికి తీసాడు. వాటిలో గుళ్లుకూర్చడానికి నేలమీద కూర్చు న్నాడు. ఒక్కముక్కలో చెప్పాలంటే తెల్లటి జేబురుమాలుతో మొగం మీది చెమట తుడుచుకుంటూ చేయగలిగిందంతా చేసాడు. పాంటలి యోన్ అతని వెనకాలేపడి సంచరించాడు. చలికి బిగుసుకుపోయినవాడి వలే కనిపించాడు. ఈ ప్రాథమిక కార్యకలాపం జరుగుతూంటే ప్రత్యర్థు లిద్దరూ కొద్దిదూరంలో ఉపాధ్యాయుడు శిక్షించాడని చిర చిరలాడే విద్యా ర్థులలాగా నిలబడ్డారు. నిర్ణీతసమయం ఆసన్నమైంది.

ఇద్దరూ తమ తమ పిస్తోళ్లు తీసుకున్నారు....

ప్రాణాంతకమైన 'ఒకటి, రెండు, మూడు!' అనే మాటలు అనకముందే ప్రత్యర్థు లిద్దరికీ రాజీ పడమని సలహా ఇవ్వవలసిందని హెర్వాన్ రిచ్చర్ పాంటలియోన్ కోరాడు. ఈ హితబోధ పూర్తిగా సాంప్రదాయ సిద్ధమైంది. ఫలితమేమి కలదు. కాని అలా పాంటలియోన్ చేస్తే రిచ్చర్ భుజాలమీదనుంచి బాధ్యతను తొలగించినట్లవుతుంది. ఆ హితబోధ చేయవలసింది నిష్పక్షపాతి అయిన సాక్షి. కాని అక్కడ సాక్షి ఎవడూ హాజరుగాలేదు. అందుకని హెర్వాన్ రిచ్చర్ ఇచ్ఛాపూర్వ కంగా ఈ హక్కును తనకంటె పెద్దవాడైన సహాయకునికి అప్ప గించాడు, ఆ అధికారిని చూడకుండా ఉండాలనే ఉద్దేశంతో పాంటలి యోన్ అవరకే ఒక పొదవెనక కూర్చున్నాడు. రిచ్చర్‌ది ముక్క మాటేమో ఒక్కముక్కకూడా మొదట అతనికి అర్థంకాలేదు. కాని మరు నిమిషంలో లేచి, ఆద్రగా ముందడుగువేసి, గుండెలమీద పిడి కిలితో కొట్టుకుంటూ సంకర భాషలో "యేమిటా ఘోరం! మీబోటి

యువకులు పోరాడడమా ? యెందుకోసం ! ఊః-మీ మీ యింట్లకు పొండి " అని బిగ్గరగా బొంగురు గొంతుతో అరిచాడు.

" ఉహుఁ - సమాధానపడడానికి నేను అంగీకరించను " అన్నాడు సానిన్ తొందర తొందరగా.

" నేనూ అంగీకరించను " అని అన్నాడు ప్రత్యర్థి అతని వెనకనే.

" ఐ పేయిన్ 'ఒకటి, రెండు, మూడు' అని కేకపెట్టు " అన్నాడు రిచ్చార్ బిత్తరపోయి చూస్తున్న పాంటలియోన్ తో.

దానిమీద పాంటలియోన్ మళ్ళీ పొదలోకివెళ్ళి అవయవాలన్నీ ముడుచుకుని, కళ్ళు కుదించుకుని, తల అవతలకుతిప్పి గొంతెత్తి బిగ్గరగా " ఒకటి.... రెండు.... మూడు ! " అని అరిచాడు.

ముందుగా సానిన్ పిస్తోలుతో కాల్చాడు. కాని గురితప్పిపోయింది. పిస్తోలుగుండు ఒక చెట్టుబోదెకు తగిలి టపీమని ప్రతిధ్వనించింది. బారన్ వాన్ డాన్హాఫ్ వెనువెంటనే బుద్ధిపూర్వకంగా ఒక పక్కకి గాలిలోకి పేల్చాడు.

నిశ్శబ్దం ప్రబలింది.... ఒక రూకదలలేదు, పాంటలియోన్ వినిపించి వినిపించకుండా మూలిగాడు.

"యింకా కొనసాగించాలనే నీ కోరికా?" అని డాన్హాఫ్ అడిగాడు.

"నువు గాలిలోకి యెందుకుకాల్చావు? అని సానిన్ ప్రశ్నించాడు.

"నాయిష్టం. దాంతో నీకేం సంబంధంలేదు".

"రెండోసారికూడా గాలిలోకి పెల్చాలనేనా నీ కోరిక?"

"యేమో నాకే తెలియదు."

"అరరె! అసలువాళ్ళు ఒకరితోవకరు మాట్లాడుకోకూడదు. సరియైన పద్ధతికాదు."

"కాల్చేహక్కు వదులుకొంటున్నాను. "అంటూ సానిన్ పిస్తోలు నేలమీదకు గిరాటువేశాడు.

"ద్వంద్వయుద్ధం చేయదల్చుకోలేదు" అంటూ డాన్‌హాఫ్‌కూడా పిస్తోలు కింద పారవేశాడు.

"అంతేకాదు, నిన్న నే చేసింది తప్పేనని అంగీకరిస్తున్నాను."

ఒకక్షణంసేపు తటపటాయించి అనుమానంతో చేయి జాపాడు. సానిన్ వడిగా అతనిదగ్గరకువెళ్ళి కరచాలనం చేశాడు ఆయువకు లిద్దరూ మందహాసంచేస్తూ ఒకరినొకరు తేరిపారజూచుకున్నారు. వా రిద్దరికి చెంపలు ఎరుపెక్కాయి.

"బలే! బలే! అంటూ పాంటలియోన్ పిచ్చిగా చప్పట్లుకొడుతూ పొదలోనుంచి మొగ్గలువేసే పావురంలాగా చక్కావచ్చాడు. అప్పటి వరకు కొద్దిదూరంలో పడిపోయిన చెట్టుమీదకూర్చున్న డాక్టరు వెంటనే లేచి కూజాలోని నీళ్ళు కిందగుమ్మరించి మందకొడిగా అడవి సరిహద్దు లోకి వెళ్ళాడు.

"గౌరవం దక్కింది, ద్వందయుద్ధం ముగిసింది" అన్నాడు వాన్‌రిచ్చర్.

'బలే!, అని కేకపెట్టాడు పాంటలియోన్. వెనకటివన్నీ జ్ఞాపకానికి వచ్చాయి.

---

ఆ అధికారులు, సానిన్ ఒకరికొకరు వంగి నమస్కరించు కున్నారు. సానిన్‌వెళ్ళి బగ్గీలో కూర్చున్నాడు. అహ్లాదమని ఖచ్చితంగా చెప్పలేంగాని శస్త్రచికిత్స తరవాతపొందే విశ్రామానుభూతి అతని నిలువెల్లాముంచెత్తింది. అంతేగాదు, సిగ్గుతో సహమైనభావం అదే సమ యంలో అతనిని కలచివైచింది.........అంతకుముందే అతడు చేసిన ద్వందయుద్ధం పూర్తిగా అసత్యమనీ, అది లాంఛనప్రాయమైన అధి కారిక చర్యఅనీ, అధికారికి, విద్యార్థికి జరిగే మామూలువ్యవహారమేనని

తోచింది సానిన్‌కి నిద్రమత్తు డాక్టరు, అతని మందహాసం జ్ఞాపకం వచ్చాయి. కాదు,కాదు, బారన్ వాన్ డాన్ హాఫ్‌తో చేతులు పెనవేసుకుని అడవిలోనుంచి బయటికి రాగానే ఆ డాక్టరు ముక్కు ముడుచుకున్న విధాన జ్ఞాపకం వచ్చింది. ఆతరువాత పాంటలియోన్ ఆ డాక్టరుకు నాలుగుచెర్వొనిట్సీల మామూలు చెల్లించాడు.........ఓ-దీనంతటిలో ఎదో చిరాకు!

అవును. సానిన్‌కు కొంతవరకు సిగ్గు, తప్పుచేశాననేభావం కలిగాయి............ కాని అంతకన్న ఏమిచేయగలడు! ఆ తలపొగరు అధికారిని శిక్షించకుండా ఎలావదలగలడు? హెర్ క్లూబర్‌లాగా ఊరుకోలేదు. జెమ్మాపక్షం వహించి కార్యరంగలోకి దిగాడు.........అవును నిజం! కాని అతని ఆత్మ ఆందోళనపడింది, తప్పు తనదే ననుకొని సిగ్గుపడ్డాడు.

ఇక పాంటలియోన్ విజయంతో గర్వించాడు, హఠాత్తుగా గర్వం వచ్చిపడింది. విజయం సాధించి యుద్ధరంగంనుంచి తిరిగివచ్చే సేనానికూడా ఆత్మసంతృప్తితో అంతగా పొంగిపోడు. ద్వంద్వయుద్ధ సమయంలో సానిన్ ప్రవర్తన అతనిలో ఉత్సాహాన్ని రేకెత్తించింది. 'మహావీరుడు' అని కీర్తించాడు, ఆక్షేపించినా, బ్రతిమాలినా వినలేదు. పాలరాతి స్మృతిచిహ్నంతోను, కంచు స్మృతిచిహ్నంతోను, డాన్ జుఆన్ లోని సేనానివిగ్రహంతోనూ సానిన్‌ని పోల్చాడు! తనవిషయంలో, వణుకుపుట్టిందని ఒప్పుకున్నాడు. "అయితే నేను కళాకారుడిని, నా శరీరతత్వమే అంత. యిక మీరో మంచులోనూ, రాతికొండలలోను పుట్టినవారు" అన్నాడు

ఆకళాకారుని ఆవేశం ఉపశమింపజేయడమెలాగో సానిన్‌కి అర్ధంకాలేదు

---

రెండు గంటలకితం సరిగ్గా ఏ ప్రదేశంలో ఎమిలీ వారికి కలిసాడో సరిగ్గా ఆ ప్రదేశంలోనే సంతోషంతో కేకలు వేస్తు ఒక చెట్టుచాటునుంచి బైట పడ్డాడు. టోపీ ఊపుతూ సూటిగా బగ్గీదగ్గరికి ఉరుకుతూంటూ

వెళ్లాడు, బగ్గీ చక్రాలకింద పడిపోయేవాడే. కాస్తలో తప్పిపోయింది. గుర్రాలు ఆగేదాకా ఆగకుండా బగ్గీ తలుపుమీదుగా ఎగబ్రాకి సానిన్‌మీద పడ్డాడు.

"బతికే వున్నారా, గాయం తగలలేదుగా" అంటూ ప్రారంభిం చాగు." క్షమించండి. మీమాట పాటించి ఫ్రాంక్‌ఫోర్టుకి తిరిగి వెళ్ళలేదు ....కాళ్లాడలేదు ! మీకోసం యిక్కడ కాచుకుని వున్నాను....ఆ విషయ మంతా చెప్పండి. మీరు అతనిని....చంపేసారా ?"

ఎమిలీని శాంతపర్చి బలవంతాన కూర్చోబెట్టడానికి సానిన్ ఎంతో కష్టపడవలసి వచ్చింది.

పాంటలియోన్ మాటలు గుప్పిస్తూ మహా సంతోషంతో విన రంగా ఆ ద్వంద్వయుద్ధాన్ని వర్ణించి చెప్పాడు. కంచుస్మృతి చిహ్నం, సేనాని విగ్రహం ఆ వర్ణనలో మరిచేపోలేదు పడిపోకుండా నిలబడడానికి పాదాలు ఎడంగా పెట్టి, చాతీమీద చేతులు ఒకదానిమీద ఒకటి వేసుకుని, బుజంమీదుగా శుష్కించిన చూపు చూచాడు,సానిన్ సేనానిని అనుకరించా లని. ఎమిలీ భయంతో అంతా విన్నాడు. మధ్య మధ్య ఆశ్చర్యం ప్రక టిస్తూనో, తన వీరస్నేహితుని ముద్దిడుకోవడానికి లేస్తూనే ఆ కథనానికి అడ్డు తగిలాడు.

ఫ్రాంక్‌ఫోర్టులోని కంకరరోడ్డుమీద ప్రతిధ్వని కలగజేస్తూ బగ్గీ వెళ్ళివెళ్ళి సానిన్ హోటలుముందు ఆగింది.

అనుచరు లిద్దరితో రెండో అంతస్తు మెట్లు ఎక్కుతుండగా ఒక యువతి మొహం మేలిముసుగుతో కప్పేసుకుని నడవ చీకటిలో నుంచి వేగంగా దూసుకువచ్చి సానిన్‌ముందు ఆగింది. కొద్దిగా ఊగి, వణుకుతూ నిశ్వసించింది. గబగబా మెట్లు దిగి వీధిలోకి వెళ్ళిపోయింది. మరి కనబడలేదు. నౌకరు ఆశ్చర్యపోయి గంటసేపటినుంచీ ఆవిడ సానిన్‌కోసం వేచిఉందని చెప్పాడు. ఇతంతా క్షణంలో జరిగినా సానిన్ ఆమెను గుర్తుపట్టాడు ఆమె జెమ్మా! పట్టుమేలి ముసుగులోని ఆమె కళ్ళు కనిపించేసరికి గుర్తు పట్టగలిగాడు.

"అయితే జెమ్మాకి యిదంతా తెలుసునన్నమాట!" అని దీర్ఘాలు తీస్తూ అన్నాడు. గొంతులో విసుగు ధ్వనించింది. జర్మన్ భాషలో ఎమిలీ పాంటలియోన్‌లను సంబోధిస్తూ ఈమాటలు అన్నాడు.

ఎమిలీ తెల్లబోయాడు. కలవరపాటు గోచరించింది,

"అంతా చెప్పవలసి వచ్చింది" అంటూ నసాడు. "ఆమె పసి కట్టింది....నేను చెప్పకుండా వూరుకోలేకపోయాను....యిపుడు మరేం పరవాలేదులెండి" అన్నాడు హఠాత్తుగా ఉత్సాహం పొందుతూ. "అంతా దివ్యంగా ముగిసింది. మీరు భద్రంగా తిరిగిరావడం చూసింది."

సానిన్ మొహం తిప్పేసుకుని.

"మీరిద్దరూ యిద్దరు వట్టివదరుబోతులు!" అని గొణిగి నికా కుతో గదిలోకి వెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు.

"కోపగించుకోకు" అని ఎమిలీ బతిమాలుకున్నాడు.

"సరే సరే. కోపగించుకొనులే" (నిజానికి సానిన్‌కి కోపం రాలేదు. జెమ్మాకి ఈ విషయాలేమీ తెలియకూడదని అతనికిలేదు). "సరే, యిక యీ సమాదరణచాలు. వెళ్ళిపొండి....ఒంటరిగా వుండాలని వుంది కాస్త పడుకుని నిద్రపోతాను అలసిపోయాను."

"బగే ఆలోచన?" అన్నాడు పాంటలియోన్. "మీకు కాస్త విశ్రాంతి అవసరం యింత శ్రమపడ్డ తర్వాత....ఎమిలీ! పద. బొటన వేళ్ళమీద నడవాలి సుమా! బొటనవేళ్ళమీద? యిష్!"

ఈ అనుచరులిద్దరినీ పంపించివేయడానికి నిద్రవస్తోందని చెప్పాడే గాని, వారు వెళ్ళిపోయి ఒంటరిగా కూర్చోగానే సకలావయవాలు అలసి పోయినట్లు కనిపెట్టాడు. ఆ కిందటిరాత్రి కన్ను మూయనేలేదు. ఇక అపుడు పక్కమీద వాలగానే గాఢనిద్ర పట్టేసింది.

# 23

కొన్ని గంటలపాటు అతను గాఢనిద్ర పోయాడు. హెర్ ఫ్లాగర్‌తో ద్వంద్వయుద్ధం చేసినట్లు కలగన్నాడు. ఆ కలలో అత్తిచెట్టు మీద ఒక చిలక కనిపించింది. ఆ చిలక ఎవరోకాదు. పాంటలియోనే. ముక్కుతో టక్కుటక్కుమని శబ్దంచేస్తూ "ఒకటి.... రెండు.... మూడు.... మూడు.... మూడు" అని ఆ చిలక అరిచింది.

ఆ తరవాత 'మూడు' అనే మాట కలలో వినిపించలేదు. కళ్ళు తెరిచి, తల పైకెత్తి చూసాడు....ఎవరో తలుపు నెట్టుతున్నారు.

"రాండి" అన్నాడు సానిన్.

నౌకరు వచ్చి ఎవరో ఒక స్త్రీ అతనితో మాట్లాడాలని ఆతురత పడుతోందని చెప్పాడు....

"జెమ్మా."....అతని మనసులో ఈ ఆలోచన తళుక్కుమంది.... కాని ఆ వచ్చింది జెమ్మాకాదు, జెమ్మాతల్లి ఫ్రా లెనోరీ.

ఆమె గదిలో ప్రవేశించగానే కుర్చీలో కూలబడి కన్నీరు కారేటట్టు ఏడ్చింది.

"యేమిటి. మదాం రోసెల్లీ?" అని అడిగాడు సానిన్, ఆమె పక్కనే కూర్చుని ఆమె చేతిని మెల్లగా ఆప్యాయంగా తాకుతూ. "యేం జరిగింది? సంబాళించుకో."

"ఓ-హెర్ డిమిట్రీ. నేను మహాచింతలో మునిగిపోయాను!"

"చింత!"

"ఆఁ- మహాచింత! యిలా జరుగుతుందని యెవరు అనుకున్నారు? హఠాత్తుగా, ఆకాశాన్నుంచి పిడుగులాగా...."

ఆమె భారంగా ఊపిరి పీల్చింది,

"అయితే అసలువిషయం యేమిటి? చెప్పు. మంచినీళ్ళు తాగుతావా?"

"ఉహుఁ-" అంటూ ఫ్రా లెనోరీ జేబురుమాలుతో కన్నీళ్ళు తుడుచుకుని పూర్వంకన్న ఎక్కువగా ఏడవడం మొదలుపెట్టింది. అంతా నాకు తెలుసు! తెలుసు!"

"అంతా అంటే?"

"యివాళ జరిగిందంతా. దాని కారణంకూడా నాకు తెలిసింది. నువ్వు మహోవుదారంగా ప్రవర్తించావు. కాని యెంత దురదృష్టకరమైన పరిస్థితి! అందుకే నేను సాడెన్ వెళ్ళద్దని మొత్తుకున్నాను. (ఫ్రా లెనోరీ ఆరోజున వెళ్ళద్దని చెప్పనేలేదు. కాని ఇపుడు ఇలా జరుగుతుందని తనకు ముందే తెలుసునని నమ్ముతోంది) "నిన్ను యెరుగుదల్లా అయిదు రోజులనుంచే; అయినా స్నేహితుడివని, గౌరవనీయుడవని నీ దగ్గిరికి వచ్చాను....నాకా భర్తలేడు, ఒంటరిదాన్ని.... నా కూతురు....?"

ఫ్రా లెనోరీ గొంతుకన్నీటితో ఉక్కిరిబిక్కిరి అయింది. సానిన్‌కి ఏమనుకోవాలో తోచలేదు...."నీ కూతురా?" అని తిరిగి అన్నాడు.

"నా కూతురు - జెమ్మా...." కన్నీటితో తడిసిన జేబురుమాలు నోటికి అడ్డు పెట్టుకుందేమో దాని వెనకనుంచి పైమాటలు మూలుగులాగా వెలువడ్డాయి, "....హెర్‌క్లూబరును పెళ్ళి చేసుకోననీ. ఆసంగతి అతనికి చెప్పేయమనీ యివాళ నాతో చెప్పింది."

సానిన్ కొద్దిగా అదిరిపోయాడు ఇలా జరుగుతుందని అతను ఆశించలేదు.

"అవమానం విషయం నేను యెత్తడంలేదు. ప్రధానం అయిం తర్వాత యెవతె వరుణ్ణి తిరస్కరిస్తుంది చెప్పు? కాని దీంతో మేం సర్వనాశనం అయిపోతాం, డిమిట్రీ!" ఫ్రా లెనోరీ చురుకుగా జేబురుమాలును ఉండజుట్టింది. తన దుఃఖాన్నంతా ఆ ఉండలో బిగించి వేయాలని నిశ్చయించుకొన్నట్లుగా ఉంది.

"దుకాణంమీద వచ్చే రాబడితో మేం బతకలేం, హెర్ డిమిట్రీ! హెర్ క్లూబర్ చాలా ధనవంతుడు, నానాటికీ యింకా ధనవంతుడవుతాడు: అటువంటపుడు తిరస్కరించడం దేనికి ? తన పక్షం వహించి నిలబడ లేదనేగా? అవును. అతను సవ్యంగా నడుచుకోలేదనుకో. మామూలు పౌరుడాయె, పెద్దచదువులు చదువుకొన్నవాడుగాదు, యెవడో అనామకుడు యేదో కొంటెపని చేస్తే అంత గౌరవంగల వాణిజ్యవేత్త లక్ష్యంచేస్తాడా? యింతకీ ఆ అధికారి పెద్ద అవమానమేం చేసాడేం ?"

"క్షమించండి. మీరు నన్ను నిందిస్తున్నట్టున్నారు...."

"నిన్ను నేనేం నిందించంలేదు. నీ విషయం వేరు మీ రష్యన్లం దరిలాగానే నువూ మిలిటరీవాడివి...."

"క్షమించండి. నేనుకాను...."

"నువు విదేశీయుడివి. అగంతకుడివి. నీకెంతో ఋణపడి వున్నా" అంది ఫ్రా లెనోర్ సానిన్‌మాట వినిపించుకోకుండా. ఆమె భారంగా ఊపిరి పీల్చింది. ఋణపడి వున్నానని సంజ్ఞచేసింది. జేబురుమాలు సవ రించి ముక్కు చీదుకుంది. దుఃఖాన్ని వెల్లడించే విధానం చూస్తే ఉత్తర ప్రాంతంలో ఆమె పుట్టలేదని తెలియజేస్తుంది.

"వాడకందార్లతో వాదించాల్సివస్తే హెర్ క్లూబర్ వ్యాపారం ఏమిచేయగలుగుతాడు? యింతవరకు యెన్నడూ కనీ వినీ యెరగనిసంగతి! మా అమ్మాయి అతన్ని చేసుకోదని చెప్పాలి! యికమీద జీవనం యెలా? యిదివరకు 'దేవతారొట్టె', బావంఘీరు మే మొక్కళ్ళమే తయారు చేసేవాళ్ళం. అమ్మకం యెక్కువగా వుండేవి. కాని యిపుడు ప్రతివాడూ దేవతారొట్టెను చేస్తున్నాడు. ఆలోచించు- యివన్నీ అలా వుంచి మీ ద్వంద్వయుద్ధం విషయమై పట్నమంతా తెగచెప్పుకుంటారు యిటువంటివాటిల్లో యెవరినోరూ కట్టేయలేంగదా, యింతలో హఠా త్తుగా నిశ్చయమైన సంబంధం చెడిపోతే .... అప్రదిష్ఠ! అప్రదిష్ఠ! జెమ్మా మంచిదే . నేనంటే చాలాప్రేమ. కాని అది వట్టి రిపబ్లికను. మొండిఘటం. ప్రజాభిప్రాయం లక్ష్యంపెట్టదు. నువొకడివే దానిని వొప్పించగలవు."

సానిన్‌కి ఇంకాఎక్కువ ఆశ్చర్యంవేసింది. "నేనా? ఫ్రా లెనోరీ!"

"అవును. నువ్వే-నువ్వొకడివే. అందుకే నేను నీ దగ్గరికివచ్చాను. యింతకంటె నాకేం తోచలేదు. నీవు చాలా తెలివిగలవాడివి మంచి వాడివి. జెమ్మాపక్షం వహించి నిలబడ్డావు. నీ మాట నమ్ముతుంది, నమ్మితీరుతుంది. దానికోసం నీ ప్రాణం ఒడ్డావు. నేను చెప్పవలసిన దంతా చెప్పాను. అది మమ్మల్ని నాశనం చేయబోతోందని గ్రహించే ట్లుచేయి, నువ్వు నా కొడుకుని రక్షించావు. నా కూతురునికూడా రక్షించి పుణ్యంకట్టుకో. దేవుడునిన్ను మా దగ్గిరికి అందుకే పంపాడు. మోకరిల్లి ప్రార్థిస్తా ...."

ఇలా అంటూ ఫ్రా లెనోరీ సానిన్ పాదాలమీద పడదలచినదాని లాగా కుర్చీలో సగం లేచింది. .... అతను ఆమెను లేవకుండా ఆపి వేశాడు.

"ఫ్రా లెనోరీ! యేమిటిది?"

ఆమె అతని చేతులు ఉద్రేకంతో గట్టిగా పట్టుకొని "వాగ్దానం చేయి" అంది.

"ఆలోచించిచూడు. నేనెలా ...."

"వాగ్దానంచేయి. నీకాళ్ళముందుపడి నేనుచచ్చిపోవాలని నీకుందా?"

ఏంచేయాలో సానిన్‌కు తోచలేదు. ఇంతకు పూర్వం కార్య రంగములో ఎన్నడూ ఇటలీవారి ప్రకృతిని ఎదుర్కోలేదు.

"నీయిష్టంవచ్చినట్లు చేస్తాను. ఫ్రాలిన్ జెమ్మాతో ...."

ఫ్రా లెనోరీ సంతోషంతో అరిచింది.

"కాని ఫలితం యేమవుతుందో చెప్పలేను ...."

"ఓ-మాటతప్పవద్దు తప్పవద్దు" అని బతిమాలింది ఫ్రా లెనోరీ. "మాట యిచ్చావు. యేదో అద్భుతం జరిగితీరుతుంది. అయినా యింత కంటె నేను చేయగలిగిందేమీ లేదు. అది నా మాట వినదు."

"హెర్క్లాబరును చేసుకోనని ఖచ్చితంగా. చెప్పేసిందా?" అని అడిగాడు, సానిన్ ఒకనిమిషం తరువాత.

"ఆc- ఖచ్చితంగా చెప్పేసింది. తండ్రిపోలికే. తలబిరుసు మనిషి!"

"తలబిరుసుమనిషా? జెమ్మా!" అన్నాడు సానిన్ నెమ్మదిగా.

"కాని బహువుత్తమురాలుకూడా. నీ మాట విని తీరుతుంది. తొందరగా-తొందరగా రావాలి?" ఫ్రా లెనోరీ ఆవేశంతో కుర్చీలోనుంచి లేచి కూర్చున్న సానిన్ మెడను అంత ఆవేశంతోనూ చేతులతో చుట్టి వేసింది. "తల్లివంటిదాన్ని. ఆశీర్వదిస్తున్నా. కాసిని మంచినీళ్ళివ్వు"

సానిన్ గ్లాసుతో మంచినీళ్ళు తెచ్చియిచ్చాడు. వెంటనే వస్తానని మాట యిచ్చాడు. ఆమెతోకూడా మెట్లుదిగి వీధిలోకి పంపించివచ్చి విస్తుపోయి చూస్తూనిలబడ్డాడు.

"అంతా చకచకా నడిచిపోవడం ప్రారంభమైంది" అని తనలో తాను అనుకున్నాడు. "నా తల తిరిగిపోతోంది." హృదయంలోకి తొంగి చూడాలనిగాని, అక్కడ యేం జరుగుతోందో గ్రహిద్దామని గాని యత్నించలేదు. అంతా గందరగోళంగా ఉందనిమాత్రం తెలుసు కున్నాడు. "యేం రోజు! యేం రోజు!" అప్రయత్నంగా మాటలు ఆతనినోటివెంట వెలువడ్డాయి, "తలబిరుసుమనిషా? "స్వంత తల్లి చెప్పిందే .... ఆమెకు సలహా నేనుయివ్వాలా ?....సలహా యివ్వాలా! బలేసలహా!"

నిజం! సానిన్ తల తిరిగిపోతోంది. ఈ అనుభూతులను, భావ ముద్రలను, మొదరించని ఆలోచనలను దాటి జెమ్మా విగ్రహం—ఆనాటి తుపానురాత్రి నక్షత్రకాంతిలో చీకటి కిటికీలో నిలబడినపుడు అతని హృదయంలో పాతుకొనిపోయిన విగ్రహం- ఇపుడు తిరిగితేలియాడ జొచ్చింది.

తడబడుతూ సానిన్ మదాం రోసెల్లా ఇంటిని సమీపించాడు, అతని హృదయం టకటకా కొట్టుకొంటూంది, పక్కఎముకలకు వచ్చి

తగులుతున్నట్లు అనిపించింది, వినిపించింది. జెమ్మాతో ఏం చెప్పాలి? ఎలా మాట్లాడాలి? దుకాణంగుండా కాకుండా ప్రక్కగుమ్మంగుండా ఇంటిలో ప్రవేశించాడు. బయటిగదిలో ఫ్రా జెనోరీ కనిపించింది. అతను కంట పడగానే సంతోషం, భయం ఆమెను పెనవేసుకున్నాయి.

"యిందాకటినుంచీ నీకోసం నిరీక్షిస్తూ కూర్చున్నాను" అని చెవిలో చెప్పింది, అతనిచేయి తన చేతితో నొక్కుతూ. "తోటలోకి వెళ్ళు - అక్కడవుంది. జ్ఞాపకం పుంచుకో - భారమంతా నీమీదే వుంచుతున్నా."

సానిన్ తోటలోకి వెళ్ళాడు.

దోవపక్కనే ఒక బల్లమీద కూర్చుని జెమ్మా ఒక పెద్ద తట్టలోని రేగిపళ్ళల్లో బాగా పండినవి ఏరి పళ్ళెంలో పెడుతోంది. పొద్దు వాలింది. సుమారు ఏడు గంటలు అయింది. ఆతోటమీద వచ్చిపడే ఏటవాలు కిరణాలలో బంగారువన్నె తగ్గి కెంపువర్ణం హెచ్చింది. మధ్యమధ్య ఆకులు మెల్లగా వినిపించీ వినిపించకుండా గుసగుసలు బోతున్నాయి. సోమరి తేనెటీగలు ఝుంకారం చేస్తూ పువ్వు పువ్వుమీదా వాలుతున్నాయి, ఒక పావురం విసుగెత్తేటట్టు అదేపనిగా కూస్తోంది.

సోడెన్ వెళ్ళినపుడు పెట్టుకున్న పెద్ద హాటే ఇపుడూ జెమ్మా పెట్టుకుంది. వంగిన అంచు కిందనుంచి సానిన్‌ని తేరపారజూచి తిరిగీ తట్టమీదికి వంగింది.

అజ్ఞాతంగా ఒకదానికంటే ఒకటి కురచగా అడుగులు వేసుకుంటూ సానిన్ జెమ్మాని సమీపించాడు.... రేగిపళ్ళు ఏరుతున్నావెందుకని అడగాలని మాత్రమే అతనికి తోచి అడిగాడు.

జెమ్మా జవాబు చెప్పడానికి కొద్దిగా వ్యవధి తీసుకుంది.

"బాగా పండినవాటితో -" అని ఎలాగైతేనేం అనగలిగింది, "తాండ్ర చేస్తాం. యిక వీటితో బజ్జీలు చేస్తాం. పంచదార వేసిన బజ్జీలు యిక్కడ యెక్కువగా అమ్ముతాం, నీకు తెలుసుగా."

ఇలా చెపుతూ జెమ్మా ఇంకా ముందుకు వంగింది. ఆమె కుడి చేతివేళ్ళతో జంట రేగిగుత్తి పట్టుకుంది. తట్టకీ పళ్ళానికి మధ్య ఆ చేయి వేలాడింది.

"నీపక్కన కూచోనా ?"

"కూర్చోవచ్చు" అని జెమ్మా బల్లమీద కొంచెం జరిగింది. సానిన్ ఆమె పక్కన కూర్చున్నాడు 'యెలా ప్రారంభించడం?" అని తన్ను తాను ప్రశ్నించుకున్నాడు. కాని జెమ్మా అతనిని ఈ చిక్కునుంచి తప్పించింది.

"యివాళ ద్వందయుద్ధం చేసారటగా" అని కంగారుతో ఎర్ర పడిన అందమైన మొహం పూర్తిగా అతనివైపు తిప్పి ఆదుర్దాతో అడిగింది. ఆమె కళ్ళల్లో అమితకృతజ్ఞత ప్రకాశించింది "యెంత ప్రశాంతంగా వున్నారు! అపాయం సంగతే మీకు పట్టలేదనుకుంటా!"

"అబ్బే! నాకే అపాయమూ లేదు. అంతా నిరుపద్రవంగా, అమాయికంగా జరిగిపోయింది."

జెమ్మా తన కళ్ళముందు కుడినుంచి ఎడమకు ఒకవేలు ఆడించింది - అది ఇటలీవారికి స్వభావసిద్ధమైన ఇంకోచేష్ట...."ఉహుఁ- అలా అనకు. నన్ను మోసవుచ్చాలని చూసి లాభంలేదు. పాంటలియోన్ అంతా నాకు చెప్పేశాడు"

"నమ్మావన్నమాట. సేనాని విగ్రహంతో నన్ను పోల్చాడా ?"

"అతను వుపయోగించే వుపమానాలు అసంగతమైనవి కావచ్చు. కాని అతనివుద్దేశంలో నువ్వు యివాళ చేసిందానిలో అసంగతమేమీలేదు. యిదంతా నా మూలంగా....నా కోసం....యెన్నటికి మర్చేపోను."

"ఫ్రాలీన్ జెమ్మా! నేను...."

"యెన్నటికీ మర్చేబోను" అని తిరిగీ ఒత్తి చెప్పింది. మళ్ళీ అతనిమీద దృష్టి స్థిరంగా నిగిడ్చి మొహం తిప్పేసుకుంది.

ఆలా మొహం తిప్పేసుకునేసరికి ఆమె ముఖ పార్శ్వంలోని సున్నితమైన రేఖలు కనిపించాయి, అంత అందమైనది ఎన్నడూ చూడలేదనీ, ఆ సమయంలో అనుభవించిన అనుభూతి ఎన్నడూ అనుభవించలేదనీ తనకు తాను చెప్పుకున్నాడు. అతని హృదయం ఉద్రిక్తమైంది.

"నా వాగ్దానం !" అనే మాట అతని మనసులో మెరిసింది.

"ప్రాలీన్ జెమ్మా...." అంటూ సానిన్ ప్రారంభించాడు ఒక క్షణం తటపటాయించి.

"యేమిటి?"

ఆమె ఆతనివంక తిరగకుండానే బాగా పండిన రేగిపళ్ళ తొడిమలను మునివేళ్ళతో జాగ్రతగా పట్టుకొని ఎంతో శ్రద్ధతో ఆకులను పైకెత్తి ఏరి ఆ పళ్లెంలో పెడుతూన్నది.... 'యేమిటి?' అన్న మాటలో ఎంత ఆప్యాయత, ఎంత విస్వాసం ఇమిడివుంది!

"మీ అమ్మ నీతో....చెప్పలా ?"

"దేనిని గురించి?"

"నన్ను గురించి."

జెమ్మా హఠాత్తుగా తట్టలోనుంచి పైకితీసిన రేగిపళ్ళను మళ్ళీ తట్టలోనే పడవేసింది.

"మీతో మాట్లాడిందా?" అని అడిగింది.

"అవును"

"యేం చెప్పింది?"

"నువ్వు పూర్వపు వుద్దేశాలను హఠాత్తుగా.... మార్చుకోటానికి నిశ్చయించుకున్నావని చెప్పింది."

జెమ్మా మళ్ళీ తలవంచుకుంది. హాటు అంచులోపలికి ఆమె మాయమైనట్లు అనిపించింది. కనిపించిందల్లా పెద్దపువ్వుకాడలా సున్నితమైన, మృదువైన మెడమాత్రమే !

"యేం వుద్దేశాలు ?"

"నీ భావి జీవితపు యేర్పాట్లకు సంబంధించిన.... వుద్దేశాలు"

"అంటే— హెర్ క్లూబర్‌ను గురించేనా నువు మాట్లాడేది?"

"అవును"

" నేను హెర్ క్లాబర్‌ని పెళ్ళిచేసుకోవడానికి యిష్టపడడంలేదని మా అమ్మ చెప్పింది అంతేకదూ? "

" అవును "

జెమ్మా కదిలింది. తట్ట ఒరిగి కిందపడింది.... కొన్ని రేగిపళ్ళు వెళ్ళి దోవలో పడ్డాయి. ఒక నిమిషం. ఇంకోనిమిషం గడిచింది....

" నీతో యీ సంగతి యెందుకు చెప్పింది? " అన్న జెమ్మా కంఠస్వరం వినిపించింది.

సానిన్‌కి జెమ్మా మెడతక్క ఇంకేమీ కనిపించడంలేదు. ఆమె వక్షస్థలం మామూలుగా కంటె ఎక్కువ వేగంతో ఉబ్బి తగ్గుతోంది.

" నాతో యెందుకు చెప్పింది? కొద్దికాలంలోనే మనిద్దరం స్నేహితులమయాం కాబట్టి నీకు నాలో విశ్వాసం వుండి వుంటుందనీ, నేను సలహాయిస్తే తప్పకుండా వింటావనీ మీ అమ్మ తలచి వుంటుంది "

జెమ్మాచేతులు నెమ్మదిగా ఆమె ఒడిలో పడ్డాయి... దుస్తుల ముడతలను ఊడదీయ నారంభించాయి.

" యేం సలహా యివ్వదలచావు మాన్షియర్ డిమిట్రీ? " అని అడిగింది కొంచెంసేపు విరామంతర్వాత.

జెమ్మా చేతులు ఒడిలో వణికిపోవడం సానిన్ చూసాడు... ఈ వణుకును దాచిపుచ్చడానికే మడతను ఊడతీస్తోంది. ఆ వణికే తెల్లని వేళ్ళమీద నెమ్మదిగా చేయి వేసాడు.

" జెమ్మా! నా కేసి చూడవేం? "

హటాత్సంచలనంతో ఆమె హాటు వెనకకు తోసిపుచ్చి పూర్వం లాగానే నిండు విశ్వాసంతో, కృతజ్ఞతతో అతని మీద దృష్టిని కేంద్రీకరించింది. అతను మాట్లాడాలని నిరీక్షించింది... కాని ఆమె మొహం కనిపించేసరికి సానిన్ కలవరపడ్డాడు, ఆశ్చర్యపోయాడు. సాయం సూర్యుని వేడికిరణాలు ఆమె పడుచుమొహంమీదపడి ధగధగా మెరిసాయి. ఆ ముఖ కవళిక సూర్యకాంతికంటె ఎక్కువ ప్రకాశవంతంగా, ఎక్కువ విస్పష్టంగా ఉంది.

" నీసలహా తీసుకుంటాను. మాన్షియర్ డిమిట్రీ!" అంది కొద్దిగా చిరునవ్వు నవ్వుతూ, కొద్దిగా కనుబొమలు పైకెత్తుతూ. " కాని యేం సలహా యివ్వదలిచావు? " సలహా " అని తిరిగీ అన్నాడు సానిన్. " మొన్న హెర్ క్లూబర్ ధైర్యం ప్రకటించలేదనే సాకుతో అత నిని తిరస్కరించడం... మీ అమ్మ వుద్దేశంలో... "

" సాకుతో? " అని గొణిగింది జెమ్మా. వంగి తట్టతీసి తన పక్కనే బల్లమీద పెట్టింది.

" ... అలా తిరస్కరించడం... సామాన్యంగా... హేతుయుక్తంగా వుండదు. . అటువంటి నిర్ణయానికి వచ్చేముందు దాని ఫలితాలను గురించి బాగా ఆలోచించడం మంచిది; మీ కుటుంబ ప్రస్తుత పరిస్థితిలో మీలో ప్రతివారూ కుటుంబాన్ని నిలబెట్టడానికి కొన్ని పనులు చేసితీరాల్సి వుంటుంది .. "

" అదంతా అమ్మ వుద్దేశం " అంది జెమ్మా. " అవి సరిగా ఆమె మాటలే! అంతా నాకు తెలుసు. మరి నీ అభిప్రాయం మేమిటి? "

" నా అభిప్రాయమా? అని సానిన్ ఊరుకున్నాడు. గొంతులో ఏదో ముద్దలాంటిది లేచి ఊపిరి పీల్చనీయలేదు. " నేనుకూడా... " అన్నాడు ఎంతో కష్టంమీద.

జెమ్మా ఒళ్ళంతా బిగపట్టి, " నీవూనా? నీవూనా? " అంది.

" అవును... నేను... " సానిన్‌కి మరి ఒక్కమాటకూడా పెగల లేదు.

" మంచిది " అంది జెమ్మా. " స్నేహితుడివిగా నువ్వేగనక నా ప్రస్తుత నిర్ణయాన్ని మార్చుకోమని అంటే నా పూర్వ నిర్ణయాన్ని మార్చుకోవద్దని చెపితే, సరే, ఆలోచిస్తా. " ఆమె, ఏమిచేస్తోందో గమనించకుండా, పళ్ళెంలోనుంచి పళ్ళుతీసి తిరిగీ తట్టలో వేయసాగింది. " నువు చెప్పినట్లు నేను చేస్తానని అమ్మ అనుకుంటోంది... మంచిది, నిజంగా చేస్తానేమో... "

"కాని ఫ్రాలీన్ జెమ్మా! ముందు నిన్ను ప్రేరేపించిన కారణాలు తెలుసుకుంటే...."

"నువు చెప్పినట్టు చేస్తాను" అంది జెమ్మా. ఆమె కనుబొమలు కుంచించుకుపోయాయి. చెంపలు పాలిపోయాయి. కింద పెదవి కొరుకు కుని, "నీవు నాకు చేసిన మేలుకి నేను నువ్వు చెప్పినట్లు వినితీరాలి, నీ అభీష్టం నెరవేర్చాలి. తిరిగి ఆలోచిస్తానని అమ్మతో చెపుతా. ఆఁ- అదిగో అమ్మే యిలా వస్తోంది!" అంది,

ఫ్రా లెనోరీ ఇంట్లోనుంచి తోటలోకి వెళ్ళే గుమ్మంలో ప్రత్యక్ష మైంది. ఆదుర్దా ఎక్కువై కూర్చోలేకపోయింది. సానిన్ జెమ్మాతో పావుగంటనుంచే మాట్లాడుతున్నా ఈ పాటికి మాట్లాడడం పూర్తిఅయి ఉంటుందని భావించింది.

"ఉహుఁ-వద్దు, వద్దు యిపుడపుడే ఆమెతో యేమీ చెప్పద్దు, చెప్పద్దు" అని బతిమాలుకున్నాడు సానిన్, తొందర తొందరగా భయం చుట్టుముట్టినవాడిలా. "కొద్దికాలం ఆగు....నేను నీకు చెపుతాను, వ్రాస్తాను....అప్పటివరకు యే నిర్ణయానికీ రాకు....ఆగు!"

జెమ్మా చేయి నొక్కి, బల్లమీద దిగ్గున లేచి, హాటు ఎత్తి, విని పించీ వినిపించకుండా ఏదో గొణుగుకుంటూ ఆశ్చర్యపోయిన ఫ్రా లెనోరీ పక్కగా పరుగెత్తుకుని వెళ్ళి మాయమైపోయాడు,

ఫ్రా లెనోరీ కూతురు దగ్గరకు వెళ్ళింది,

"జెమ్మా! చెప్పు...."

జెమ్మా హఠాత్తుగా లేచి తల్లిని కౌగలించుకుంది. "అమ్మా! కొద్దికాలం ఆగకూడదూ? పోనీ, రేపటిదాకా ఆగు చాలు! రేపటివరకు యీ విషయం ఒక్కమాటైనా యెత్తకు...."

ఆకస్మికంగా ధగధగామెరిసే కన్నీటితో ఆమె తడిసిపోయింది. జెమ్మా మొహంలో విచారం లేకపోగా సంతోషం తాండవించడం అన్నిటికంటె ఎక్కువగా ఫ్రా లెనోరీని ఆశ్చర్యపర్చింది.

"యేమైందేం ? నువెపుడూ యేడవవు .... అలాంటిదానివి హఠాత్తుగా ...."

"మరేంలేదమ్మా. యేంలేదు! కాస్త ఆగు! మనిద్దరం ఆగి చూడాలి, రేపటివరకు నన్నేం అడగవద్దు-సూర్యాస్తమానం కాకముందే రేగిపళ్ళు యేరేద్దాం పట్టు."

"కాని నువు మంచీ చెడ్డా బాగా ఆలోచిస్తావుగదా ?

"బాగా ఆలోచిస్తాను" అని జెమ్మా తల పంకించింది భావగర్భితంగా. చిన్న చిన్న గుత్తులు ఏరి ఎఱ్ఱబారిన మొహం పైకి వాటిని ఎత్తి పట్టుకుంది. కన్నీరు తుడుచుకోలేదు. చెంపలమీద అలాగే ఆరిపోయాయి.

# 25

సానిన్ పరుగెత్తుకుంటూ హోటలుకు వెళ్ళాడు. ఆ హోటలులో ఒంటరిగా ఉన్నప్పుడే తనలో ఏం జరుగుతున్నదీ గ్రహించగలనని తలపోసాడు, నమ్మాడు. సరిగ్గా అలానే జరిగింది. గదిలోకి వెళ్ళి వ్రాతబల్ల ముందు కూర్చుని, దానిమీద మోచేతులు ఆనించి, అరచేతులతో మొహం ఒత్తుకుని విచారంగా, బొంగురుగొంతుతో "ఆమెను ప్రేమిస్తున్నాను, పిచ్చిగా ప్రేమిస్తున్నాను" అని బిగ్గరగా అనుకున్నాడు. నివురు ఊదేసిన అగ్నికణం లాగా అతని తనువు అంతటిలోనూ జ్వాల రేగింది. ఒక్క-క్షణం....ఆమె పక్కన కూర్చుని మాట్లాడుతూ ఆమె దుస్తుల అంచును కూడాపూజనీయమనీ, మామూలుగా యువకులు చెప్పేటట్లు"ఆమె పాదాల ముందు ఆత్మార్పణ" చేసుకోవడానికి సిద్ధంగా ఉన్నాననీ ఎందుకు అనిపించలేదో అతనికి అర్థంకాలేదు, తోటలో ఆఖరిసారి సమావేశం అంతా నిర్ణయం చేసింది. ఇపుడు ఆమెని గురించి ఆలోచిస్తూంటే,

నక్షత్రకాంతిలో చెల్లాచెదరైన జుట్టుతో ఆమె రూపం ప్రత్యక్షం కావడానికి బదులు, బల్లమీద కూర్చుని హఠాత్తుగా హాటు వెనకకు తోసి వేసుకుని నిశ్వాసంతో చూసిన రూపం అతని కళ్ళకు కట్టింది...ప్రేమా వేశం, ప్రేమపిపాస అతని రక్త నాళాలలో పరుగెత్తాయి. రెండు రోజులనుంచీ జేబులో పెట్టుకుని తిరుగుతున్న గులాబిపువ్వు జ్ఞాపకం వచ్చింది. బయటికి తీసి పెదవులకు పిచ్చిబలంతో హత్తుకునేసరికి నొప్పి పుట్టి మొహం ముడుచుకున్నాడు. ఇక తర్కించుకోలేదు, భవితవ్యాన్ని గురించి ఆలోచించడం లేదు, గుణించడంలేదు. గతంనుంచి పూర్తిగా వేరుపడిపోయాడు. ముందడుగు వేసాడు. ఒంటరి బ్రహ్మచారి జీవితపు నిర్జనతీరానికి అతనిని బంధించే తాళ్ళను ఛేదించి, ఉల్లాసంగా మహా వేగంతో పొంగిపోయే ప్రవాహంలోకి దూకాడు. ఆ ప్రవాహం ఎక్కడికి తీసుకుపోతుందోనని ఆలోచించనేలేదు. తను పయనించే ఓటి పడవ ఏ రాతి గుట్టకైనా తగిలి పగిలిపోతుందేమోనని అనుమానించలేదు. ఇటీవలి ఉల్లాద్ వీరగాధ అతనికి ఉపశాంతి కలిగించేది. అందులోని ప్రశాంత మైన ప్రవాహం... అందులోని బలీయమైన కెరటాలు, అపశక్యంగాని కెరటాలు. అవి ముందుకు ఉరుకుతున్నాయి, వాటితో అతనూనూ.

కాగితం తీసుకుని పెట్టిన కలం ఎత్తకుండా, ఒక్క కొట్టివేతైనా లేకుండా ఈ కింది పంక్తులు వ్రాసాడు:

ప్రియమైన జెమ్మా,

"నేను నీకు యిస్తానన్న సలహా యేమిటో నీకు తెలుసు. మీ అమ్మ కోరిక యేమిటో, నన్నేమి చేయమన్నదో నీకు తెలుసు-కాని నీకు తెలియందీ, యిపుడు నీకు చెప్పక తప్పనిదీ ఒకటుంది. నేను నిన్ను ప్రేమిస్తున్నాను, యింతకు పూర్వం యెప్పుడూ ప్రేమించని హృదయా వేశంతో ప్రేమిస్తున్నాను. హఠాత్తుగా యీ జ్వాల నాలో ప్రజ్వరిల్లింది. మాటలతో వర్ణించడానికి వీలులేనంత బలీయంగా ప్రజ్వరిల్లింది, మీ అమ్మ నా దగ్గిరికి వచ్చి నా సాయం కోరినపుడు యీ జ్వాల నాలో రాజుతూ మాత్రమేవుంది. లేకుంటే నాకు అప్పగించిన కర్తవ్యాన్ని

నెరవేర్చడానికిఅంగీకరించేవాడిని కాను...యిదంతాఒప్పుకుంటున్నానంటే నిజాయితీపరుడినిగా ఒప్పుకుంటున్నాను. నువు యెలాంటివాడితోవ్యవహరించాలో తెలుసుకుని వుండడం మంచిది - అపార్థాలకు తావుండకూడదు. నేను నీకు సలహాయిచ్చే స్థితిలో లేను. .నిన్ను ప్రేమిస్తున్నాను, ప్రేమిస్తున్నాను, ప్రేమిస్తున్నాను-నా మనసులో, నా హృదయంలో వేరే ఆలోచనలేదు.

డి. సానిన్."

ఈ చీటీ మడిచి అతికించి నౌకరుచేతికిచ్చి పంపిద్దామని మొదట ఆలోచించాడు. "ఊహుఁ పనికిరాదు.. ఎమిలీకి యిచ్చి తీసుకువెళ్ళమంటే? కాని దుకాణానికి వెళ్ళి, అక్కడ వారందరిలో వెతకడం సంభావ్యంగా వుండదు.. అంతేగాదు, సాయంకాలమైంది. దుకాణాన్నుంచి బయలుదేరి వుంటాడు." ఈ విధంగా ఆలోచిస్తూ సానిన్ హాటు పెట్టుకుని బయటికి వెళ్ళాడు. ఒకమూలకు తిరిగాడు, ఇంకొకటి. ఇంతలో ఎమిలీ కనిపించాడు అతని సంతోషం వర్ణించ శక్యంగాదు. చంకలో తోలుసంచి పెట్టుకుని, చేతితో కాగితంపొట్లం పట్టుకుని ఆ యువకుడు ఉత్సాహంతో గబగబా ఇంటికి వెళ్ళుతున్నాడు.

"ప్రతి ప్రేమికుడి జాతకంలోనూ అదృష్టం తెచ్చిపెట్టే గ్రహం వుంటుందంటారు నిజమేకాబోలు" అనుకుని సానిన్ ఎమిలీని పిలిచాడు.

ఆ పిల్లవాడు వెనుతిరిగి చూసి అతని దగ్గరకు పరుగెత్తుకుంటూ వచ్చాడు. సానిన్ ఆ పిల్లవాని ఉద్వేగ ప్రదర్శనానికి తావివ్వలేదు. ఆ చీటీ అందిచ్చి ఎవరికి ఏవిధంగా ఇవ్వవలసిందీ వివరించి చెప్పాడు... ఎమిలీ శ్రద్ధగా విన్నాడు.

"యెవరికంటా పడకూడదు" అన్నాడు సానిన్.

"యిదంతా మన యిద్దరికీ తెలుసు" అని చెపుతున్నట్లు అతని మొహంలో ప్రధానమైన, నిగూఢమైన కవళిక ఏర్పడింది.

" అవును మిత్రమా! ' అన్నాడు సానిన్.

కొంచెం కలవర పడ్డాడు. కాని ఎమిలీ చెంపమీద మెల్లగా తట్టాడు. " జవాబు యిస్తే. . నాకు తెచ్చి యియ్యి. తెచ్చి యిస్తావు గదూ? యెక్కడికీ వెళ్ళకుండా హోటలులోనే వుండిపోతాను "

" మీరేం బెంగెట్టుకోకండి " అని ఉల్లాసంగా ఎమిలీ మెల్లగా చెప్పి పరుగెత్తాడు. పరుగెత్తుతూ వెనకకు మొహంతిప్పి చూసి తల పంకించాడు."

సానిన్ తిరిగి గదికివెళ్ళి కొవ్వొత్తి దీపాలు వెలిగించకుండానే పక్కమీద వాలాడు. తలకింద చేతులు పెట్టుకుని. వర్ణింపశక్యంగాని నూత్నప్రేమానుభూతికి లొంగిపోయాడు. ఆ అనుభూతి పొందినవాడికే అందులోని మత్తమాధుర్యం అవగతమవుతుంది. ఆ అనుభూతి పొందని వానికి వివరించి చెప్పినా లాభం లేదు.

తలుపు తెరుచుకుంది. ఎమిలీ తల కనిపించింది,

"తీసుకువచ్చా" అన్నాడు ఎమిలీ మెలమెల్లగా.'యిదిగో జవాబు '

ఇలా అంటూ మడతపెట్టిన చీటీ పైకిఎత్తి చూపించాడు.

సానిన్ సోఫాలోనుంచి దిగ్గున లేచి ఎమిలీ చేతిలోనుంచి ఆ చీటీ గుంజేసుకున్నాడు. ఉద్రేకం నెత్తికి ఎక్కింది. దాపరికమనే ఆలోచన పోయింది. ఆమె సోదరుని ముందు కాస్త మర్యాదగా ప్రవర్తించాలనే ఇంగితజ్ఞానమేలేదు. సాధ్యమైనట్లయితే, అతనిముందు నటించేవాడే, మనసును అదుపులో పెట్టుకునేవాడే,

కిటికీదగ్గరకువెళ్ళి హోటలుముందువున్న వీధిదీపపు వెలుగులో ఈ కింది పంక్తులు చదువుకున్నాడు:

"నిను వేడుకుంటున్నా, ప్రార్థిస్తున్నా—రేపుపగలు మా యింటికి రావద్దు. మా వెంట పడవద్దు. యిది నాకు చాలా అవసరం, చాలా అవసరం! ఆ తర్వాత అంతా నిర్ణయమైపోతుంది. నా మాట తీసివేయ వనే నమ్ముతున్నాను. యెందుకంటే...."జెమ్మా"

సానిన్ ఆ చీటీ రెండుసారులు చదివాడు. ఎంత మధురంగా, ఎంత అందంగావుంది ఆ దస్తూరి! ఒకక్షణం ఆలోచించి ఎమిలీ నాకేసి తిరిగాడు, బిగ్గరగా పేరుపెట్టి అతనిని పిలుస్తూ. ఎమిలీ తాను వివేకం గలవాడనని చూపించడానికని గోడవైపు తిరిగి దానిని గోళ్ళతో గిల్లు తున్నవాడల్లా వెంటనే సానిన్‌దగ్గరకు పరుగెత్తుకుంటూ వెళ్లాడు.

" ఏం చేసిపెట్టాలి? "

" విను తమరు- "

" మాన్షియర్ డిమిట్రీ! " అంటూ ఎమిలీ విచారంతో అడ్డువచ్చి నన్ను నువు అని యెందుకు అనకూడదు? " అన్నాడు.

సానిన్ నవ్వి, " సరే ఆలాగే " అన్నాడు. (ఎమిలీ సంతోషంతో ఎగిరి గంతాడు) "విను, మిత్రమా! ఆమెతో- యెవరితోనో నీకు తెలుసుగా- ఆమె చెప్పినట్టుగానే జరుగుతుందని చెప్పు. (ఎమిలీ పెదవులు నొక్కుకుని గంభీరంగా తల ఆడించాడు) ".... యికనువు .... రేపు యేం చేస్తావు? "

" నేనా? యేం చేయమంటారు? "

" సాధ్యమైతే రేపు వుదయాన్నే నా దగ్గిరికిరా. ఫ్రాంక్‌ఫోర్ట్ చుట్టూ పొలాలలో షికారుచేద్దాం. నీ కిష్టమేనా? "

ఎమిలీ తిరిగీ సంతోషంతో ఎగిరి గంతువేసాడు. " ఓ- అంత కంటె కావలిసిందేమిటి ? మీతో షికారుకువెళ్లడం - అద్భుతంగా వుంటుంది ? ఓ- తప్పకుండా వస్తాను. "

" నిన్ను యింటిదగ్గరనుంచి కదలనీయకపోతేనో? "

"వెళ్ళనిస్తారు"

" విను.... చెప్పకు.... యెవరితోనో నీకు తెలుసుగా.... నేను నిన్ను పిల్చానని చెప్పకు"

"యెందుకు చెప్పడం? వచ్చేస్తాను. అంతే. పోయిందేముంది?"

ఎమిలీ హృదయపూర్వకంగా సానిన్‌ని ముద్దిడుకుని పరుగుచ్చుకుని వెళ్ళిపోయాడు.

సానిన్ చాలసేపు గదిలో పచార్లుచేసి పొద్దుపోయి పండుకున్నాడు. ముందున్న నూత్నజీవితాన్ని తలంచుకుని నిశిత మధుర అనుభూతులకు సగం సంతోషంతో సగం భయంతో కూడిన వేదనకు తిరిగీ లొంగిపోయాడు. ఆ మరునాడు తనతో గడపడానికి రమ్మని ఎమిలీని ఆహ్వానించినందుకు అపరిమితంగా సంతోషించాడు అతను అచ్చంగా జెమ్మాలాగానే ఉంటాడు.

"యితనిని చూస్తుంటే ఆమె జ్ఞాపకం వస్తూంటుంది" అని సానిన్ తనకు తాను చెప్పుకున్నాడు.

అన్నిటినీ తోసిరాజని ఒక సమస్య అతని మనసును ఆక్రమించింది. "నిన్నటికీ యివాళటికీ తనలో యింత భేదం యెలా వచ్చింది?" సరిగా యివాళ ప్రేమిస్తున్నట్టే జెమ్మాను ఎప్పుడూ తాను ప్రేమిస్తున్నట్లు అతనికి అనిపించింది.

# 26

ఆ మర్నాడు ఉదయం ఎనిమిదిగంటలకు కుక్కమెడలోని తోలు పటకా పట్టుకొని ఎమిలీ సానిన్ గదిగుమ్మంలో ప్రత్యక్షమ య్యాడు. అతని తలిదండ్రులు జన్మస్లు అయి ఉన్నట్లయితే ఇంతకన్న ఎక్కువకాలం ఘాటించేవాడని అనలేం. ఇంటిదగ్గర బొంకి వచ్చాడు. ఫలహారాలముందు సానిన్‌తో షికారుచేసి ఆతరవాత సరాసరి దుకాణా నికి వెళతానని బొంకాడు. సానిన్ దుస్తులు వేసుకుంటూంటే ఎమిలీ జంకుతూ జంకుతూ జెమ్మానిగురించి, హెర్‌క్లూబర్‌తో ఆమె పోట్లా డడంగురించి చెప్పాడు, కాని సానిన్ ఒక్కమాటయినా మాట్లాడలేదు. ఈ ప్రధాన విషయం ఏమాత్రం ఎందుకు ప్రస్తావించకూడదో గ్రహిం చినవాడిలాగా కనిపించాలని యత్నిస్తూ. ఏమిలీ ఆ విషయం ప్రస్తావించడం తనకుతానే మానుకున్నాడు. మధ్యమధ్యమాత్రం ఎందులోనో నిమగ్న మైనవాడిలాగా తీవ్రమైన కవళిక పెట్టాడు.

కాఫీతాగి ఆ మిత్రులిద్దరూ కాలినడకను ఫ్రాంక్‌ఫోర్ట్‌కి దగ్గరలో ఉన్న హోజెన్ అనే కుగ్రామానికి బయలుదేరారు. ఆ గ్రామం చుట్టూ అడవే. అక్కడనుంచి చూస్తే టానస్ పర్వతపంక్తియావత్తూ కనిపిస్తుంది.

ఆ రోజు దివ్యంగా ఉంది. ఎండ మండిపోవడం లేదు. వెచ్చగా మాత్రమే ఉంది. మలయమారుతం హుషారుగా ఆకులలో గలగల మంది. ఎక్కడో ఆకాశంలో అలలు అలలుగా ఉన్న మేఘాలు చిన్న చిన్న నీడలను ప్రసరించాయి. ఆ నీడలు భూమిమీద గబగబా మృదువుగా జారిపోసాగాయి. ఆ యువకు లిద్దరూ పట్నం వదలి ఉల్లాసంగా తొందర తొందరగా సాఫీగా ఉన్న రోడ్డుమీద నడవసాగారు. ఒక అడవిలోకి

వెళ్ళి కొంతసేపు గడిపారు. తరవాత పల్లెటూరి హోటలులో దిట్టంగా తిన్నారు. ఆ తరవాత ఒక కొండ ఎక్కి ఆ దృశ్యం చూసి మెచ్చుకున్నారు. సులోచీమీదుగా రాళ్ళు జారవిడిచి తమ కుందేటి చేష్టలకు సంతోషంతో చప్పట్లు చరిచారు. కాని కిందనుంచి ఎవరో బాటసారి గట్టిగా నాలుగు తిట్టేసరికి ఊరుకున్నారు. ఆ పిమ్మట ఎండు నాచుమీద పడుకున్నారు. ఆ నాచు ఎక్కువ ఎత్తు పెరగలేదు. ఊదాపసుపు రంగుగా ఉంది. లేచి ఇంకో హోటలుకెళ్ళి బీరు తాగారు. తరవాత పరుగుపందెం వేసుకున్నారు. దూరం దూకడంలో పోటీపడ్డారు. ప్రతిధ్వని విని పించింది. పాడుతూ, లేవిడీకొడుతూ దానితో సంభాషించారు. కుస్తీ పట్టారు. రెమ్మలు విరిచారు. అడవి మొక్కలతో హాట్లు అలంకరించుకున్నారు. నృత్యం చేసారు. టార్టాగ్లియా కూడా ఓపిక ఉన్నంతవరకు వీటన్నిటిలో పాల్గొంది. రాళ్ళు విసరలేదు, నిజమే. కాని వాటి వెనకనే దొర్లుకుంటూ పోయింది. ఆ యువకులు పాడుతూంటే మూలిగింది. చీదరించుకుంటూనే బీరు తాగింది. ఒకపుడు అది ఒక విద్యార్థి దగ్గిర ఉండేది. అపుడు అతను దానికి బీరు తాగడం నేర్పాడు. పాంటలియోన్ ఎడ చూపినంత అణకువ అది ఎమిలీఎడ చూపలేదు. పాంటలియోన్ దాని యజమాని. ఎమిలీ మాట్లాడమన్నా, తుమ్మమన్నా నాలుక చివరలు మడత పడేటట్టు చాచి తోక ఆడించేది.

వారిద్దరికీ బాతాఖానీకి కావలసినంతవిషయందొరికింది. షికారుకుబయలు దేరినపుడే సానిన్, పెద్దవాడు,ఎక్కువ వివేకవంతుడు కాబట్టి.ముందుగా విధి, మానవుని వృత్తి ప్రాముఖ్యత, స్వభావం, నిర్మాణంగురించి ప్రస్తావించాడు. కాని సంభాషణ త్వరలోనే తేలిక విషయాలమీదికి మళ్ళింది. ఎమిలీ రష్యాను గురించి, అక్కడ ద్వంద్వయుద్ధాలుజరిగే విధం గురించీ, అక్కడస్త్రీల అందంగురించీ, రష్యన్ భాష నేర్చుకోవడానికి పట్టే కాలం గురించీ, ఆ అధికారి గురిపెట్టినపుడు సానిన్‌ని అలముకున్న భావాలను గురించీ అడిగాడు. సానిన్ ఎమిలీని అతని తండ్రిని గురించీ, తల్లిని గురించీ, కుటుంబ వ్యవహారాలను గురించీ ప్రశ్నించాడు. జెమ్మా పేరు ఎత్తకుండా ఉండాలని యత్నించాడు. కాని ఎంతసేపూ ఆమెను గురించే

ఆలోచించసాగాడు. నిజం చెప్పాలంటే, ఆమెను గురించి కాదు ఆలో చించింది, ఆ మరునాడు అపూర్వమైన, అద్భుతమైన సౌఖ్యం ఒనగూడ నున్నది. అటువంటి నిగూఢమైన మరునాటిని గురించి ఆలోచించ సాగాడు. అతని మనోనేత్ర పటలంమీద అతి సున్నితమైన, అతి తేలి కైన మేలిముసుగు రెపరెపలాడుతోంది. ఆ ముసుగు వెనక - పెదవుల మీద మృదుమందహాసంతో, కపటకోపంతో వంచిన కనురెప్పలతో, నిశ్చలంగా దేవకన్య ముఖంలాంటి ముఖం గోచరిస్తున్నట్టు అతనికి తోచింది. ఆ ముఖం జెమ్మా ముఖంకాదు. ఆనందదేవత ముఖం. చివరికి అతని అదృష్టం పండింది. మేలిముసుగు తొలగింది. పెదవులు తెరుచుకున్నాయి. కనురెప్పలు పైకిలేచాయి. ఆనందదేవత అతనిని చూసింది, ఇంకేముంది? సూర్యతేజంలాంటి తేజస్సు! అపరిమితా నందం! పారవశ్యం! ఆ ఘడియను గురించి, ఆ మరునాటిని గురించి ఆలోచించగానే అతని హృదయం ఆనందంతో, నిమిష నిమిషానికీ ఇనుమడించే ఆశాజనిత రోమాంచలంతో ఆగిపోతుందేమో ననిపించింది.

ఈ ఆశాభావం, ఈ వాంఛ దేనికీ ఆటంకం కాలేదు. ప్రతి కద లికనూ అవి అనుసరించాయేగాని అతని మార్గానికి అవరోధం కాలేదు. ఇంకొక భోజనశాలలో ఎమిలీ తో కలిసి దివ్యంగా భుజించడానికి అడ్డు రాలేదు కాని మధ్య మధ్య 'అందరికీ తెలిస్తేనా?' అనే భావం మాత్రం అతని మనసులో తళుక్కుమని మెరిసేది. భోజనానంతరం ఎమిలీతో కలిసి కప్పగంతులు ఆడకుండా అతని వాంఛలు అడ్డుకోలేదు. విశాలమైన పచ్చిక మైదానంలో ఈ ఆట ఆడుతున్నారు .... లాఘవంగా పంగజాపి, వంగిన ఎమిలీ మీదుగా పక్షిలాగా ఎగురుతూండగా, టార్టాగ్లియా బొంగురుగా అరుస్తూండగా, మైదానం చివర సానిన్‌కి ఇద్దరు అధికారులు కానవచ్చారు. అందులో ఒకడు నిన్నటిరోజున ద్వంద్వయుద్ధం చేసిన హెర్ వాన్ డాన్‌హాఫ్. రెండవ వారు అతనికి సాయపడిన హెర్ వాన్ రిచ్చర్. వీరిని గుర్తుపట్టేసరికి సానిన్ ఆశ్చర్య పోయాడు. కంగారుపడి పోయాడు. ఆ ఇద్దరూ ఒక కంటికి అద్దం పెట్టుకుని ఇకిలిస్తూ చూస్తున్నారు....సానిన్ పాదాలమీద నిలబడి, వెను

దిరిగి, విడిచిన కోటును ధరించి, ఒకమాటలో ఎమిలీని ఆదేశించాడు. ఎమిలీకూడా కోటు తొడుగుకున్నాడు. ఇద్దరూ గబగబా చక్కా బోయారు.

బాగా పొద్దెక్కి ఫ్రాంక్‌ఫోర్ట్ వారు చేరుకున్నారు....

"నన్ను తిట్టిపోస్తారు" అన్నాడు ఎమిలీ సానిన్ దగ్గర శెలవు పుచ్చుకుంటూ. "తిట్టిపోస్తే పోసారుగాని యివాళ దివ్యంగా, దివ్యంగా గడిపాం."

హోటలుకు వెళ్లేసరికి జెమ్మా దగ్గరనుంచి చీటీ వచ్చి పడిఉంది. ఫ్రాంక్‌ఫోర్ట్ చుట్టూ ఉన్న ఉద్యానవనాలలో ఒక దానిలో ఆ మరునాడు ఉదయం ఏడుగంటలకు కలుసుకోవలసిందిగా కోరుతూ జెమ్మా చీటీ వ్రాసింది.

అతని హృదయం నృత్యం చేసింది! కిక్కురుమనకుండా ఆమె చెప్పినట్లు విన్నందుకు ఎంతో సంతోషించాడు. అద్భుతమైన, అపూర్వమైన, అసంభవమైన, అనివార్యమైన ఆ మరునాడు అతనికి ఏమి ఒనగూర్చ నున్నదో! ఏమి ఒనగూర్చదూ!

జెమ్మా వ్రాసిన చీటీని పరీక్షగా చూసాడు. చీటీ అడుగున ఆమె సంతకంలో ముత్యంవంటి 'జె' చూపేసరికి అతనికి సుందరాతి సుందరమైన ఆమె చేతివేళ్ళు జ్ఞాపకం వచ్చాయి....ఆ చేతిని పెదవులతో తాక లేదనీ జ్ఞాకం వచ్చింది.... "ఇటలీస్త్రీలు" అని ఆలోచించసాగాడు. "వారిని గురించి నలుగురూ చెప్పేదానికి భిన్నంగా చాలాలజ్జావతులు. ఖండితమైన వారు....అందులోనూ ముఖ్యంగా జెమ్మా-ఆమె మహారాణి. దేవత....చలువరాయిలాగా స్వచ్ఛమైంది, విశుద్ధమైంది...."

" వస్తుంది వస్తుంది
వస్తుందికాలం
అచిరకాలంలోనె
రానున్న కాలం "

ఆరాత్రి ఫ్రాంక్‌ఫోర్ట్‌లోకల్లా ఒకే ఒక అదృష్టవంతు డున్నాడు. నిద్రపోయాడు. కాని ఒక కవి చెప్పినట్లు

" నేను నిద్రించినా మది నిద్రబోదు
మెలకువగన్న నాహృది నిద్రపోదు "

అని తనకు అన్వయించుకోవలసింది.

అతని హృదయం వేసవి సూర్యుని కిరణాలలో పూవుమీద వాలిన తేనెటీగ రెక్కలాగా అల్లలలాడింది.

# 27

సానిన్ అయిదు గంటలకల్లా లేచి, ఆరుగంటలయేసరికి దుస్తులు ధరించాడు. ఆరున్నరకల్లా, జెమ్మా చీటీలో సూచించిన చిన్న వేసవి గృహంముందు ఉద్యానవనంలో పచార్లు చేస్తున్నాడు.

ఉదయం నిశ్శబ్దంగా, వెచ్చగా, బూడిద రంగుగా ఉంది. మధ్య మధ్య వాన కురిసే సూచనలు కానవచ్చాయి. అరచేయి జాపితే ఎక్కడా తడికావడంలేదు. పరీక్షగా చూస్తే కోటుచేతులమీద చిన్నచిన్న పూసల వంటి నీటి బిందు చాయలు పొడకట్టాయి. త్వరలోనే ఇవీ ఆగిపో యాయి. గాలి స్తంభించిపోయింది. శబ్దం ప్రయాణించడంలేదు. గాలిలో వేలాడుతున్నట్లుంది. దూరాన తెల్లటి పొగమంచు కనిపించింది. మిగ్నో నెటీపూల వాసనతో, తెల్లకసిందపూల వాసనతో గాలి గుబాళించింది.

దుకాణాలింకా తెరవలేదు. కాని రోడ్డుపక్క బాటలమీద బాటసా రులు కనవస్తున్నారు, మధ్యమధ్య ఒంటరి ఒంటరిగా పోయే బగ్గీల చక్ర ధ్వనులు వినిపిస్తున్నాయి. .... ఉద్యానవనంలో ఎవరూ తిరగడంలేదు.

ఒక తోటమాలి తాపీగా పారతో దోవ చెక్కుతున్నాడు. నల్లటిదుస్తులు ధరించి ఒక ముసిలిఅవ్వ కుంటుకుంటూ వెళుతోంది. ఆముసిలి అవ్వను జూచి జెమ్మా అని సానిన్ రెప్పపాటు కాలమైనా భ్రమపడి ఉండడు. అయినా ఆమె అదృశ్యమయేవరకూ ఆమెను నేత్రాలతో అనుసరించాడు.

ఏడు, చర్చి గోపురంమీది గడియారం టాంగ్ టాంగ్ మంది.

సానిన్ ఆగాడు. ఆమె రానేకాదా? వణికిపోయాడు! ఒక క్షణం తరువాత మళ్ళీ అలానే వణికిపోయాడు. కాని ఈ తడవ కారణంవేరు. వెనక తేలికగా అడుగులచప్పుడు, దుస్తుల గరగర వినిపించాయి .... వెనుదిరిగి చూసాడు- ఆమెయే!

జెమ్మా బాటవెంటే అతనిని అనుసరించింది. ధూసరవర్ణం దుస్తులు ధరించింది. నల్లటి చిన్నహాటు పెట్టుకుంది. అతనివంక తేరి పారజూచి, మొహం పక్కకు తిప్పుకుంది అతని సరసకు రాగానే గబగబా అడుగులు వేసుకుంటూ దాటిపోయింది.

" జెమ్మా ! " అని వినిపించీ వినిపించకుండా పిలిచాడు.

కొద్దిగా తల పంకించి ఆమె ఆగకుండా నడక సాగించింది. అతను ఆమెను అనుసరించాడు. ఊపిరితీయడం కష్టమనిపించింది. కష్టంమీదగాని కాళ్లు అతని మాట వినడంలేదు.

జెమ్మా వేపవిగ్రహందాటి, కుడవేపుకు తిరిగి అట్టే లోతులేని చిన్న చెలమ దాటింది. ఆ చెలమలో ఒంటరిగా ఒక పిచ్చుక అదేపనిగా నీళ్ళు చిందగొడుతోంది. జెమ్మా పొడుగాటి లిలాక్‌పొదలచాటుకు వెళ్ళి ఒక బెంచిమీద చదికిలబడింది. ఆ మారుమూల చూడముచ్చటగా ఉంది.

ఒక నిమిషం గడిచింది. ఒకరూ మాట్లాడలేదు. ఆమె అతనికేసి చూడనైనా చూడలేదు. కాని అతనుమాత్రం ఆమె మొహంలోకి చూడకుండా, చిన్న గొడుగుమీద ముడుచుకుని ఉన్న చేతులకేసి చూసాడు. చెప్పేదేముంది ? అంత పెందరాళే, అంత దగ్గరగా, ఒంటరిగా, ఇద్దరూ

కలిసి కూర్చున్నారనే యదార్థం కంటే మాటలలో ఏమి ప్రాముఖ్యం ఉంది?

"నీకు....నామీద కోపం వచ్చిందా?" అని ఎలాగైతేనేం సానిన్ అనగలిగాడు.

అంతకంటె తెలివితక్కువ మాటే ముంటుంది? ఆ సంగతి అతనికీ తెలుసు....కాని మూగనోము వదిలిపోయింది.

"నీమీద కోపమా?" అంది జెమ్మా. "యెందుకు? ఉహూఁ"

"నామీద నమ్మకం వుందా?"

"వుత్తరంలో వ్రాసిన విషయంలోనేనా?"

"ఆఁ - అవును"

జెమ్మా తలవంచుకుంది. మాట్లాడలేదు. గొడుగు ఆమె చేతులలో నుంచిజారిపోయింది. నేలమీద పడకుండా టంచనగా పట్టేసింది.

"ఓ - జెమ్మా! నీకు నేను వ్రాసిందినమ్మా!" అన్నాడు సానిన్. హఠాత్తుగా బిడియమంతా మాయమైంది ఆవేశంతో మాట్లాడసాగాడు.

"యీ ప్రపంచంలో సత్యమంటూ ఒకటుంటే, పవిత్రమైన, నిరాక్షేపణీయమైన సత్యమంటూ ఒకటుంటే, నిన్ను నేను ప్రేమిస్తున్నానేదే, మనసారా ప్రేమిస్తున్నాననేదే ఆ సత్యం!"

ఆమె అతనికేసి ఒక్కక్షణం ' ఓరచూపు చూసింది. మళ్ళీ గొడుగును జారవిడిచింది.

"నమ్మ, నన్ను నమ్మ! అని ప్రార్థించాడు చేతులు ఆమెవైపు జాపుతూ, కాని స్పృశించడానికి ధైర్యం లేకపోయింది." నీకెలా నచ్చ చెప్పను?"

ఆమె అతనివంక తిరిగీ తేరిపార జూచింది.

"మాన్సియర్ డిమిట్రీ చెప్పంది" అంది జెమ్మా.

"మొన్న నాకు బోధించడానికి వచ్చినప్పుడు....నాకే తెలియదు.... భావం కలగలేదు...."

"అభావం కలిగింది" అన్నాడు సానిన్ ఆదుర్దాగా." కాని తెలుసుకో లేకపోయాను. మొదటిసారిగా నువు నా కంటపడినప్పుడే నీమీద ప్రేమ అంకురించింది. కాని నిన్ను ప్రేమిస్తున్నానని వెంటనే గుర్తించలేక పోయినాను. పైగా ప్రధానం జరిగిందనికూడా విన్నాను....యిక మీ అమ్మ నీకు నచ్చచెప్పమని నన్ను కోరింది. యెలా తిరస్కరించేది? అంతేకాదు, మీ అమ్మ కోరికను నిర్వర్తించిన పద్ధతివల్ల నువు వూహించే...."

భారీగా అడుగుల చప్పుడయింది. నారసంచి బుజానవేసికుని, లావు పాటిమనిషి ఒకడు, బహుశా విదేశీయుడై ఉంటాడు, లిలాక్ పొదలవెనక నుంచివచ్చి, ప్రయాణీకులకు సహజమైన పొగరబోతుతనంతో బెంచీ మీద కూర్చున్న జంటవంక తెరిపారజూచి, బిగ్గరగా దగ్గి చక్కా బోయాడు.

"మీఅమ్మ" అన్నాడు సానిన్, భారీ అడుగుల చప్పుడు సమసి పోగానే. "నువు అతనిని తిరస్కరిస్తే అప్రతిష్ట వచ్చిపడుతుందని చెప్పింది" (జెమ్మా కనిపించీ కనిపించకుండా మొహం ముడుచుకుంది) "నా చర్యవల్ల చెడుపుకార్లు బయలుదేరాయి కాబట్టి నీవరుడు, హెర్ క్లూబర్‌ను తిరస్కరించవద్దని చెప్పవలసిన బాధ్యత నామీద వుందనీ చెప్పింది"

"మాన్షియర్ డిమిత్రీ!" అంది జెమ్మా సానిన్ వైపున జుట్టుమీద చేతులతో రాసుకుంటూ, "హెర్ క్లూబర్ నా వరుడని యిక అనడం మానేయి, నే నతనిని యెన్నటికీ పెళ్ళాడను. తిరస్కరించాను."

"తిరస్కరించావా? యెప్పుడు?"

- "నిన్న"

"అతని మొహంమీదనే?"

"ఆఁ అతని మొహంమీదనే, మా యింట్లో, మమ్మల్ని చూడ డానికివచ్చాడు.

"జెమ్మా! అంటే నన్ను ప్రేమిస్తున్నావన్నమాటేనా?"

ఆమె అతనికేసి తిరిగి

"నిన్ను ప్రేమించకపోతే యిక్కడికి వచ్చేదాననా?" అని చెవిలో చెప్పింది, బెంచిమీదికి చేతులు జారవిడుస్తూ.

బల్లమీద అరచేతులు పైకి పెట్టుకుని ఉన్న ఆచేతులను పట్టుకుని సానిన్ కళ్ళమీద, పెదవులమీద పెట్టుకున్నాడు....నిన్న అతని కళ్ళముందు రెపరెపలాడిన తెర తొలగిపోయింది. సౌఖ్యం ప్రత్యక్షమైంది. ఇది దాని మొహం. దేదీప్యమానంగా వెలిగిపోతోంది!

తలపైకెత్తి జెమ్మా వంక సూటిగా ధైర్యంగా తేరిపారజూసాడు జెమ్మాకూడా అతనిని తేరిపార జూసింది, కొంచెం చూపువంచి. వాలిన కనురెప్పలకింద ఆనందబాష్పాలతో కళ్ళు మెరిసిపోయాయి. అది వట్టి మందహాసంకాదు. వినిపించీ వినిపించని నవ్వు. ఆనందంతోకూడిన నవ్వు!

హృదయానికి ఆమెను హత్తుకోవాలని సానిన్ యత్నించాడుగాని ఆమె వెనుకకు జరిగింది, నిశ్శబ్దంగా ఇంకా నవ్వుతూనే, అతనికేసి తల వంకించింది.

"కాస్తఓపికపట్టు" అని ఆమె నేత్రాలు చెపుతున్నట్లనిపించింది.

"ఓ-జెమ్మా!" అని బిగ్గరగా అన్నాడు సానిన్. "నువు నన్ను ప్రేమిస్తావని యెన్నడయినా అనుకున్నానా? (తంబూరా తీగలాగా అతని హృదయం కొట్టుకుంది)

"నేను అనుకోలేదు" అంది జెమ్మా మృదువుగా.

"ఫ్రాంక్‌ఫోర్టులో ఒకటి రెండు గంటలకంటె యెక్కువ వుందామనుకోలేదు. కాని యిక్కడికి రావడంమూలంగా నా జీవిత సౌఖ్యం లభిస్తుందని యెన్నడయినా అనుకున్నానా?....

"నీ జీవితసౌఖ్యం? నిజం?"

"నా జీవితసౌఖ్యం! అప్పటికీ, యిప్పటికీ, యెప్పటికీ" అన్నాడు సానిన్ పరవశత్వంతో.

వారు కూర్చున్న బల్లకు రెండడుగుల దూరంలో తోటమాలి పార దప్పుడయింది, హఠాత్తుగా.

"యిక యింటికి వెళదాం పద" అని జెమ్మా సానిన్ చెవిలో చెప్పింది. "యిద్దరం కలసి వెళదాం-యిష్టమేనా ?"

ఆ నిమిషంలోనే గనక ఆమె, "సముద్రంలో వురుకు - వురుకుతావా?" అని అంటే, వాక్యం పూర్తి అయీఅవక మునుపే అతను సముద్రంలో ఉరికేవాడు.

ఇద్దరూ కలసి ఉద్యానవనంలో నుంచి బయటికి వెళ్ళారు. పట్టణంలోనుంచి గాకుండా, ప్రశాంతంగా ఉండే శివార్ల వీధులలోనుంచి ఇంటిదోవ పట్టారు.

# 28

సానిన్ జెమ్మావెంట నడుస్తూ, మధ్యమధ్య నాలుగడుగులు వెనక పడుతూ, ఆమెనుంచి చూపు మళ్ళించకుండా అస్తమానం నవ్వసాగాడు. తొందరగా వెళ్ళిపోదలచినట్టు కనిపించినా, ఆమెహఠాత్తుగా ఆగిపోయేది. నిజం చెప్పాలంటే, వెలవెలబోతున్న అతను ఉద్వేగంతో ఎర్రబారిన ఆమె స్వప్నంలోలాగా ముందుకు నడిచిపోతున్నారు. కొద్ది నిమిషాల ముందు, ఆత్మార్పణ: ఒకరికొకరు అర్పించుకోవడం ఎంతో కొత్తగా, ఎంతో భయానకంగా ఉండి వారిని ముంచెత్తి వేసింది. వారి జీవితాలే హఠాత్తుగా మారిపోయాయి. ఒకరూ ఇంకా కోలుకోలేదు. ఒకరి బాహుపంజరంలోకి ఒకరిని త్రోసిన ఆనాటి రాత్రి సుడిగాలిలాంటి తుపానులో చిక్కుకున్నామని మాత్రమే వారికి తెలుసు. నడుస్తుండగా జెమ్మాను తాను ఇంకో దృష్టిలో చూస్తున్నానని తలిచాడు సానిన్. ఒక్క నిమిషంలో ఆమె నడకలో కదలికలో ఏదోవిశిష్టత అతనికి గోచరించింది.

ఆ నడక, ఆ కదలిక ఎంత అందంగా, ఎంత మధురంగా ఉన్నాయి! అతను ఇంకోదృష్టిలో తనను చూస్తున్నాడని ఆమెకూడా భావించింది.

ఇద్దరికీ ప్రేమంటూ కలగడం ఇదే మొదలు. వారిలో తొలివలపు అద్భుతాలు జరిగిపోతున్నాయి. తొలివలపు విప్లవంలాంటిది, ఒక్క-నిమిషంలో విసుగెత్తించే నిత్యజీవితపు క్రమపద్ధతి భగ్నమవుతుంది. శాత్రగడ (బారికేడు)దగ్గర వెలుగొందే జెండా రెపరెపలాడించుకుంటూ యవ్వనం నిలబడుతుంది. ఎంతో ఉత్సాహంతో ఏదివ్రాసిపెట్టితే దానిని, మరణానికయినా, నూత్నజీవితానికయినా స్వాగత మివ్వడానికి సిద్ధమవుతుంది.

"ఆ వచ్చేదెవరు? మన ముసలితాత కాదుగదా?" అన్నాడు సానిన్ వారి కంటబడకుండా ఉండాలని యత్నిస్తున్నవాడిలా తొందరగా వారిని దాటిపోతున్న ఒక ముసుగు వ్యక్తిని వేలితో చూపుతూ. సానిన్‌కి సంతోషం పొంగిపోతోంది. జెమ్మాతో పవిత్రమైన ప్రేమను గురించి మాట్లాడాలని అతనికి లేదు, అదంతా నిర్ణయమయిపోయిందిగా! దానికి విభిన్నమైన దేదో మాట్లాడాలని తలచాడు.

"అవును. పాంటలిమోన్!" అని జవాబిచ్చింది జెమ్మా, సంతోషంతో, ఉత్సాహంతో "బహుశా అతను నన్ను యింటిదగ్గిరనించీ వెంటాడుతున్నట్టున్నాడు, నిన్నల్లా నా వెనకే తిరిగాడు....వూహించాడు...."

"వూహించాడా?" అన్నాడు సానిన్ సంతోషంతో. జెమ్మా చెప్పింది ఏది అతనికి సంతోషం కలిగించదు!

ఆ కిందటి రోజున జరిగినదంతా వివరంగా చెప్పమని ఆమెను అడిగాడు.

తక్షణమే ఆమె తొందరతొందరగా, కంగారుపడిపోతూ, మధ్య మధ్య మందహాసం చేస్తూ, నిట్టూరుస్తూ, సానిన్‌వంక త్వరితగతిని చూస్తూ కధఅంతా చెప్పసాగింది "మొన్నటి మన సంభాషణ తరవాత 'ఒకరోజు వ్యవధి యివ్వు, నా నిర్ణయం తెలియజేస్తాను' అని మా

అమ్మతో చెప్పి శాంతపరచాను. వ్యవధి యిమ్మని యెంతో పట్టుపట్టవలసి వచ్చింది. అమ్మని ఒప్పించడం మహాకష్టమయింది. హఠాత్తుగా హెర్ క్లూబరు చక్కావచ్చాడు. వెనకటికన్నా టిప్‌టాపుగా వున్నాడు. నువు ద్వంద్వయుద్ధం చేయడం క్షమించరానిదనీ. తనను అవమానించడమే ననీ మండిపడ్డాడు. నిన్ను గుమ్మంలో అడుగుపెట్టనియ్యవద్దన్నాడు"

క్లూబర్ గొంతును, వైఖరిని అనుకరిస్తూ జెమ్మా అంది, "అలా వ్యవహరించడం నా గౌరవానికి మచ్చ తెచ్చిపెట్టింది. నేను పెళ్ళాడబోయే స్త్రీ పక్షాన నేను నిలబడనట్టు ప్రపంచానికి చాటుతుంది. యిది అవసరమనుకోనా, లాభదాయకమనుకోనా? నా వధువు పక్షం వహించి ఒక అధికారితో అతను పోరాడాడని రేపు ఫ్రాంక్‌ఫోర్టులో అంతా చెప్పుకుంటారు. యిటువంటిది యెపుడయినా విన్నామా? నా గౌరవానికి దెబ్బ'! తమాషా యేమంటే అమ్మకూడా అతనితో యేకీభవించింది. నేను నిన్ను పెళ్ళాడదలచుకోలేదు కాబట్టి యిక యెంతమాత్రం గౌరవం విషయం బెంగ పెట్టుకోవద్దని, నన్నుగురించి యేదో అనుకుంటే అవమానమని భావించవద్దని చెప్పేసాను. అతనితో తెగతెంపులు చేసుకునే ముందు నీతో మాట్లాడి వుండవల్సింది. కాని యేంచేయను? అతనంతట అతనే వచ్చాడు.... అమ్మ భయంతో కెవ్వుమంది. నేను పక్కగదిలోకి వెళ్ళి ప్రధానపుటుంగరం - రెండు రోజుల క్రితమే తీసేసాను, నువు చూచావోలేదో - తెచ్చి యిచ్చివేసాను. ఆయనికి చెడ్డకోపం వచ్చింది. అహంకారం యెక్కువేమో మెదలకుండా వెళ్ళిపోయాడు. అమ్మతో చావొచ్చిపడింది. ఆమె బాధ పడుతూంటే చూడలేకపోయాను. తొందర పడ్డానేమో ననిపించింది. యింతలో నీ చీటీ వచ్చింది. అంతకుముందే నాకు తెలుసు...."

"నేను నిన్ను ప్రేమిస్తున్నానని కదూ?" అని సానిన్ అడ్డు వచ్చాడు.

"అవును. నన్ను నువు ప్రేమించావని"

జెమ్మా మందహాసం చేస్తూ, తగ్గుస్థాయిలో ఒక క్రమమంటూ లేకుండా బడబడా మాట్లాడసాగింది. ఇతరులు ఎవరయినా సమీపించినా

పక్కనుంచి వెళ్ళినా టపీమని ఆగిపోయేది. ఇక సానిన్, ఆ కిందటి రోజున ఆమె దస్తూరినీ మెచ్చుకున్నప్పటిలాగానే ఆమె స్వరమాధురుని మెచ్చుకుంటూ ఒళ్ళు తెలియని ఆనందంలో మునిగిపోయాడు.

"అమ్మ పూర్తిగా తబ్బిబ్బయిపోయింది" అంది జెమ్మా, మాటలు తడబడ్డాయి. "నాకు హెర్ క్లూబర్ అంటే యేవగింపనీ, అతనిని పెళ్లాడ డానికి వొప్పుకున్నానంటే ప్రేమవుండి గాదనీ, ఆమె పోరుపడలేక వొప్పు కున్నాననీ గ్రహించలేకపోతోంది....ఆమెకి నీమీద....అనుమానం.. నేను నిన్ను ప్రేమిస్తున్నానని గట్టిగా నమ్ముతోంది. మొన్నటివరకు అసలు నీమీద అనుమానమేలేదు. అందుకనే నాకు నచ్చచెప్పమని నిన్ను కోరింది....అలా కోరడం చిత్రంగా లేదూ ? యిపుడు నిన్ను వట్టి మోస గాడివనీ, నమ్మకద్రోహివనీ తిడుతోంది. నన్నూ యిలాగే మోసగిస్తావని హెచ్చరించింది...."

"కాని జెమ్మా" అన్నాడు సానిన్ బిగ్గరగా "నువ్వు చెప్పలేక పోయావా...."

"నే నామెకేమీచెప్పలేదు. నీతోమాట్లాడకుండానే యెలాచెప్పను?"

సానిన్ బారలు సాచి,

"యిప్పుడయినా మీ అమ్మకి అంతా చెప్పేసి నన్ను తీసుకు వెళతావని.... నేను మోసగాడిని కానని నచ్చచెపుతా." అన్నాడు.

మనసులో పొంగే ఉదారమైన, తీవ్రమైన ఉద్వేగాలతో అతని వక్షస్థలం ఉబికింది.

జెమ్మాకళ్ళు నిండా తెరచుకుని అతనికేసి పారజూసింది. "అమ్మ దగ్గరికి యిపుడే వెళదామంటావా? అమ్మ ...మనిద్దరికీ....జరగదని...." ఒకమాటమాత్రం జెమ్మా గొంతులోనుంచి బయటకు రాలేదు....ఆ మాట ఆమె పెదవులను కాల్చేస్తున్నట్టుంది. కాని సానిన్ ఈ సంగతి గ్రహించి మహాసంతోషంతో ఆ మాట కాస్తా అనేసాడు.

"నిన్ను పెళ్ళిచేసుకోవడం, జెమ్మాకు భర్తను కావడం - అంతకంటే బ్రహ్మానందం యేంవుంది?

అతని ప్రేమకు, ఉదారతకు, దృఢనిశ్చయానికీ అంతంటూ కని పించలేదు.

సానిన్ ఇలా అంటూంటే, జెమ్మా ఒక్క నిమిషంసేపు కొయ్య బొమ్మలా నిలబడి తొందరగా తొందరగా నడక సాగించింది. ఆకస్మికంగా లభించిన ఈ మహదానందంనుంచి, మితిమీరిపోయిన ఆనందంనుంచి దూరంగా పారిపోదలచినట్లుంది ఆమె నడక.

కాని హఠాత్తుగా ఆమె మోకాళ్ళు వణికాయి. కొద్ది అడుగుల దూరంలో, పక్క మలుపులో కొత్తహేటు, కొత్తకోటు ధరించి సూటిగా బాణంలాగా, ముడుచుకున్న పెంపుడు కుక్కలాగా హెర్ క్లూపర్ గోచ రించాడు. ముందుగా జెమ్మాను, ఆ తరవాత సానిన్‌ను చూసి క్లూబర్ లోలోపల మామూలుగా బుసకొట్టినట్టు కనిపించాడు. వారు ఎదురవగానే తనువు వెనకకు వంచుకున్నాడు. సానిన్ ఒక్క క్షణంసేపు అదిరిపోయాడుగాని క్లూబర్ మొహంకేసి తేరపార జూసేసరికి తగని కోపం వచ్చింది, క్లూబర్ మొహంలో వేళాకోళంతోకూడిన ఆశ్చర్యం, దయ కానవచ్చాయి, సానిన్ ముందుకు సాగిపోయాడు.

జెమ్మా దృఢనిశ్చయంతో సానిన్ చేయిపట్టుకుని పూర్వవరుని కళ్ళల్లోకి సూటిగా చూసింది....ఇక క్లూబర్ కళ్ళు కుంచించుకున్నాడు. తనలోకి తాను కుంచించుకు పోయినట్టు కనిపించాడు. పక్కకు తప్పు కుని 'చివరికి యింతే' అని గొణుగుకొని ఆడంబరంగా ఎత్తెత్తి కాళ్ళు వేసుకుంటూ వెళ్ళిపోయాడు.

"ఆ వెధవ యేమిటన్నాడు? అని అడిగాడు సానిన్, క్లూబర్ వెనక పరుగెత్తడానికి సిద్ధమవుతూ. కాని జెమ్మా అతనిని ఆపి చేయి విడవకుండా తీసుకువెళ్ళింది.

రోసెల్లీ దుకాణం దూరాన కనిపించింది. జెమ్మా మళ్లా ఆగింది

"డిమిట్రీ, మాన్షియర్ డిమిట్రీ! మనమింకా యింటికివెళ్ళి అమ్మని చూడలేదు....ఆలోచించుకోవడానికి వ్యవధి కావలసివుంటే....బంధనా లేమీ లేకపోతే, డిమట్రీ...."

దీనికి జవాబుగా సానిన్ ఆమెచేతిని తనవక్షస్థలంమీద ఒత్తుకుని ఆమెను దగ్గరగా లాక్కున్నాడు.

"అమ్మా!" అంది జెమ్మా. సానిన్‌ను తీసుకుని ఫ్రా లెనోరీ కూర్చున్న గదిలోకి వెళ్ళి "యిదిగో అసలాయనను తీసుకువచ్చాను."

# 29

జెమ్మాయే గనక కలరానో, మృత్యుదేవతనో వెంటబెట్టుకు వచ్చానని చెప్పినా ఫ్రా లెనోరీ ఇంతకంటె ఎక్కువ నిరాశకులోన యేదికాదు. ఓకమూల కూర్చుని, మొహం గోడవైపుకు తిప్పి, కన్నీరు కాలువలు కట్టేటట్టు, భర్త శవం పక్కనో, కొడుకుశవం పక్కనో, విలపించే రష్యన్ వనితలాగా బిట్టు విలపించింది. జెమ్మా మనసు కరిగి పోయింది. తల్లిదగ్గరకు వెళ్ళలేక గది మధ్యలో బొమ్మలా నిలబడింది. ఇక సానిన్‌కి మతిపోయింది ఏడుపువచ్చింది, ఈవిధంగా ఏడుపు ఒక గంట, పూర్తిగా ఒక గంట సాగింది కొత్తవాళ్ళెవరూ లోపలికి రాకుండా వీధితలుపు తాళం వేయడం ఉత్తమమని పాంటలియోన్ నిశ్చయించాడు. అదృష్టవశాత్తు ఇంకా పొద్దెక్కలేదు ఆ వృద్ధుడు చకితుడయిపోయాడు, జెమ్మా, సానిన్ అంత తొందరపడడం అతనికి అంగీకారం కాలేదు కాని క్లూబర్ అంటే అసహ్యంకొద్దీ వారిని విమర్శించడానికి అతనికి మనస్కరించలేదు. అవసరమయితే రక్షణ యివ్వడానికూ్కడా సిద్ధంగా ఉన్నాడు. ఇక ఎమిలీ, తన స్నేహితుడికీ అక్కకీ తానే సంధాన కర్తనని భావించుకుని అంతా సవ్యంగాజరిగినందుకు గర్వించసాగాడు. ఫ్రా లినోరీ ఎందుకింత బాధపడుతుందో అర్థంగాక ఆడవాళ్ళంతా వట్టి అవివేకులనే నిర్ణయానికి వచ్చాడు. అందరిలోకీ సానిన్ పనే మరీ అధ్వాన్నంగా పరిణమించింది అతను సమీపించినపుడల్లా చేతితో వారిస్తూ

బిగ్గరగా ఏడవసాగింది. దూరాన్నుంచే సానిన్ పలుతడవలు బిగ్గరగా ఎడుస్తూ "నీ కూతురుని వివాహ మాడడానికి నీ అనుజ్ఞ కోరదలచాను." అన్నాడు. ఫ్రా లెనోరీ తనను తానే నిందించుకోసాగింది. ఇంతగుడ్డి దెలా అయింది? "నాజియోవాన్ బాటిస్టాయే గనుక జీవించి వుంటే యిలా జరిగేదికాదు." అంది కన్నీరు పెట్టుకుంటూ. "యేమిటీ గొడవ?" అనుకున్నాడు సానిన్. "ఉహుం ఆ సంగతంతా"....జెమ్మా కేసి చూడలేక పోయాడు. జెమ్మాకూడా కన్నెత్తి అతనిని చూడలేకపోయింది. మొదటిలో తల్లి ఆమెనుకూడా దగ్గరకు రావద్దని తోసేసినా మెల్లగా ఆమె దగ్గరచేరి ఓర్పుతో సముదాయిస్తూ తృప్తిపడింది.

చివరకు ఎలాగయితేనేం క్రమక్రమంగా తుపానుసర్దుకుంది. ఫ్రా లెనోరీ ఏడవడం మానివేసింది. జెమ్మా ఆమెను మెల్లగా లేవదీసి కుర్చీలో కూర్చోపెట్టి నారింజపువ్వులు వేసిన నీళ్ళు కొంచెం గుటక వేయించింది. ఫ్రా లెనోరీ మొదటలో సానిన్‌ను తక్షణమే బయటికి వెళ్ళిపొమ్మని కసురుకుంది గాని చివరికి ఆ గదిలో ఉండనిచ్చింది. దగ్గరకు రానీయకపోయినా అతను మాట్లాడుతూంటే అడ్డురాలేదు. సానిన్ తన వాక్చాతుర్యాన్ని ప్రదర్శించడానికి ఈ అవకాశాన్ని ఉపయోగించుకున్నాడు. జెమ్మా ముందు అతని ఉద్దేశాలను, భావాలను అంత దృఢ నిశ్చయంతో ప్రకటించ గలుగుతాడనడం అనుమానస్పదమే. అతని ఉద్వేగాలు వాస్తవికమైనవి. ఉద్దేశాలు పవిత్రమైనవి. ఫ్రా లెనోరీకిగాని తనకు తనుగాని తన ఉద్దేశాలలోని అనర్థకాలను మరుగుపరచలేదు. అతను విదేశీయుడన్నమాట నిజమే. ఇటీవలనే పరిచయం ఏర్పడింది. అతనిని గురించిగాని, అతని ఆస్తిపాస్తులను గురించిగాని వారికి ఇదమిద్ధమని తెలియదు కాని తను గౌరవనీయుడని, దరిద్రుడు కాడని రుజువు పర్చుకోడానికి సిద్ధంగా ఉన్నాడు. ఈ విషయం తన స్వదేశీయుడుచేత రూఢిపరిపిస్తానని చెప్పాడు, జెమ్మా తనను పెళ్ళిచేసుకుని సుఖపడుతుందనీ, కుటుంబ ఎడబాటుకు బాధపడకుండా ఆమె జీవితం మధురమయం చేస్తానని తెలిపాడు. ఎడబాటు! ఎడబాటు అనేమాట ఉచ్చరించడంలో అంతా బూడిదపాలవడానికి సిద్ధమయింది. ఫ్రా లెనోరీ కుర్చీలో అటూ

ఇటూ కదలాడుతూ పణికిపోయింది. సానిన్ ఎడబాటు తాత్కాలికమే నని, బహుశా అసలు ఎడబాటుకు అవసరం రాదేమోననీ తొందరగా చెప్పాడు

అతని వాక్చాతురి విఫలంకాలేదు. ఫ్రా లెనోరీ పూర్వపు ఆగ్రహంతో అసహ్యంతో, కాకపోయినా దుఃఖంతో, కోపంతో అతని కేసి చూడసాగింది. ఆతరవాత దగ్గరకు రానివ్వడమేగాదు పక్కన కూర్చో నిచ్చింది (ఇంకొపక్కన జెమ్మా కూర్చుంది). కళ్ళతోనే గాకుండా మాటలతోనే అతనిని నిందించింది. మాటలలో నిందించిందంటే మనసు మెత్తపడిందన్నమాట. నిందించడం క్రమక్రమంగా తగ్గింది మధ్యమధ్య సానిన్‌ని, జెమ్మాని ఒకరిని విడిచి ఒకరిని ప్రశ్నించింది. సానిన్‌ను చేతిని పట్టుకోనిచ్చింది· చేయి వెనకకు లాగుకోలేదు....ఆ తరవాత కన్నీరు కార్చింది గాని వెనకటిమాదిరివి కావు....విచారంగా మందహాసం చేసి జియోవాన్ బాటిస్టా అక్కడ లేకపోయేడేనని విచారించింది. అలా విచారించడం పూర్వపు భావంతో కాదు....ఇంకోక్షణం గడిచింది. ఆ పాపులిద్దరూ - సానిన్, జెమ్మా ఆమె పాదాలముందు మోకరిల్లారు. ఆమె వారి తలలమీద చేతులు పెట్టి ఆశీర్వదించింది. ఇంకో క్షణం గడచింది. వారిద్దరూ ఆమెను కావలించుకుని ముద్దిడుకున్నారు. ఎమిలీ గదిలోకి పరుగెత్తుకుంటూ వచ్చాడు అతని మొహం సంతోషంతో వెలిగిపోతోంది. వచ్చి వారి సరసనే నిలబడ్డాడు.

ఇక పాంటలియోన్ గదిలోకి తొంగిచూసి చిరునవ్వు నవ్వి మొహం ముడుచుకుని వీధి తలుపు తీయడానికి దుకాణంలోకి వెళ్లాడు.

# 30

ఫ్రా లెనోరీలోని నిరాశాభావం విచారంగా, విచారం పూర్తివైరాగ్యంగా త్రుటిలో మారిపోయింది. ఈ పూర్తి వైరాగ్యంకూడా సంతృప్తికి త్వరలోనే దారితీసింది. కాకపోతే మర్యాదగా ఉండదని ఆ సంతృప్తిని రహస్యంగా, మితిమీరనీయకుండా అట్టేపెట్టుకుంది. పరిచయమైన మొదటిరోజునే సానిన్ అంటే ఫ్రా లెనోరీకి సదభిప్రాయం ఏర్పడింది. అతను తన అల్లుడు అనే భావానికి అలవాటుపడిన తరవాత అతనిలో చెప్పుకోతగ్గ చెడు ఏమీ ఆమెకు కనిపించలేదు. కాని ఇంకా కొంత కాలంపాటు అన్యాయానికి గురి అయినదానిలాగా, ఆదుర్దా పడుతున్న దానిలాగా కనిపించడం తన విద్యుక్త ధర్మమని ఆమె భావించింది. గత కొద్ది రోజులలో జరిగిన సంఘటనలు విశిష్టమైనవి....ఒకదానిమీద ఒకటి. తల్లిగా, ఆచరణశీలిగా సానిన్‌ను రకరకాల ప్రశ్నలు వేయడం తన విధి అని తలచింది. ఇక సానిన్ ఉదయాన జెమ్మాను కలుసుకుందామని వెళ్లాడు. ఆమెను వివాహమాడాలని ఊహించలేదు, అటువంటివాడు ఉద్రేకానికి లోనైపోయాడు. ఇపుడు జెమ్మాను వివాహ మాడడానికి సంసిద్ధుడై వచ్చి ఉత్సాహంగా ఆమె అడిగే ప్రశ్నలకు వివరంగా జవాబియ్యసాగాడు. అతను గొప్ప వంశీకుడనే సంగతి సంతృప్తి చెంది రాజ వంశీకుడు కానందుకు పాలెనోరీ ఆశ్చర్యం వెలిబుచ్చింది. ఫ్రా లెనోరీ గంభీరంగా కనిపిస్తూ అతనిఎడ నిర్మొహమాటంగానే ప్రవర్తిస్తానని ముందుగా హెచ్చరించింది. తల్లిగా తన పవిత్ర ధర్మం నెరవేర్చడానికి ఇలా ప్రవర్తించకతప్పదని తెలిపింది. దీనికి సానిన్ జవాబిస్తూ ఆమె వద్దనుంచి ఇంతకంటె వేరే ఏమీ తాను ఆశించటంలేదనీ, తనను కనికరించవద్దనీ చెప్పాడు.

ఫ్రా లెనోరీ ఆ తరవాత హెర్‌క్లూబర్‌కు (ఈ పేరును కొద్దిగా నిట్టూరుస్తూ, పెదవులు నొక్కుకుంటూ, తటపటాయిస్తూ ఉచ్ఛరించింది) ఎనిమిదేల గిల్డర్ల ఆదాయం వస్తుందనీ, సంవత్సర సంవత్సరానికీ ఈ ఆదాయం పెరుగుతుందనీ చెప్పి సానిన్‌ను అతని రాబడి ఎంతో చెప్ప మని కోరింది.

"యెనిమిదివేల గిల్డర్లు" అంటూ దీర్ఘాలు తీసాడు సానిన్. "అంటే సుమారు పదిహేనువేల రూబుళ్ళు....నా రాబడి అంతకంటే చాలా తక్కువ. టులారాష్ట్రంలో నాకో చిన్న జమీవుంది. సరిగా నిర్వహించుకుంటే అయిదారు వేలదాకా రాబట్టవచ్చు....యిక నేను యేదైనా ప్రభుత్వోద్యోగంలో జేరితే తేలిగ్గా రెండువేల జీతం ముడు తుంది."

"రష్యాలో వుద్యోగం! "అంది ఫ్రా లెనోరీ. "అంటే జెమ్మాను వదిలి పెట్టి నేనుండాలన్నమాట!

"నేను దౌత్యశాఖలో వుద్యోగం సంపాదిస్తాను" అన్నాడు సానిన్, "నాకు సంబంధించినవా రున్నారు....విదేశాలలో వుండవచ్చు. అంతకంటె వుత్తమమైన పద్ధతి చెపుతా విను, నా జమీ అమ్మేసి యెద యినా లాభించే వ్యాపారంలో, వుదాహరణకి, మీ రొట్టెలవ్యాపా రంలో పెడతాను." అర్థంపర్థ లేకుండా మాట్లాడుతున్నానని సానిన్‌కు తెలుసు. కాని ఒక విచిత్రమైన నిర్లక్ష్యం అతనిని లోబర్చుకుంది. జెమ్మా కేసి చూసాడు సంభాషణ కార్యరూపంలోకి దిగేసరికి ఆమె గదిలో అటూ ఇటూ పచార్లు చేస్తూ మధ్యమధ్య కూర్చోసాగింది. ఆమెకేసి చూసాడు. అడ్డంకులేమీ లేనట్టే భావించాడు. ఆ క్షణంలోనే ఉత్తమ పద్ధతిలో ఆమెకు విచారం లేకుండా చేయడానికి, అన్ని యేర్పాట్లూ చేయ డానికి సిద్ధంగా ఉన్నాడు.

"రొట్టెలవ్యాపారం వృద్ధి చేయడానికి హెర్‌క్లూబర్‌కూడా వా క్కొంత డబ్బిస్తానని చెప్పాడు" అంది ఫ్రా లెనోరీ ఒక క్షణం తట పటాయించి.

"అమ్మా! ఏమిటిది, అమ్మా! " అంది జెమ్మా ఇటాలియన్ భాషలో.

"యీ విషయాలు సరైన సమయంలోనే చర్చించడం మంచిది" అని ఫ్రా లెనోరీ అదే భాషలో జవాబిచ్చింది

సానిన్‌వంక తిరిగి రష్యాలో వివాహచట్టం ఎలా ఉంది, ప్రష్యాలోలాగా కాథలిక్ మతస్తులను వివాహమాడడానికి ఆటంకాలేమైనా ఉన్నాయా అని ప్రశ్నించింది. (అప్పుడు, అంటే 1840 లో ఈ మిశ్రమ వివాహాల విషయంలో ప్రష్యా ప్రభుత్వానికీ, కొలోన్ ఆర్చిబిషప్పుకు జరిగిన పోట్లాటను జర్మన్ ప్రజానీకం ఇంకా మరిచిపోలేదు), రష్యన్ జమీందారును పెళ్ళిచేసుకుంటే తనకూతురుకూడా జమీందారిణి కిందే పరిగణింపబడుతుందని తెలుసుకుని ఫ్రా లెనోరీ సంతృప్తి వెల్లడించింది "యింతకీ నువు ముందుగా రష్యా వెళ్లాలిగదా? వెళ్ళరా?"

"యెందుకూ వెళ్ళడం? "

"మీ చక్రవర్తిదగ్గిరనుంచి అనుమతి పొందడానికి."

చక్రవర్తిదగ్గిర అనుమతి పొందడం ఏమాత్రం అవసరం లేదని సానిన్ ఆమెకు విశదీకరించాడు. ....కాని పెళ్ళికి ముందు ఒకమాటు రష్యావెళ్ళి రావలసి వుంటుందనీ, (ఈమాటలు చెపుతూంటే బాధతో అతని హృదయం ముడుచుకుంది. జెమ్మా అతనికేసి చూసింది. అతని బాధను గ్రహించి సిగ్గుపడి చింతాక్రాంత అయింది) ఆ సమయంలో జమీ అమ్మివేయడానికి యత్నిస్తాననీ చెప్పాడు....ఏమైనా, అవసరమైన డబ్బు పట్టుకు వస్తాను....

"వుత్తరీయం నేయించుకోడానికి మంచి ఆస్ట్రాఖాన్ వున్ని తెచ్చిపెడతావుగదూ?" అంది ఫ్రా లెనోరీ "అక్కడి వున్ని యెంతో అందంగా, యెంతో చవకగా వుంటుందంటారు."

" ఓ తప్పకుండా, మహాసంతోషంతో తెస్తా నీ ఒక్కదానికే కాదు జెమ్మాకుకూడా పట్టుకువస్తా" అన్నాడు సానిన్.

"వెండితీగలు కుట్టిన మొరాకో తోలుటోపీ నాకు తెచ్చిపెట్టు" అన్నాడు ఎమిలీ గదిలోకి తొంగిచూస్తూ.

"ఓ-అలాగే-అలాగే, పాంటలియోన్‌కు ఆకుచెప్పులు తెస్తా."

"యీ స్వల్పవిషయాల కేంగాని" అంది ఫ్రా లెనోరీ "యిపుడు మనం అత్యవసర విషయాలు మాట్లాడుకుంటున్నాం. యింకో విషయం అంది కార్యశీల అయిన ఆ స్త్రీ. "జమీ అమ్మేస్తానన్నావు కదా, రైతులనుకూడా అమ్మేస్తావా ?"

సానిన్ హృధయం బాధతో మూలిగింది. దాసవిధానం విషయమై ఇదివరలో వారితో మాట్లాడేటపుడు తనకు ఆ విధానమంటే మంట అనీ అవినీతికరమైనది కాబట్టి తాను వారిని ఎన్నటికీ అమ్మననీ పదేపదే చెప్పడం జ్ఞాపకం వచ్చింది.

"బాగా వున్నవాడికి నా జమీ అమ్మడానికి యత్నిస్తాను." అన్నాడు సానిన్ తడబడుతూ,

"లేకపోతే రైతులే తమ స్వాతంత్ర్యాన్ని కొనుక్కోవచ్చు."

"అదే వుత్తమం" అంది ఫ్రా లెనోరీ అతనితో ఏకీభవిస్తూ. "మనుష్యుల్ని అమ్మడం...."

"అమానుషం." అన్నాడు పాంటలియోన్. ఎమిలీ వెనక గుమ్మంలో ఒక్క నిమిషం కనిపించి వెంటనే టోపీ ఆడించుకుంటూ చక్కాబోయాడు.

"యిదేం బాగుండలేదు." అది తనలో తాను అనుకుని దొంగ చాటుగా జెమ్మా కేసి చూసాడు. అతని మాటలు విసినట్లు లేదు. "సరే, మరేం ఫరవాలేదు" అనుకున్నాడు.

ఈ విధంగా సంభాషణ భోజనసమయం వరకూ సాగింది. చివరికి ఫ్రా లెనోరీ పూర్తిగా శాంతించింది. డిమిట్రీ అని పిలవడం మొదలు పెట్టింది. ఆప్యాయంగా అతనికేసి చూపుడువేలు ఆడించి, నమ్మించి ద్రోహం చేసినందుకు పగ తీర్చుకుంటానని బెదిరించింది. కుటుంబ విషయాలు కూడా చాలా ముఖ్యమైనవి కాబట్టి అతనిని ప్రశ్నలవర్షంలో ముంచింది, రష్యన్ చర్చిలలో జరిగే పెళ్ళితంతును వర్ణించి చెప్పమని

పట్టుపట్టింది. పెళ్ళి సమయంలో తెల్లటి దుస్తులు వేసుకుని బంగారు కిరీటం జెమ్మా పెట్టుకుంటుందని విని పరిమానందభరితురాలై పోయింది.

"అవును. నా బిడ్డ అచ్చంగా రాణీయే" అంది మాతృగర్వంతో. యిటువంటి రాణి యీ భూ ప్రపంచంలోనే లేదు, నిజం "

"జెమ్మా వంటిదే యీ భూ ప్రపంచంలో లేదు." అన్నాడు సానిన్.

"అందుకే జెమ్మా అని పేరు పెట్టాం" (జెమ్మా అంటే ఇటాలియన్ భాషలో రత్నం అని అర్థం.)

జెమ్మా తల్లిని ముద్దిడుకోసాగింది....ఇకఇపుడు స్వేచ్ఛగా ఊపిరి పీల్చుకోగలట్లు, ఏదో భారం తొలగిపోయినట్లు ఆమెకు అనిపించింది.

ఆ గదిలోనే కనిన కలలు నిజం కాబోతున్నాయనే భావం మూలంగా అంతులేని సంతోషంలో, పిల్లతనపు వేడుకలో సానిన్ మునిగి పోయాడు. ఉద్వేగం తగ్గుముఖం పట్టింది. సరాసరి దుకాణంలోకి వెళ్ళి కొద్దిరోజుల క్రితం లాగానే గల్లాపెట్టె వెనక నిలబడాలని తలచాడు.... "నాకు పూర్తిగా ఆ హక్కు వుంది. యిపుడు నేను యీ కుటుంబములో ఒకడిని" అనుకున్నాడు.

నిజంగానే గల్లాపెట్టె వెనుక నిలబడి వాడకందార్లకు కావలసినవి ఇచ్చాడు- ఇద్దరు బాలికలకు తీపి పదార్థాలు రెండు పౌనులు అమ్మి అర పౌను ఖరీదే పుచ్చుకున్నాడు,

భోజనం సమయంలో వరుడుగదూ, జెమ్మా పక్కనే కూర్చున్నాడు. ఫ్రా లెనోరీ వ్యవహారాల విషయమే ప్రస్తావించింది. ఎమెలీ అతిగా నవ్వుతూ రష్యాకు తననుకూడా వెంటబెట్టుకుని వెళ్ళమని పోరు పెట్టాడు. పక్షం రోజులలో సానిన్ రష్యా వెళ్లాలని నిశ్చయమైంది. ఒక్క పాంటలియోన్ మొహంలో మాత్రమే విషాదఛాయలు కనిపించాయి. అందుకు ఫ్రా లెనోరీ అతనిని పీడించింది. "ఒహో, అతనికి

సహాయకుడివిగదూ?" అంది. పాంటలియోన్ మొహం ముడుచుకున్నాడు.

జెమ్మా ఒక్క మాటయినా మాట్లాడలేదు. కాని ఆమె మొహం అంత రమణీయంగా, అంత కాంతివంతంగా ఎన్నడూ లేదు. భోజనానంతరం తోటలోకి కాసేపు వెళదాం రమ్మని సానిన్‌ను పిలిచింది. ఇద్దరూ తోటలోకి వెళ్లారు. రెండు రోజుల క్రితం రేగిపళ్ళు ఏరుతూ కూర్చున్న బల్లదగ్గర ఆగి "కోపగించుకోవద్దు, డిమిట్రీ, బలవంతం.... (సానిన్ వాక్యం పూర్తికానీయలేదు )

జెమ్మా మొహం తిప్పేసుకుంది.

"అమ్మ చెప్పిందే, మన మతాలు వేరు, ఆ విషయం చూడు!...."

సన్నటి తాడులో మెడలో వేలాడుతున్న కెంపురంగు శిలువను చేతితో గట్టిగా పట్టుకుని గుంజేసరికి తాడు తెగి శిలువ ఊడి వచ్చేసింది. శిలువను అతనికి అందిస్తూ, "నేను నీ దాని నయినపుడు నీ మతమే నా మతం" అంది.

తిరిగి ఇంటిలోకి వెళ్ళేసరికి సానిన్ కళ్ళు చెమ్మగిలాయి.

సాయంత్రం నుంచీ అంతా మామూలు ధోరణిలో పడ్డారు. ట్రిసెటీ కూడా ఆడారు.

# 31

ఆ మరునాటి ఉదయం చాలా పెందలాడే సానిన్ లేచాడు. ఆనందశిఖరాలను చేరుకున్నాడు· కాని అతనికి నిద్రాభంగం కలిగించిందీ ఆనందం కాదు, జమీని ఎంత తొందరగా, ఎంత లాభదాయకంగా అమ్మదామా అనే ప్రధానసమస్య, ప్రమాదభరితమైన సమస్య అతని మనశ్శాంతిని భంగపరిచింది. రకరకాల ఆలోచనలు అతని మనసులో తారాడాయి. కాని పరిష్కారమార్గం చిక్కలేదు. గాలిలో తిరిగి మన శ్శాంతిని పొందాలని బయటికి వెళ్ళాడు. ఏదో ఒక నిర్ణయానికి వచ్చి మరీ జెమ్మాను కలుసుకోవాలని నిశ్చయించుకున్నాడు

---

ముందర ఎవరావ్యక్తి ? బొద్దుగా ఉన్నాడు. భారీమనిషి. మంచి దుస్తులు వేసుకుని కుంటివాడిలాగా అటూ ఇటూ ఊగుతూ నడుస్తున్నాడు. జనపనార రంగు జులపాలు చుట్టుముట్టిన ఆ మూపు, భుజాలలోనుంచి సూటిగా పొడుచుకుని వచ్చినట్లున్న తల, బలిసి నున్నగా ఉన్న ఆ వీపు, లావుపాటి ఆ చేతులు ఎక్కడ చూసాడు చెప్మా ? పూర్వ సహపాఠి పొలొజోవ్ కాదుగదా ? అయిదేళ్ళయిందిచూసి. సానిన్ ఆ వ్యక్తిని దాటివెళ్ళి వెనకకు తిరిగి చూసాడు.... విశాలమైన పసుపుపచ్చని మొహం, చిన్న చిన్న కళ్ళు, చక్కటి కనుబొమలు, రెప్పలు, పొట్టి బల్లపరుపు ముక్కు, కలిసిపోయినట్లున్న మందపాటి పెదవులు, రోమాలు లేని గుండ్రటి గడ్డం, చిరచిర, సోమరితనం, అవిశ్వాసం ద్యోతకం చేసే ముఖ కవళిక-అవును అతనుఇప్పోలిట్ పొలొజోవ్,

"అదృష్టం పండింది?" అనే భావం సానిన్ మనసులో తళుక్కు మంది.

"పొలొజోవ్! ఇపోల్లిట్ పోలొజోవ్! నువేనా?"

ఆ వ్యక్తి ఆగి చిన్నకళ్ళు పైకెత్తి చూసాడు. ఒక్కక్షణం నిశ్శబ్దంగా గడిచింది. చివరకు ఎలాగయితేనేం పెదవులు తెరుచుకున్నాడు. బొంగురు గొంతుతో,

"డిమిట్రీ సానిన్!" అన్నాడు.

"అవును, నేనే. అని సానిన్ పొలొజోప్ చేతిని నొక్కాడు. ఆ చేతికి బూడిదరంగుతోలు తొడుగు ఉంది. ఇదివరలోలాగానే కొయ్యముక్కలా వేలాడుతోంది. "చాలాకాలమైందా వచ్చి? యెక్కడనుంచి వచ్చావు? మకాంయెక్కడ?"

"నిన్ననే వీస్ బాడెన్‌నుంచి వచ్చా." అని జవాబిచ్చాడు పొలొజోప్ తాపీగా. "నా భార్యకి అవీ యివీ కొంటున్నాను. మళ్ళీ వీస్ బాడెన్ యివాళే తిరిగి వెళ్ళిపోతాను."

"అవునవును. పెళ్ళయిందికాదు. మాంచి అందకత్తెనే చేసుకున్నావట!"

పొలొజోప్ దృష్టి మరల్చి "అవును. అలానే నలుగురూ అంటారు" అన్నాడు.

సానిన్ నవ్వి, "చదువుకునే రోజుల్లోలాగానే యింకా నిర్లిప్తడవుగానే వున్నావన్నమాట."

"నే నెందుకు మారాలో చెప్పు?"

"నీ భార్య చాలా భాగ్యవంతురాలనికూడా అంటారు." అన్నాడు సానిన్, 'అంటారు' అనే మాటను నొక్కిపలుకుతూ.

"అవును ఆముక్కా అంటారు"

"నీకు తెలియదా యేం?"

"డిమిట్రీ! .... పావ్‌లోవిచ్, అవును పావ్‌లోవిచ్, చూడు, నా భార్య వ్యవహారాలలో నేను జోక్యం చేసుకోను."

"ఊఁ- అలాగా. యే వ్యవహారంలోనూ జోక్యం చేసుకోవా?"
పొలాజోవ్ మళ్ళీ పక్కకిజూసి, "యే విషయంలోనూ జోక్యం చేసుకోను.... దాని దారి దానిది. నా దారి నాది" అన్నాడు.

"యిప్పుడెక్కడికి వెడుతున్నావు?" అని సానిన్ అడిగాడు.
"యిపుడు నే నెక్కడికీ వెళ్ళడంలేదు. వీధిలోనుంచుని నీతో మాట్లాడుతున్నాను. మాట్లాడడం అయిపోయింతరవాత నా హోటలుకు తిరిగివెళ్ళి భోజనం చేస్తాను."

"నేనూ నీతోకూడా వుండనా?"
"భోజనానికా?"
"అవును."
"సరే, రా. కలిసి తినడం మజాగా వుంటుంది. నీదంతా తెగ వాగుడుస్వభావంకాదుగదా?"

"కాదనుకుంటాను."
"అయితే, రా."
పొలాజోవ్ బయలుదేరాడు. వెనకనే సానిన్ నడవసాగాడు. పొలాజోవ్ నోరు మెదపలేదు. రొప్పుతూ, అటూ ఇటూ ఊగుతూ నడుస్తున్నాడు. ఇలాంటి తెలివితక్కువ మొద్దు బాగా డబ్బున్న అందమైన పిల్లని ఎలా బుట్టలో వేసుకోగలిగాడో అని సానిన్ తనలో తాను ఆశ్చర్య పోయాడు. పొలాజోవ్ భాగ్యవంతుడ్డుకాదు, తెలివిగలవాడుకాదు, పేరు పొందినవాడుకాదు, చదువుకునే రోజులలో అతనిని తెలివితక్కువ మొద్దనీ, సోమరిపోతనీ, నిద్రమత్తు మొహమనీ, తిండిపోతనీ తలచేవారు. దొంకవెధవ అనిపిలిచేవారు.

"యితని భార్య నిజంగా భాగ్యవంతురాలయితే, యెదో కంట్రాక్టరు కూతురట - నా జమీ యెందుకు కొనేయకూడదు? భార్య వ్యవహారాలలో తనకేం సంబంధం లేదంటాడు? అసంభవం? నేను సబబయిన

ఖరీదు చెప్తాను. యెందుకు ప్రయత్నించకూడదు? యిదంతా చూస్తే అదృష్టం కలిసివచ్చేటట్టుంది. బలే! యత్నిస్తాను."

పొలొజోవ్ సానిన్‌ను ఫ్రాంక్‌ఫోర్ట్‌లోని మంచి హోటళ్ళల్లో ఒక దానికి తీసుకువెళ్ళాడు. ఉన్నవాటిలో మంచిగది తీసుకున్నాడని వేరే చెప్పాలా? బల్లలమీద, కుర్చీలమీద అట్టపెట్టెలు, కొయ్యపెట్టెలు, బంగీలు కుప్పలు కుప్పలుగా పడి ఉన్నాయి...."యివన్నీ మేర్యా నికొలయెవ్నా కోసం కొన్నాను" (మేర్యా నికొలయెవ్నా పొలొజోవ్ భార్య పేరు). పొలొజోవ్ ఒక పడకకుర్చీలో కూలబడి పై వదులుచేసుకుని మూలుగుతూ, "వుష్ణం" అన్నాడు. పెద్దనౌకరును రమ్మని గంట కొట్టి రాగానే సుష్టయిన భోజనం ఏర్పాటు చేయమని చెప్పాడు. "సరిగా ఒంటి గంటకల్లా బగ్గీ సిద్ధంగా వుండాలి. సరిగ్గా ఒంటిగంటకి! వినిపించిందా"

పెద్దనౌకరు అతి వినయవిధేయతలతో వంగి నమస్కరించి గబ గబా చక్కాబోయాడు.

పొలొజోవ్ వేస్టుకోటు గుండీలు ఊడదీసుకున్నాడు. కనుబొమలు ఎత్తేవిధం, ముకుపుటాలు పెద్దవిచేసుకోవడం, ముక్కుముడుచుకోవడం చూస్తే మాట్లాడడం అతనికి అతిభారమని తోస్తుంది. సానిన్ మాట్లాడమని బలవంత పెడతాడా లేక తనే సంభాషణ సాగిస్తాడా అని ఆదుర్దాగా వేచి చూస్తున్నట్లుంది అతని వైఖరి.

సానిన్ అతని స్థితిని గ్రహించి అదేపనిగా ప్రశ్నలువేసి బాధించకుండా తనకు కావలసిన సమాచారం మాత్రం అడిగి తెలుసుకున్నాడు. పొలొజోవ్ రెండు సంవత్సరాలు ఉలాన్స్‌లో సైన్యంలో పనిచేసాడు. (ఆ సైనిక దుస్తులలో కనులపండువుగా ఉండేవాడు!) మూడేళ్ళ క్రితం పెళ్ళి చేసుకున్నాడు....విదేశాలలో సంవత్సరం పైచిలుకునుంచి భార్యతో కలిసి తిరుగుతున్నాడు. ఆమె వీస్ బాడెన్‌లో ఏదో చికిత్స పొందుతుంది. అక్కడనుంచి పారిస్ వెళదామనుకుంటున్నారు. ఇదీ సానిన్ తెలుసుకున్న సమాచారం.

సానిన్ తన గతజీవితాన్ని గురించిగాని భవిష్యత్తులో చేయనెంచిన పనులను గురించిగాని ఎక్కువగా చెప్పలేదు. .జమీ అమ్మదలచానని సూటిగా చెప్పాడు.

పొలొజోవ్ నోరుమెదపకుండా వింటూ భోజనంవచ్చే గుమ్మంకేసి మాటిమాటికీ చూస్తూ కూర్చున్నాడు. భోజనం వచ్చింది, పెద్దనౌకరు ఇంకొక ఇద్దరిని చేతికిందకు వేసుకుని రకరకాల వంటకాలు తెల్లటి కాగితాలు కప్పి తెచ్చాను.

"నీ జమీ టులా రాష్ట్రంలో వుందా?" అని పొలొజోవ్ అడిగాడు, మేజాబల్లముందు కూర్చుని చొక్కా కాలరులోకి తువాలు దోపుకుంటూ.

"అం-అవును"

"యెఫ్రొమోవ్ జిల్లాలోకదూ, నాకు తెలుసు."

"నా అలెక్సెయెవ్కా తెలుసా?" అని సానిన్ అడిగాడు తనూ మేజాముందు కూర్చుంటూ.

"తెలుసు" అంటూ పొలొజోవ్ కోడిగుడ్డు అట్టు, పుట్టకొక్కు నోటిలోకి కుక్కుకుంటూ. "నా భార్య మేర్యా నికొలయెవ్నాకి దానిపక్కనే జమీవుంది....ఏయ్ వెయిటర్, 'యిదిగో, ఆ బుడ్డిబిరడా వూడదీయ్. భూమి మంచిదేగాని నీ రైతులు కలపంతా కొట్టేశారు. అసలు అమ్మడం యెందుకు?"

"నాకు డబ్బు అవసరం. చవకగా అమ్మేయ దలచాను. సరేగాని. నువే యెందుకు కొనేయగూడదూ?"

పొలొజోవ్ గ్లాసుడు సారా తాగి, తువాలుతో పెదవులు తుడుచుకొని, మళ్ళీ మెల్లిగా కరకరలాడిస్తూ నమలడం ప్రారంభించాడు.

"ఊం" అన్నాడు ఎలాగయితేనేం. "నేను జమీను కొనను డబ్బులేదు. వెన్న యిలా యియ్యి. నా భార్య కొంటేకొనవచ్చు, ఆవిడతో మాట్లాడు. యెక్కువధర చెప్పకపోతే కొంటుంది. సరేగాని, యీ జర్మనీ

వాళ్ళు వట్టి గాడిదలనుకో. చేపను వండడం యెలాగో వీళ్ళకి తెలిసి చావదు. అంతకంటె తేలిక యింకోటి లేదనుకుంటారు. అయినా అదేపనిగా, 'నాలుగు సముద్రాలూ కలిపేయాలి,' అని వాగుతుంటారు. వెయిటర్! యీ వెధవ చెత్త తీసుకువెళ్ళిపో."

"నీ భార్య తన వ్యవహారలన్నీ స్వయంగానే చూసుకుంటుందని అంటావా?" అని అడిగాడు సానిన్.

"ఆఁ అవును. యివిగో మాంసంముక్కలు! బలేరుచిగా వున్నాయి. తినిచూడు, డిమిట్రీ! నా భార్య వ్యవహారాలలో నేను కలగజేసుకోనని యిదివరలో చెప్పాను. మళ్ళీ చెపుతున్నాను."

పొలాజోవ్ తిరిగి చప్పుడయేటట్టు నమలసాగాడు.

"ఊఁ- ఆమెతో మాట్లాడం యెలా?"

"మహాసుళువు. వీస్‌బాడెన్ వెళ్ళు. అట్టేదూరం లేదు. వెయిటర్! యింగ్లీషు ఆవపిండిలేదూ? లేదు. పశువులు! కాని ఆలస్యం చేయకు. మేము యెల్లుండి బయలుదేరుతున్నాం. కాస్త సారా - యీ సారా బలే బలే వాసనగొడుతోంది. పులిసిన ద్రాక్షసారా కాదు."

పొలాజోవ్ మొహం ఎర్రబారింది. కళకళలాడుతోంది. తింటున్నపుడు, తాగుతున్నపుడు మంచి హుంషారుగా ఉంటాడు.

"యేం చేయాలో తోచటంలేదు" అని గొణిగాడు సానిన్.

"తొందర్లో అమ్మేయాలనుకుంటున్నావా?"

"అవును. తొందర్లో అమ్మేయాలనుకుంటున్నా"

"పెద్దమొత్తం కావాలా?"

"ఆఁ-కావాలి.... యెలాచెప్పను, పెళ్ళిచేసుకోవాలని బుద్ధిపుట్టింది."

నోటిదగ్గర పెట్టుకోబోతున్న గ్లాసు పొలాజోవ్ బల్లమీద పెట్టాడు.

"పెళ్ళి!" అన్నాడు బొంగురుగా ఆశ్చరం వెల్యిబుచ్చే గొంతుతో, కడుపుమీద చేతులు ముడుచుకుని.

"ఆకస్మికంగానే బుద్ధిపుట్టిందా?"

"ఆఁ...."

"వధువు రష్యాలో వుందనుకుంటా?"

"ఉహుఁ - రష్యాలో లేదు."

"అయితే యెక్కడుంది?"

"యిక్కడే ఫ్రాంక్‌ఫోర్టులో"

"యెవరామె?"

"జర్మను. నిజానికి ఇటాలియను, ఫ్రాంక్‌ఫోర్టులో నివసిస్తోంది."

"డబ్బువుందా?"

"ఉహుఁ-యేమీలేదు"

"అంటే నీ ప్రేమ మహా తీవ్రమయిందన్నమాట!"

"బలేవాడివే! ఊఁ-"

"అందుకేనా డబ్బు కావలసింది?"

"ఆఁ....అందుకే."

పౌలాజోవ్ సారాతాగి మూతి తుడుచుకున్నాడు. చేతివేళ్ళ కొనను నీళ్ళల్లో ముంచి తువాలుతో తుడుచుకుని చుట్ట తీసి వెలిగించాడు. సానిన్ మాట్లాడకుండా ఇదంతా చూస్తూ ఉండిపోయాడు.

"యింకోమార్గంలేదు" అన్నాడు పౌలాజోవ్ తల వెనుకకు వాల్చి పల్చపల్చగా పొగవదులుతూ, "వెళ్లి నా భార్యను కలుసుకో. తలుచుకుంటే నీ కష్టాలన్నీ తీర్చగలదు."

"కాని ఆమెను కలుసుకోవడం యెలా? యెల్లుండి వెళ్ళిపోతున్నామంటివిగా"

పౌలాజోవ్ కళ్ళు మూసుకున్నాడు.

"యెలాగో చెప్తావిను"అన్నాడు పెదవుల మధ్యగా చుట్ట తిప్పుతూ, నిట్టూరుస్తూ. "యింటికి వెళ్ళి సాధ్యమైనంత తొందరగా సామాను సర్దు

కాని యిక్కడికి వచ్చేసేయ్. నేను ఒంటిగంటకి బయలుదేరుతాను. బగ్గీలో కావలసినంతఖాళీ. నాతోకూడా తీసుకువెళతాను. అది ఉత్తమం. యిక ఒక కునుకు తీస్తాను. భోజనం చేసింతరవాత నిద్రపోవటం నాకు అలవాటు. నాప్రకృతి నిద్ర కావాలంటుంది. నేను ప్రతిఘటించను, యిక నాకు నిద్రాభంగం కలిగించకేం."

సానిన్ ఒక్కక్షణం ఆలోచించి హఠాత్తుగా తలపైకెత్తాడు. ఒక నిశ్చయానికి వచ్చాడు,

"సరే మంచిది. నేను అంగీకరిస్తాను, కృతజ్ఞుణ్ణి, పన్నెండున్నర కల్లా యిక్కడికి వస్తాను, యిద్దరం కలిసి వీస్‌బాడెన్ వెళదాం. నీ భార్యకి కోపం రాదనే అనుకుంటా."

కాని పొలొజోవ్ అప్పటికే గురక తీస్తున్నాడు. "నిద్రాభంగం చేయక" అని గొణిగాడు. పాదాలు అట్టే ఆడించి చంటిపిల్లవాడిలాగా నిద్రపోవసాగాడు.

ఆ భారీవ్యక్తిని - ఆ తల, మెడ, రేగిపండులా గుండ్రటి ఎత్తు గడ్డంకేసి మళ్ళీచూసి,సానిన్ హోటలునుంచి చక్కాబోయాడు. రోసెల్లీ దుకాణం దిక్కుగా తొందర తొందరగా అడుగులు వేసుకుంటూ బయలు దేరాడు....ఎడబాటుకు జెమ్మాను సంసిద్ధురాలిని చేయాలి.

# 32

దుకాణంలో ఆ తల్లీ కూతుళ్ళిద్దరినీ సానిన్ కలుసుకున్నాడు. ఫ్రా లెనోరీ వంగి మడత అడుగుబద్దతో కిటికీలమధ్య దూరం కొలు స్తోంది. సానిన్‌ను చూడగానే లేచి చిరునవ్వుతో ఆహ్వానించింది. కాని ఛాయామాత్రంగా ఆమెలో కలవరపాటు గోచరించింది.

"నిన్న నువావిషయం చెప్పిందగ్గరనుంచీ" అంది ఫ్రా లెనోరీ. "మన దుకాణం పెద్దదిచేయడానికి ఆలోచనలతో నాతల నిండిపోయింది. గాజుసొరుగుల బీరువాలు రెండు యిక్కడ పెడితే బాగుంటుందని తోస్తోంది. యీ రోజుల్లో యివి సరదా అయిపోయాయి. తరవాత...."

"బలే! బలే!" అంటూ అడ్డు వచ్చాడు సానిన్.

"యీ విషయం బాగా ఆలోచించవల్సిందే....సరేగాని, యిలా రండి, ఒకమాట చెప్పాలి." ఫ్రా లెనోరీకి ఒకచేయి, జెమ్మాకి ఒకచేయి అందించి ఇద్దరినీ వెనకగదిలోకి తీసుకువెళ్ళాడు. ఫ్రా లెనోరీ భయపడి అడుగుబద్దను కిందికి జారవిడిచింది. మొదటలో జెమ్మాకికూడా భయ పడేటంత పనైంది గాని సానిన్ మొహంకేసి చూసేసరికి మనసు కుదుటపడింది. అతని మొహం గభీరంగా ఉన్నా సంతోషప్రదమైన దృఢనిశ్చయాన్ని వెల్లడిస్తోంది.

ఇద్దరినీ కూర్చోమని, తానుమాత్రం నిలబడి చేతులుతిప్పుకుంటూ, జుట్టు గీరుకుంటూ జరిగిందంతా- పొలోజోవ్‌ను కలుసుకోవడం, వీస్ బాడెన్‌కి ప్రయాణం తలపెట్టడం. జమీ అమ్మజూపడం; చెప్పాడు. "నాకెంత ఆనందంగా వుందో మీరూహించలేరు" అంటూ ముగించాడు. "రష్యా వెళ్ళక్కరలేకుండానే వ్యవహారాలు చక్కబడే పరిస్థితులు యేర్ప

డ్డాయి. అనుకున్నదానికంటె చాలా ముందుగానే వివాహ ముహూర్తం పెట్టుకోవచ్చు"

"నువ్వు యెప్పుడు వెళ్ళాలి" అని అడిగింది జెమ్మా.

"యివాళే. యింకోగంటలో. నా స్నేహితుడు బగ్గీ కిరాయికి తీసుకున్నాడు. అతనితోకూడా వెళతాను."

"పుత్తరం రాస్తావుగదూ?"

"ఒక్క నిమిషంకూడా ఆలసించను. ఆవిడతో మాట్లాడీ మాట్లాడగానే రాస్తాను."

"ఆమె చాలా భాగ్యవంతురాలు గదూ?" అంది ఫ్రా లెనోరీ.

"ఓ - బోలెడంత ధనంవుంది. ఆమె తండ్రి కోటీశ్వరుడు. అంతా ఆమెకే యిచ్చేశాడు."

"అంతా యిచ్చేసాడా? సరే, అదీ నీఅదృష్టమే. గట్టిగా, తెలివితేటలతో వ్యవహరించు. ఆవేశానికి లోనుగాకు, సాధ్యమైనంత త్వరలో జెమ్మాని వివాహమాడాలని నువ్వు ఆదుర్దా పడడం అర్థం చేసుకోగలను ....కాని ముందు జాగ్రత పడాలి. ఒక్క సంగతి జ్ఞాపకం పెట్టుకో. నీ జమీమీద యెంతయెక్కువ రాబట్టితే మీ యిద్దరికీ, మీ పిల్లలకి అంత యెక్కువ వుంటుంది."

జెమ్మా పక్కకు తిరిగింది. సానిన్ చేతులు ఊపి, "నా విచక్షణాజ్ఞానాన్ని విశ్వసించు, ఫ్రా లెనోరీ! ఆట్టే బేరసారాలు చేస్తూకూచోను. సరయిన ధర చెపుతాను' అంగీకరించిందా సరేసరి, లేదూ ఆవిడ దారి ఆవిడిది నాదారి నాది."

"ఆమెను యెరుగున్నావా?" అని అడిగింది జెమ్మా.

"యెన్నడూ యెలా వుంటుందో చూడనైనా చూడలేదు."

"యెపుడు తిరిగి వస్తావు?"

"వ్యవహారం పరిష్కారం కాదూ, యెల్లుండి తిరిగివచ్చేస్తాను. చక్కబడుతుందీ ఒకటి రెండు రోజులు వుండవలసి వస్తుంది. యేమైనా ఒక్క క్షణంకూడా వృధాపుచ్చను. నా గుండెకాయను యిక్కడి విడిచి పెట్టి వెళుతున్నాను. యిక్కడ నుంచుని మీతో యింత సేపు మాట్లాడుతున్నానేమిటి? బయలుదేరి పెళ్లేలోపున హోటలుకు వెళ్ళాలి.... యేదీ నీ చేయి యిలాయియ్, అదృష్టం పండుతుంది.... రష్యాలో మే మిలానే చేస్తాం"

"కుడిచేయా, యెడమచేయా?"

"యెడమచేయి. అది హృదయానికి దగ్గరగా వుంటుంది. యెల్లుండికల్లా చక్కా వస్తాను. పని తప్పకుండా అయితీరుతుందని అంతరాత్మ చెబుతోంది. శెలవు"

ఫ్రా లెనోరీచుట్టూ చేతులువేసి ఆమెను ముద్దిడుకున్నాడు. చాలా ముఖ్యమైన విషయంచెప్పాలి గదిలోకివెడదామని రమ్మని జెమ్మాను పిలిచాడు....యింతకీ ఆ ముఖ్యమైన విషయమల్లా ఆమెదగ్గర ఒంటరిగా శెలవు తీసుకోవడమే. ఫ్రా లెనోరీ ఈ సంగతి గ్రహించి ఈ ముఖ్య విషయం ఏమిటో తెలుసుకుందామని యత్నించలేదు.

అంతకుపూర్వం సానిన్ ఎన్నడూ జెమ్మాగదిలోకి వెళ్ళలేదు. పవిత్రమైన ఆ గదిగుమ్మం దాటుతూంటే ప్రేమలోని ఇంద్రజాలం, జ్వాల, ఆనందం. మధురభీతి అతని హృదయంలో ప్రజ్వరిల్లి నిండిపోయాయి....ఉద్వేగంతో చుట్టూ చూసాడు. ఆ దివ్యకన్యముందు మోకరిల్లి ఆమెనడుముకు మొహం ఒత్తాడు.

"నువు నావాడవేనా?" అని మెల్లిగా చెవిలో అడిగింది "తొందర్లోనే తిరిగివస్తావుగదూ?"

"నేను నీవాడనే. తప్పకుండా తిరిగివస్తా" అని ఎగఊపిరి తీస్తూ అన్నాడు సానిన్.

"నీకోసం వేచి ఉంటాను. ప్రియతమా?"

కొద్ది నిమిషాల తరవాత సానిన్ హోటలుకు పరుగెత్తుతున్నాడు. పాంటలియోన్ జుట్టు విరయబోసుకుని కేకలు వేస్తూ బెదరిస్తున్నవాడి లాగా చేయి పైకెత్తి దుకాణం గుమ్మందాకా తరుముకురావడం సానిన్ గమనించనేలేదు.

సరిగా పావుతక్కువ ఒంటిగంటకు సానిన్ పొలొజోవ్ ముందు హాజరయాడు, నాలుగు గుర్రాలు పూన్చిన బగ్గీ అప్పటికే వచ్చి హోటలు ముందు ఆగి ఉంది. సానిన్‌ని చూడగానే పొలొజోవ్ "అయితే నిశ్చయం చేసుకున్నావన్నమాట" అని మాత్రం అన్నాడు. హాటు, ఓవరుకోటు. బూట్లు వేసుకుని, ఉష్ణంగా ఉన్నా చెవులలో దూది కుక్కుకుని బయటి పోర్చ్‌లోకి వెళ్లాడు. అతని ఆదేశాలప్రకారం నౌకర్లు అతను కొనిన అసంఖ్యాకమైన వస్తువులను బగ్గీలో పెట్టారు. పోలొజోవ్ కూర్చొనే స్థలంచుట్టూ దిండ్లు, సంచులు మూటలుకుక్కారు, కాళ్ళదగ్గర పెద్దగంపలో భోజనసామగ్రి పెట్టారు ముందుసీటుకు ఒకపెట్టె కట్టారు. ఇలా జాగ్రత్తగా పనిచేసినందుకు నౌకర్లకు బాగా ముట్టజెప్పి దర్వాన్ వెనకనుంచి అతి సున్నితంగా అసరా ఇస్తూంటే బగ్గీలోకి ముక్కుతూ కష్టంమీద ఎగబాకాడు. సీటులో ముడుచుకుని కూర్చుని, సామానంతా సదుపాయంగా చుట్టూ సర్ది చుట్టతీసి వెలిగించాడు, ఆ తరవాత 'నువ్వూ లోపలికివచ్చి కూర్చో' అని చెపుతున్నట్లు సంజ్ఞచేసాడు. సానిన్ బగ్గీ ఎక్కి అతని పక్కనే కూర్చున్నాడు. ఈనాం కావాలంటే జాగ్రత్తగా బగ్గీ తోలమని దర్వాన్‌ద్వారా రౌతులకు చెప్పించాడు. బగ్గీ మెట్లు పటపటమన్నాయి తలుపు దభేలున మూసుకుంది. బగ్గీ ముందుకు సాగిపోయింది.

# 33

ఫ్రాంక్ ఫోర్టునుంచి వీస్‌బాడెన్ రైలుమీద వెళ్ళడానికి ఇపుడు గంటకూడా పట్టదు. కాని ఆరోజులలో వేగంగా పోయే మెయిలుకు మూడుగంటలు పట్టేది. దారిలో గుర్రాలను అయిదుసారులయినా మార్చే వారు.

పొలొజోవ్ నోట్లోచుట్టపెట్టుకుని కునికిపాట్లు పడుతున్నాడో, లేకపోతే సీటులో ఊగుతున్నాడో గాని పల్లెత్తి మాట్లాడలేదు. ఒక్కసారి కూడా కిటికీలోనుంచి బయటికి తొంగిచూడలేదు. ప్రకృతిదృశ్యాలలో అతనికి ఆసక్తిలేదు. ప్రకృతి తనకు విషతుల్యమనే అభిప్రాయంకూడా ప్రకటించాడు సానిన్ మాట్లాడలేదు. ప్రకృతిదృశ్యాలను మెచ్చుకుంటూ కాలం వృథాపుచ్చలేదు, అతని ఆలోచనలు అతనికున్నాయి. ఆలోచనలకు, స్మృతులకు పూర్తిగా లొంగిపోయాడు, ప్రతి మజిలీలోనూ పొలొజోవ్ ఇవ్వవలసినవి ఖచ్చితంగా ఇచ్చేసాడు గడియారం చూసి ప్రయాణం ఎంతసేపు పట్టిందీలెక్క కట్టి, రౌతులకు వారివారి పట్టుదలను పట్టి ఉదారంగా ఈనాము లిచ్చాడు. సగందూరం ప్రయాణంచేసి తరవాత గంపలోనుంచి రెండు నారంజపళ్ళుతీసి, మంచిది తను అట్టే ఉంచుకుని రెండోది సానిన్‌కి ఇచ్చాడు. సానిన్ అతనివంక ఎగాదిగా చూసి నవ్వాడు.

"యెందుకు నవ్వుతున్నావు" అని అడిగాడు పొలొజోవ్ తెల్లటి పొట్టివేళ్ళ గోళ్ళతో నారింజపండు ఒలుస్తూ.

"నేనా?" అని జవాబిచ్చాడు సానిన్. "మన యీ ప్రయాణానికి నవ్వుతున్నాను."

"మనప్రయాణానికేం ? " అని అడిగాడు పొలొజోవ్ అర్ధచంద్రాకారంగా ఉన్న నారింజ తొనను నోట్లో కుక్కుకుంటూ.

"అంతా చిత్రంగావుంది. నిన్న నిన్న తలుచుకొనేలేదు. యివాళ నీపక్క ప్రయాణం చేస్తున్నాను. నీ భార్యని గురించి నిన్నటి దాకా నీకేమీ తెలియదు. యివాళ ఆమెకు నా జమీ అమ్మాలని బయలు దేరాను. "

" యే ఘడియకేం జరుగుతుంతో చెప్ప లేం" అన్నాడు పొలొజోవ్. "యింకా స్త పెద్దవాడవయితే నీ కేదీ ఆశ్చర్యం గొలపదు. వుదాహరణకు : నేను తయినాతీ ఆఫీసరుగా గుర్రంఎక్కి తిరగడం వూహించుకోగలవా? కాని తయినాతీ ఆఫీసరుగా పనిచేసాను. గ్రాండు డ్యూకు మైఖేల్ పావ్లోవిచ్ 'ఆ బొండాంని తొందరగా కదం తొక్కించేట్టు చేయండి' అని ఆజ్ఞాపించాడు."

సానిన్ తల వెనక గోక్కున్నాడు.

"యిపోలిట్ సిడోరిచ్ ! నీ భార్య యెలావుంటుంది ? తత్వం యెటువంటిది ? చెప్పు. తెలుసుకోవలసిన అవసరం వుంది."

"తొందరగా కదం తొక్కించమని ఆజ్ఞాపించడం తేలికే." అన్నాడు పొలొజోవ్ హఠాత్తుగా ఉగ్రుడై పోయి. "కాని నా సంగతేమిటి ? నేను అనుకున్నాను, 'యీ పదవి, యీ భుజకీర్తులు యెందుకు తగలెయ్యను' అని. నా కవేం అక్కర్లేదు, సరే, యిక నా భార్యసంగతి అందరి లాంటిదే. ఆమె చూస్తుండగా మాత్రం కునికిపాట్లు పడకు. సహించలేదు. యేదోవకటిఆమెతో మాట్లాడుతుండాలి అదీ ముఖ్యం.... నవ్వొచ్చే దేదైనా చెప్పాలి. నీ ప్రేమ, అటువంటి విషయాలు చెప్పు.... వుల్లాసం కలిగేటట్లు చెప్పు."

"వుల్లాసం !"

"ఆఁ-అవును. నువు యెవరినో ప్రేమించాననీ పెళ్ళాడబోతున్నాననీ చెప్పావుకదూ ? ఆ విషయమంతా ఆమెకు చెప్పు."

సానిన్‌కి కోపం వచ్చింది.

"అందులో పెద్ద వుల్లాసం యేముంది ?"

పొలొజోవ్ గుడ్లు తిప్పి ఊరుకున్నాడు. నారింజరసం గడ్డంమీద కారింది.

"సామాను కొనడానికి నిన్ను నీ భార్యే ఫ్రాంక్‌ఫోర్టు పంపిందా?" అని అడిగాడు సానిన్ కొద్దిసేపు విరామం తరవాత.

"అవును"

"యేం కొన్నావు ?"

"ఆటవస్తువులు. నీకు తెలీదూ ?"

"ఆటవస్తువులా ? పిల్లలున్నారా యేం ?"

పొలొజోవ్ సానిన్ నుంచి బాగా దూరంగా జరిగాడు.

"యేమిటి ? పిల్లలెందుకు ? యెవో ఆడవాళ్ళ వస్తువులు. చిల్లర సరుకు-అలంకార వస్తువులు. నీకు తెలీదా ?"

"అటువంటివి కూడా నీకు తెలుసా ?"

"ఆc-"

"నీ భార్య వ్యవహారాలతో నీకేం సంబంధంలేదని చెప్పావుగా?"

"యితర వ్యవహారాల సంగతి నేను చెప్పింది. యిది పరవాలేదు. యేపనీ లేదుకాబట్టి సరుకులు కొంటాను. నా అభిరుచిలో నా భార్యకి నమ్మకం వుంది. బేరమాడడంలో మొనగాడిని."

పొలొజోవ్ మాటలు తడబడసాగాయి. పాపం! అలసి పోయాడు.

"నీ భార్య బాగా భాగ్యవంతురాలేనా ?"

"భాగ్యవంతురాలే. కాని డబ్బు తనదగ్గిరే వుంచుకుంటుంది."

"నాకు తెలిసినంతవరకు నీకేలోటూ లేదు."

"నేను ఆమె భర్తని. అవకాశాలను యెందుకు వదులుకోవాలి ? నేనామె కెంతో వుపయోగపడుతున్నాను. నేనామెకు బంగారపు పిచ్చుకను, చాలా అనుకూలమైన భర్తను."

పొలొజోవ్ పట్టుజేబురుమాలుతో మొహం తుడుచుకొని బిగ్గరగా బుసకొట్టాడు."నాయందు దయయుంచు యికమాట్లాడించకు.మాటాడడం యెంత కష్టంగావుందో చూడు." అంటూన్నట్టుంది అతని వాలకం.

సానిన్ అతనిజోలికి పోకుండా మళ్ళీ ఆలోచనలో పడ్డాడు.

---

బగ్గీ వీస్‌బాడెన్‌లో చిన్న రాజమందిరంలాగా ఉన్న ఒక హోటలు ముందు ఆగింది. తక్షణమే ఆ హోటలులో గంటలు గణగణామోగాయి. గందరగోళం, దుర్భాషలు వినవచ్చాయి. నల్లటి తోకహాటులు ధరించి గౌరవనీయులుగా కనిపించే కొందరు వ్యక్తులు సింహద్వారంలో మూగారు. ధగధగలాడే బంగారపుచాయ గిరజాలజుట్టు దర్వాన్ దర్జాగా బగ్గీతలుపు తీసాడు.

విజయం సాధించి వచ్చిన వీరుడిలాగా పొలొజోవ్ బగ్గీలోనుంచి దిగి తివాసీలు పరిచిన మెట్లు ఎక్కాడు, సువాసన గుమ్మని కొడుతోంది. దర్వాన్ లాగానే మంచిదుస్తులు ధరించి ఒక వ్యక్తి పొలొజోవ్‌ను కలుసుకోవడానికి ఉరుక్కుంటూ వచ్చాడు. ఆ వ్యక్తి మొహం రష్యా దేశస్తుని మొహంలా ఉంది. అతను పొలొజోవ్ నౌకరు "మొన్న రాత్రల్లా వేడినీళ్ళు లేకుండానే ఫ్రాంక్‌ఫోర్టులో గడపవలసి వచ్చింది. అందుచేత యికనుంచి ఎపుడూ నిన్నుకూడా తీసుకువెళతాను" అని చెప్పాడు పొలొజోవ్. నౌకరు మొహంలో భయం ద్యోతకమైంది. యజమాని బూట్లు ఊడదీయడానికి ఆదుర్దాగా ముందుకు వంగాడు.

"మేర్యా నికొలయెవ్నా లోపల వుందా?" అని పొలొజోవ్ ప్రశ్నించాడు.

"వున్నారు. దుస్తులు ధరిస్తున్నారు, లసున్స్కయా జమీందారిణితో కలిసి భోజనం చేయడానికి వెళుతున్నారు."

"ఓ. ఆవిడా! ఒక్కనిమిషం ఆగు. బగ్గీలో సామాను వుంది. నువ్వే స్వయంగాతీసి పైకితీసుకురా. యిక డిమిట్రీ పావ్లోవిచ్, నువు

గదితీసుకుని ముప్పావుగంటలో నాదగ్గిరికిరా. యిద్దరం కలసి భోజనం చేదాం."

పొలొజోవ్ ఊగుతూ వెళ్ళిపోయాడు. సానిన్ చవకబారు గది తీసుకుని స్నానంచేసి దుస్తులు వేసుకుని కాసేపు విశ్రాంతి తీసుకున్న తరవాత పొలొజోవ్ జమిందారు ఆక్రమించుకున్న విశాలమైన గదిలోకి వెళ్ళాడు. ఆ కచేరీగదిమధ్యన సొగసైన మొఖమలు పడకకుర్చీలో కూర్చుని 'జమీందారు' కనిపించాడు. పొలొజోవ్ స్నానంచేసి పట్టుగౌను ధరించాడు. తలమీద కెంపురంగు బొచ్చు టోపీ ఉంది. సానిన్ అతని దగ్గరికి వెళ్ళి పరీక్షగా చూస్తూ కొన్ని నిమిషాలపాటు నిలబడ్డాడు. పొలొజోవ్ రాతిబొమ్మలాగా కదలకుండా కూర్చున్నాడు సాలన్‌కేసి తలతిప్పి చూడలేదు. కనుబొమలు పైకెత్తలేదు. ఒక్కమాటకూడా మాట్లాడలేదు. నిజానికి రాజఠీవి ఒలకించాడు! ఒకటి రెండు నిమిషాలు తేరిపారజూచి ఈ పవిత్ర నిశ్శబ్దతను భగ్నపర్చడానికి ఎదైనా మాట్లాడదామని సానిన్ అనుకుంటుంటే హఠాత్తుగా పక్కగది తలుపు తెరుచుకుంది. మంచి యవ్వనంలో ఉన్న ఒక సుందరాంగి నల్లటి లేసు అంచుల దుస్తులు ధరించి చేతి వేళ్ళకు, మెడకు రవ్వలు పెట్టుకుని గుమ్మంలో ప్రత్యక్షమైంది. ఆమెయే మేర్యా నికొలయెవ్నా పొలొజోవ్! మహా సొగసైన బాదంరంగు జుట్టు జడవేసుకుంది. కాని ఇంకా చుట్టచుట్టుకోలేదు.

# 34

"ఓ- క్షమించండి" అంది మందహాసంచేస్తూ. ఆమందహాసంలో కొంత కలవరపాటు, కొంత అవహేళన పొడగట్టింది. ఒక జడకొప్పపైకెత్తి సానిన్‌మీద కాంతివంతమైన పెద్దపెద్ద బూడిదరంగు కళ్ళు సారించింది. "మీరు యిక్కడ వున్నారని అనుకోలేదు" అంది.

"ఇతను నా బాల్యస్నేహితుడు. పేరు సానిన్ డిమ త్రీపాన్లోవిచ్." అన్నాడు పొలొజోవ్ తల తిప్పకుండా లేచి నిలబడకుండా సానిన్‌వైపు చేతితో చూపిస్తూ.

"అవును, నాకు తెలుసు, నువు చెప్పావుగా. మీ దర్శనమైనందుకు మహదానందమైంది. యిప్పొలిట్ సిదోరిచ్ మిమ్మల్ని ఒకటి అడుగుదామనుకుంటున్నా. నాదాసీది వట్టి మందమతి .... "

"జుట్టు ...."

"అవును, క్షమించండి" అంది మేర్యా నికొలయెవ్నా ఇదివరకులాగానే మందహాసం చేస్తూ, సానిన్‌వంక తల పంకిస్తూ గిర్రున తిరిగి గుమ్మంలోనుంచి లోనికి చక్కాబోయింది. దివ్యమైన మెడ, అద్భుతమైన బుజాలు, నడుము వారి హృదయాలలో లలితంగా ముద్రపడ్డాయి.

పొలొజోవ్ లేచి, భారంగా ఊగిసలాడుతూ అదేగుమ్మం గుండా లోపలకు వెళ్ళాడు.

తను కచేరీ గదిలో ఉన్నాననే సంగతి ఆమెకు ముందుగానే తెలుసుననీ, అందమైన జుట్టు చూపెట్టడానికే ఆమె వచ్చిందనీ సానిన్ గ్రహించాడు. మదాం పొలొజోవ్ ఈయుక్తి పన్నినందుకు సానిన్ మనసులో సంతోషించాడు. 'నామెప్పు పొందాలని ఆమె తలచిందంటే,

నాముందు తనజుట్టు అందం ప్రదర్శించాలని చూసిందంటే, జమీ ధర విషయంలో 'పేచీపెట్టదు' అనుకున్నాడు సానిన్. అతని మనసు జెమ్మా మీది ప్రేమతో పూర్తిగా నిండిపోయిందేమో ఇక ఏ స్త్రీ అన్నా అతనికి లక్ష్యంలేదు. వారిని గమనించడంలేదు. ఈ తడవకూడా, "నేను విన్నది నిజమే. యీామె బహు చక్కనిది." అనుకుని సంతృప్తి పడ్డాడు.

అతనే గనక ఇపుడున్నంత ఆవేగంతో లేకపోయినట్లయితే తన భావాన్ని ఇంకోవిధంగా వ్యక్తీకరించేవాడే. మేర్యా నికొాల యెవ్నా ఉరుఫ్ కొాల్యాష్కినా ఆకర్షణీయమైన వ్యక్తి. ఈ ఆకర్షణ ఆమె అందగత్తె అవడంవల్ల వచ్చిందిగాదు, ఆమె సామాన్య కుటుంబంలో పుట్టిందని మొహం చూస్తే స్పష్టంగా తెలుస్తుంది. నుదురు చిన్నది, బొద్దుముక్కు, చివరపైకి తిరిగింది. చర్మం సున్నితమైంది కాదు, కాళ్ళు చేతులలో లాలిత్యం లేదు. అయితేనేం? ఎదురుపడ్డవాడల్లా చట్టున ఆగిపోతాడు. అలా ఆగిపోడానికి కారణం పుష్కిన్ అన్నట్లు'సౌందర్యనిలయం'కాదు. ఆమెలోని స్త్రీత్వమే, జిప్సీ రష్యన్ రక్తాల కలయికవల్ల జనించిన తీవ్రమైన స్త్రీత్వమే బుద్ధిపూర్వకంగా ఆగిపోవడానికి కారణం.

పూర్వకవులు కీర్తించిన 'మూడు కవచాల' లాగానే జెమ్మా రూపం అతనిని రక్షించింది.

పదినిమిషాల తరవాత మేర్యా నికొాలయెవ్నా భర్తను వెంటబెట్టుకుని మళ్ళీవచ్చి సానిన్ దగ్గరకు వెళ్ళింది. పూర్వకాలంలో ఎందరో యువకులకు వెర్రెత్తించిన ఆకర్షణ ఆమె నడకలో ఉంది. 'జీవిత సౌఖ్యాన్ని సమకూరుస్తున్నట్టుగా వుంది ఆమె నడక' అన్నాడు అలా వెర్రెత్తిన ఒకవ్యక్తి అలా సానిన్ దగ్గరకువచ్చి, చేయిజాపి, బుజ్జగింపు, లజ్జ వ్యక్తీకరించే గొంతుతో రష్యన్ భాషలో "నేను తిరిగి వచ్చేవరకూ వుంటావుగదూ? తొందరగానే వచ్చేస్తాను" అంది.

సానిన్ మర్యాదగా వంగి నమస్కరించాడు. గాని మేర్యా నికొాల యెవ్నా వెనక వెనకకు తిరిగిచూస్తూ, మందహాసం చేస్తూ, వెనకటి భావ ముద్రనే వారిపైవేస్తూ వెళ్ళిపోయింది.

ఆమె మందహాసంచేస్తుంటే ఒకటిగాదు, బుగ్గలకు రెండుగాదు మూడు సొట్టలు పడేవి. పెదవులమీదకంటె కళ్ళల్లో ఎక్కువ చిరునవ్వు తారా డేది. ఆమెపెదవులు పొడుగ్గా, కెంపువర్ణంగా, మధురంగా ఉండేవి. ఎడమవైపు మూల రెండు చిన్నచిన్న పుట్టుమచ్చలు।

పొలొజొవ్ తిరిగి గదిలోకి ఊగుకుంటూ వచ్చి పడక కుర్చీలో కూలబడ్డాడు. వెనకటిలాగానే మాట్లాడలేదు కాని మధ్యమధ్య విచిత్ర మైన చిరునవ్వు మెసలుతూ అకాలంగా ముడుతపడ్డ చెంపలను కుదుపు తోంది.

సానిన్‌కంటె మూడేళ్ళే పెద్దఅయినా చాలా పెద్దవాడి లా కనిపిస్తు న్నాడు.

పొలొజోవ్ సానిన్‌కు చేసిన విందుకు ఎంతటి రసజ్ఞుడైనా సంతృప్తి చెందేవాడే గాని సానిన్‌కిమాత్రం అంతులేనిదిగా, భరించలేని బాధాకరంగా తోచింది. 'భావయుక్తంగా, అభిప్రాయం గ్రహించి, తగిన తగినచోట ఒత్తి' చదవవలెనని పెద్దలు చెప్పినట్లే పొలొజోవ్ పళ్లెం ముందుకు వంగి ప్రతిదీ వాసనచూసి మెల్లిగా తినసాగాడు. తాగేముందు సారాతో పుక్కిలించిపోసి తరవాత చప్పరించేవాడు....కాని వేపుడు తీసు కుని రాగా హఠాత్తుగా మాట్లాడడం ప్రారంభించాడు. దేనినిగురించి? గొర్రెలను గురించి. ఒక మందమందా కొనాలని తలచాడు, వాటిని గురించి వివరంగా, మృదువుగా నీచోపమానాలతో మాట్లాడాడు. ఉడు కుడుకు కాఫీ ఒక కప్పు తాగాడు, (నిన్న బాగా చల్లారిపోయి జివ్వుమనే కాఫీ యిచ్చావని కన్నీళ్ళు పెట్టుకుంటూ వెయిటరుమీద మండిపడ్డాడు) హవానాచుట్టను పచ్చటి వంకరటింకర పళ్ళతో కొరికి అలవాటు చొప్పున కునుకు తీయసాగాడు. పొలొజోవ్ నిద్రపోతున్నందుకు సంతోషిస్తూ సానిన్ గదిలో పచార్లు చేయసాగాడు. మందపాటి తివాచీలు అతని కాళ్ళకి చుట్టుకోసాగాయి. జెమ్మాతో భావి జీవితాన్ని గురించీ, ఆమెకు తీసుకువెళ్లే వార్తలు గురించీ కలలు కనసాగాడు. కాని పొలొజోవ్ మామూలుకన్న పెందలాడే మేలుకొన్నాడు. గంటన్నర నిద్రపోయాడు. మంచుగడ్డ వేసిన గ్లాసుడు ధాతుజలం తాగాడు, నౌకరు కీవ్‌లో తయా

రైన ఆకుపచ్చని జాడీలో తెచ్చిన ఆసవం ఏడెనిమిది. చెంచాలు పుచ్చుకుని అదే తనకు జీవితాధారమని చెప్పాడు. ఉబ్బెత్తు కనురెప్పలు ఎత్తి సానిన్‌మీద దృష్టి సారించాడు. డురాకీ (ప్రాచీనమైన పేకాట) ఆడమని ఆహ్వానించాడు, సానిన్ నిండు సంతోషంతో ఆడడానికి అంగీకరించాడు. లేకపోతే గొర్రెపిల్లలను గురించి, గొర్రెలను గురించీ మాట్లాడుతూ ఎక్కడ చంపుకుతింటాతో అని సానిన్‌కి భయం వేసింది. ఇద్దరూ కచేరీగదిలోకి వెళ్లారు. వెయిటరు చీట్లపేక తెచ్చి ఇచ్చాడు. ఆట ప్రారంభమైంది. కాని డబ్బుపెట్టి మాత్రం ఆడడానికి వారు పూనుకోలేదు.

లాసున్‌స్కాయా జమీందారిణిని సందర్శించి మేర్యా నికొలెవ్నా తిరిగి వచ్చి వారిద్దరూ పేకాడడం చూసింది.

పేకకేసి పేక పలకకేసి చూసి పక్కున నవ్వింది. సానిన్ ఆసనంలోనుంచి దిగ్గున లేచాడు. గాని ఆమె "ఆడుతూండండి, నేను దుస్తులు మార్చుకుని వస్తాను" అంటూ వారించింది, దుస్తులు గరగరలాడించుకుంటూ వెళుతూ చేతితొడుగులు తీసి వేసుకుంది,

నిజంగానే ఆమె తొందరగానే తిరిగి వచ్చింది. రక్తవర్ణపు వదులుపాటి గౌను వేసుకుంది. చేతులు వేలాడుతున్నాయి. నడుము లావుపాటి తాడుతో బిగించుకుంది. భర్తపక్కన కూర్చుని 'లడ్డూ' అంటూ వేళాకోళం పట్టించింది. ('లడ్డూ' అనే మాట వినిపించేసరికి సానిన్ ఆశ్చర్యంతో ఆమెకేసి చూసాడు. ఆమె ఉల్లాసంగా ధైర్యంగా అతని కనులలోకి చూసి బుగ్గసొట్టలు బాగా కనిపించేటట్టు మందహాసం చేసింది). "సరే నీకు నిద్ర వస్తున్నట్లుంది నాచేయి ముద్దిడుకొని వెళ్ళి పడుకో. నేనూ, మాన్షియర్ సానిన్ కాసేపు మాట్లాడుకుంటాం" అంది.

"నాకు నిద్ర రావడంలేదు" అంటూ దీర్ఘాలు తీసాడు పొలొజోవ్ భారంగా కుర్చీలోనుంచి లేస్తూ "కాని వెళ్ళిపొమ్మంటే పొళ్ళిపోతాను. నీచేయి ముద్దిడుకుంటాను."

సానిన్‌వంక మందహాసంతో తేరిపారజూస్తూ భర్తకేసి చేయి జాపింది. పొలొజోవ్‌కూడా అతనివంక తేరిపార జూసి సెలవు పుచ్చుకోకుండానే వెళ్ళిపోయాడు.

''సరే. ఆవిషయమంతా చెప్పు'' అంది మేర్యా నికొలయెవ్నా మేజామీద మోచేతిని ఆనించి అసహనంతో ఒక చేతి వేళ్ళగోరులమీద రెండో చేతివాటితో కొట్టుకుంటూ ''నువు పెళ్ళి చేసుకొబోతున్నావట. నిజమేనా ?''

అలా మాట్లాడుతూ సానిన్ కళ్ళవంక నిలకడగా పరీక్షగా దృష్టి పరపడానికి వీలుగా మేర్యా నికొలయెవ్నా ఒక పక్కకు తల వంచింది.

# 35

మదాం పొలొజోవ్ ఇంత చనువుగా మెలగడంవల్ల సానిన్ కల వరపడేవాడే, కాని ఇలాంటివి అతనికి కొత్తకాదు. రకరకాల మనుష్యులతోను భుజంభుజం రాసుకుని తిరిగాడు. స్వేచ్ఛగా, చనువుగా ప్రవర్తించడం తన వ్యవహారాలకు శుభశకునమని భావించాడు. "యీ భాగ్యవంతురాలి చాపల్యానికి తలొగ్గుదాం." అని నిశ్చయించుకుని ఆమె ప్రశ్నించినంత చలాకీగాను సమాధాన మీయసాగాడు. "అవును పెళ్ళి చేసుకోబోతున్నాను."

"యెవరిని ? యెవరయినా విదేశస్తురాలినా ?"

"అవును."

''ఆమెతో చాలాకాలంనుంచి పరిచయం వుందా ? లేదనుకుంటాను. ఫ్రాంక్‌ఫోర్టులోనే ఆమెని కలుసుకున్నావా ?''

''అవును,"

"యెవరామె ? అడగవచ్చా."

"ఓ-దివ్యంగా. ఒక రొాట్టెల వ ర్తకుని కూతురు."

మేర్యా నికొాలయెవ్నా కళ్ళు బార్లాతెరిచి కనుబొామలు పైకిఎ త్తింది.

"బలే." అంది మెల్లగా. "అద్భుతం! నీలాటి యువకు లెవరూ వుండరనే అనుకుంటున్నాను. రొాట్టెల వ ర్తకుని కూతురు?"

"యిది నీకు ఆశ్చర్యం గొాలుపుతున్నట్టుంది" అన్నాడు సానిన్ హుందాగా. "కాని నాకు పక్షపాతబుద్ధి లేదు...."

"నాకేమాత్రం ఆశ్చర్యం గొాలపడం లేదు" అంది మేర్యా నికొాలయెవా అడ్డుపస్తూ. "నాకూ పక్షపాతబుద్ధి లేదు. నేను రైతుబిడ్డను. ప్రేమించడానికి భయపడని యువకుని కలుసుకోవడం నాకు ఆశ్చర్యం, సంతోషం కలిగించింది. నీవామెను ప్రేమిస్తున్నావు గదూ?"

"అవును."

"ఆమె చాలా-చాలా అందమైందా?"

ఈ ప్రశ్నకు సానిన్ కొద్దిగా ఆశ్చర్యపోయాడు....కాని ఇక వెన కడుగు వేయడానికి వీలులేదు.

"ప్రతిప్రియుడు తన ప్రేయసి లాంటిది లేదని భావించుకుంటాడనే సంగతి నీకు తెలిసిందేగా, మేర్యా నికొాలయెవ్నా! కాని నా వధువు నిజంగా అందమైంది!"

"నిజం! ఆ కృతి యెలావుంటుంది? యిటాలియనా?

"అవును. శిల్పి చెక్కినట్టుంటుంది"

"ఆమెచిత్రం నీదగ్గిర వుందా?"

"ఉహుం-లేదు. (ఆ రోజులలో ఇంకా ఛాయాచిత్రాలు అమలులోనికి రాలేదు. ఒకవిధమైన చిత్రాలు ప్రజాదరణ పొాందుతున్నాయి.)

"ఆమె పేరేమిటి?"

"ఆమె పేరు-జెమ్మా."

"నీపేరు?"

"డిమిత్రీ."
"నీ యింటిపేరు"
"పావ్లోవిచ్."
"అయితే విను" అంది మేర్యానికొలయెవ్నా అంతకు ముందు లాగానే మెల్లగా. "నువంటే నాకు ప్రీతి యేర్పడింది, డిమిత్రీ పావ్లొవిచ్! నువు మంచివాడవనే నా నమ్మకం. యేదీ, నీచేయి యిలా యియ్యి మనిద్దరం యిక స్నేహంగా వుందాం."
అందమైన తెల్లటి గట్టివేళ్ళతో గట్టిగా అతనిచేయి ఒత్తింది. ఆమెచేయి అతని చేతికంటె చాలా చిన్నది. గాని ఎక్కువ వెచ్చగా, నున్నగా, మెత్తగా శక్తివంతంగా ఉంది.
"యిపుడు నా మనసులోకి యే ఆలోచన వచ్చిందో చెప్పుకో చూద్దాం"
"యే ఆలోచన వచ్చింది ?"
కోపగించుకోవుగా ? ప్రధానమైందన్నావు. కాని నిజంగా.... తప్పనిసరిగా చేసుకోవలసిందేనా ?"
సానిన్ మొహం ముడుచుకుని "నాకేం అర్థం కావడంలేదు, మేర్యా నికొలయెవ్నా ?" అన్నాడు.
మేర్యా నికొలయెవ్నా చెంపలమీదకు వచ్చిపడ్డ జుట్టుతలఊపుతో వెనకకు విసిరివేసుకుని నెమ్మదిగా నవ్వింది, "ప్రేమికుడు, నిజంగా ప్రేమికుడు" అని గొణిగింది ఆలోచనాపూర్వకంగా, పరధ్యానంగా. "యోధుడు ? యిక వేరే యోధులు లేరంటే నమ్మాలిసిందే."
మేర్యా నికొలయెవ్నా రష్యన్‌లాగా, నిజమైన మాస్కో వాసిలాగా ఉచ్చరించింది. మాట్లాడింది. గొప్పవంశీకుల బిడ్డలా కాకుండా సామాన్య జమానవుని బిడ్డలా మాట్లాడింది,
"బహుశా నువు పూర్వకాలపు చాదస్తపు కుటుంబంలో, దేవుడంటే భయపడే కుటుంబంలో పుట్టి పెరిగి వుంటావు, రష్యాలో యే ప్రాంతపువాడివి ?"

''టూలా రాష్ట్రానికి చెందినవాడిని."

''అలాఅయితే మనిద్దరం ఒకప్రాంతంవాళ్ళమే. మానాన్న.... మానాన్న యెవరో నీకు తెలుసునా ?"

''ఆఁ-తెలుసు,"

''ఆయన టూలాలోనే పుట్టాడు ...టులా మనిషి. సరే, సరే...." (మేర్యా నికొలయెవ్నా ఈ మాటలు బుద్ధిపూర్వకంగానే మధ్యతరగతి ప్రజలమాదిరిగానే ఉచ్చరించింది) "సరే. యిక మన వ్యవహారం విషయం మాట్లాడుకుందాం."

"యేమిటీ?....వ్యవహారం మాట్లాడుకోవడం? యిలా అనడంలో నీ వుద్దేశమేమిటి ?"

మేర్యా నికొలయెవ్నా కళ్ళు కుంచించుకుంది. "అయితే నువి క్కడికి కెందుకువచ్చావు ?" (ఆమె కళ్ళు కుంచించు కున్నపుడు వాటిలో దయాదాక్షిణ్యాలు, అవహేళన ద్యోతకమవుతాయి. కళ్ళు బాగావిప్పితే కాంతివంతమైన వాటి అగాధాలలో కాఠిన్యం, దౌష్ట్యం వ్యక్తమవుతాయి. బొద్దుగా, అర్ధచంద్రాకారంగా, నల్లగాఉండే కనుబొమలు ఆమె కళ్ళకి ప్రత్యేకమైన అందాన్ని కలుగజేస్తున్నాయి.) "నీ జమీ నేను కొనాలని కదూ నీ కోరిక ? పెళ్ళిచేసుకోవడానికి నీకు డబ్బుకావాలి. నిజమేనా ?"

"అవును"

"పెద్దమొత్తం కావాలా ?"

"ముందుగా కొన్నివేల ఫ్రాంకులుయిస్తే చాలు. నా జమీ సంగతి నీ భర్తకి తెలుసు. ఆయనతో సంప్రతించు. నేనేం పెద్దధర చెప్పడం లేదు."

మేర్యా నికొలయెవ్నా ఎడమవైపునుంచి కుడివైపుకి మెల్లగా తల తిప్పింది. "మొదటివిషయం" అంటూ ప్రారంభించింది, ఒకొక్క అక్ష రం విడివిడిగా ఉచ్చరిస్తూ, చేతివేళ్ళ కొనలతో సానిన్ కోటు చేతిమీద కొడుతూ. "దస్తుల విషయంలో తప్ప యింకే విషయంలోనూ నా

భర్తతో సంప్రతించే అలవాటు నాకు లేదు. దుస్తులు విషయంలో ఆయనకు బాగా తెలుసు: యిక రెండోవిషయం. తక్కువధరకి యిస్తా నంటావెందుకు ? ప్రస్తుతం నువు ప్రేమలోపడి యెంత త్యాగానికైనా సిద్ధంగా వుండడం నేను అదనుగా తీసుకోను....త్యాగాలు అంగీకరించను. యేమిటీ ? సహజోద్రేకాలను ప్రోత్సహించడం బోయి. చర్మం వొలిచేయడమా ? అది నాకు అలవాటులేదు. సమయం వస్తే నాకు దయాదాక్షిణ్యాలుండవు, కాని ఆ సందర్భం వేరు."

ఆమె తనను అవహేళన చేస్తున్నదో చిత్తశుద్ధిగానే మాట్లాడుతుందో సానిన్‌కి అర్థంకాలేదు. కాని తనలో తాను, "నీ విషయంలో జాగ్రత్తగా వుండాలి" అని అనుకోసాగాడు.

ఒక మగ నౌకరు రష్యన్ టీపాయి, టీ సామగ్రి, మీగడ రస్కులు మొదలగునవి పెద్ద పళ్ళెంలో పెట్టుకుని తెచ్చి సానిన్, మదాం పొలోజోవ్‌లకు మధ్యనున్న మేజామీద పెట్టి చక్కాబోయాడు.

ఆమె అతనికి ఒక కప్పు టీ పోసి, "చేత్తో వేస్తున్నానని యేమీ అనుకోకేం" అంటూ మేజామీద ఆమె పక్కనే చెంచాలున్నా అతని కప్పులో వేళ్ళతో ఇంత పంచదార వేసింది.

"అబ్బే, అబ్బే !....అంత అందమైన వేళ్ళతో...."

వాక్యం పూర్తికాలేదు. టీ మొదటిగుక్క తాగి ఉక్కిరిబిక్కిరయాడు. ఆమె అతనికేసి నిర్మలంగా, స్థిరంగా చూసింది।

"నా జమీధర తక్కువ చెప్పాననంటే, నువు విదేశాలలోవుండడం వల్ల డబ్బు సర్దుబాటు చేయలేవనే వుద్దేశంతోనే. అంతేగాకుండా, కొనడంకూడా అసాధారణమేనని నేను గుర్తించాను. యిదంతా ఆలోచించక తప్పిందికాదు."

సానిన్ ఇలా తన వాదనను కొనసాగిస్తూనే ఉన్నాడు. మేర్యా నికొలయెవ్నా పడక కుర్చీలో వెనకకు ఆనుకుని చేతులు ముడుచుకుని ప్రశాంతంగా కూచుని, అతని మొహంవంక నిర్మలంగా, స్థిరంగా దృష్టి నిలిపింది.

"పరవాలేదు, కానీ, కానీ" అంది అతనికి వత్తాసు ఇస్తున్నట్టు. "వింటున్నాను, వింటున్నాను. కానీ."

సానిన్ తన జమీనిగురించి వర్ణించి చెప్పసాగాడు. ఎన్ని ఎకరాలు ఉన్నదీ, సరిగ్గా ఎక్కడున్నదీ, అందులోని ఏ ఏ ఆర్థిక వనరులు ఉన్నవీ. ఎంత రాబడి తీయగలిగేదీ వివరించాడు.... ఇంటి ఉనికి, ఆ ఉనికిలోని రమణీయత తెలియ జేశాడు. మేర్యా నికొలయెవ్నా అంత సేపూ అతనికేసి ఇంకా ఆపేక్షతో, ఇంకా విలాసంగా చూసింది. పెదవులు కొద్దిగా కదిలాడాయి గాని వాటిమీది చిరునవ్వు నెలకొనలేదు, కిందిపెదవి కొరుక్కుంది. అతనూ ఇరకాటంలోపడి మళ్ళీ మాట్లాడడం మానివేసాడు,

"డిమిట్రీ పావ్లోవిచ్" అంటూ ప్రారంభించి ఆలోచనకోసం కొంచెం ఆగింది, "డిమిట్రీ పావ్లోవిచ్! " అంటూ మళ్ళీ ప్రారంభించింది. "నీ జమీ కొనడం నాకు లాభదాయకమని గట్టినమ్మకం కుదిరింది. యేదోవిధంగా ఒక పరిష్కారానికి రాగలమనే తోస్తోంది. అయితే నాకు రెండు రోజుల వ్యవది కావాలి, రెండు రోజులపాటు నీ వధువును వదిలి వుండలేవా? నీ కిష్టంలేకపోతే యింతకంటెయెక్కువ రోజులు నిన్ను అట్టేపెట్టను. మాట యిస్తున్నాగా. నీకిపుడు అయిదారు వేల ఫ్రాంకులు కావలసివుంటే మహా సంతోషంతో అప్పుగా యిస్తాను. తర్వాత మనం సర్దుబాటు చేసుకోవచ్చు. "

సానిన్ లేచాడు. "కృతజ్ఞుణ్ణి, మేర్యా నికొలయెవ్నా! అపరిచితుడనైన నాకు దయతో సహాయం చేయడానికి సిద్ధపడినందుకు కృతజ్ఞుణ్ణి. వ్యవధి తప్పనిసరి అయితే, నా జమీ విషయంలో నీ నిర్ణయం కోసం రెండురోజులు వేచివుంటాను. "

"వ్యవధి అవసరం, డిమిట్రీ పావ్లోవిచ్! యెక్కువ బాధాకరంగా వుంటుందా? చెప్పు, చెప్పు. "

"నా వధువును యెంతగానో ప్రేమిస్తున్నాను; మేర్యా నికొలయెవ్నా! యెడబాటు భరించడం తేలికకాదు. "

"నువు అద్భుతమైనవాడివి" అంటూ మేర్యా నికొలయెవ్నా నిట్టూర్చింది. "యెక్కువకాలం వేచివుండేటట్టు చేయనులే. యిక నువు వెళ్లాలా? "

"చాలా పొద్దుపోయింది" అన్నాడు సానిన్.

"ప్రయాణంచేసి, నా భర్తతో పేకాడి అలసిపోయావా. విశ్రాంతి అవసరం. సరేగాని నా భర్తా నువూ ప్రాణస్నేహితులా? "

"యిద్దరం ఒకబడిలో చదువుకున్నాం. "

"అపుడుకూడా యింతేనా? "

"యింతేనా అంటే? " అని అడిగాడు సానిన్.

మేర్యా నికొలయెవ్నా హఠాత్తుగా నవ్వింది. మొహం కంది పోయేవరకూ నవ్వింది. పెదవులకు అడ్డంగా జేబురుమాలు పెట్టుకుని కుర్చీలోనుంచి లేచి, అలసిపోయినదానిలాగా ఊగిసలాడుతూ సానిన్ దగ్గరకువెళ్ళి చేయి సాచింది.

అతను వంగి నమస్కరించి గుమ్మంవైపుకు వెళ్లాడు.

"రేపు వుదయం పెందరాళే యిక్కడికి రా, వినిపించిందా? " అంది వెనకాలనుంచి. గదిలోనుంచి బయటికి వెళుతూ అతను వెనకకు తిరిగి చూసాడు. చేతులు తలవెనక కట్టుకుని తిరిగీ కుర్చీలో కూచుని ఉంది. వదులుపాటి గౌనుచేతులు వెనకకు బుజాలమీదకు వచ్చి పడ్డాయి. ఆ హస్తాలభంగిమ, ఆ రూపం ఒళ్లు జలపరించేటంత అందంగా ఉందని అంకీకరించక తప్పదు.

# 36

అర్థరాత్రి దాటినా సానిన్‌గదిలో ఇంకా దీపం వెలుగుతూనే ఉంది. మేజాబల్లమీద కూర్చుని 'అతని జెమ్మా'కు ఉత్తరం వ్రాస్తున్నాడు. ఆఉత్తరంలో సంగతులన్నీ తెలియజేసాడు. పొలొజోవ్ దంపతులిద్దరినీ వర్ణించి చెప్పాడు. కాని అతని భావాలను గురించే ఎక్కువగా వ్రాసి మూడురోజులలో వచ్చి కలుసుకుంటానని ఉత్తరం ముగించాడు. (ఇక్కడ మూడు ఆశ్చర్యార్థక గుర్తులు పెట్టాడు). మరునాడు ఉదయాన్నే ఈ ఉత్తరం పోస్టుచేసి కర్హాస్ తోటలో షికారు చేయడానికి వెళ్లాడు అక్కడ అపుడే బాండు మోగుతోంది. ఎక్కువమంది జనం ఇంకా రాలేదు. ఆగి బాండు విన్నాడు. కాఫీతాగి ప్రధానమార్గంనుంచి చీలే సన్నటిబాటకు మళ్ళి ఒక బెంచీమీద కూర్చుని ఆలోచించసాగాడు.

ఇంతలో టకీమని గొడుగుపిడి వచ్చి తగిలింది భుజంమీద మెత్తటి చరుపు పడింది. అదిరిపోయి చూసాడు.... అతనిముందు మేర్యా నికొలయెవ్నా నిలబడిఉంది సన్నటి లేత ఆకుపచ్చరంగు దుస్తులు ధరించింది. తెల్లటి టులేహాటు పెట్టుకుంది, చేతులకు తోలు తొడుగులు వేసుకుంది. వేసవి ప్రభాతంలాగా నవనవోన్మేషంగా ఉంది. ఆమె కదలికలో, చూపులో నిద్రమత్తు గోచరిస్తోంది.

"గుడ్‌మార్నింగ్" అంది "వుదయానే నీ కోసం మనిషిని పంపాను, కాని నువు అప్పటికే బయలుదేరి వచ్చేసావుట. రెండుగ్లాసుల ఆ నీళ్ళు తాగాను. యిక్కడ ఆ నీళ్ళు తాగమని చంపుతారు. నాకంటె ఆరోగ్యంగా యెవరున్నారు చెప్పుమరి? పూర్తిగా గంటసేపు నడవాలి, నా వెంట వస్తావా? అటూయిటూ తిరిగి కాఫీ తాగుదాం."

"నేను కాఫీ తాగాను" అన్నాడు సానిన్ లేస్తూ. "సంతోషంతో నీవెంట వస్తాను."

"నీ చేయి అందియి. భయపడడం దేనికి? నువు పెళ్లాడబోతున్న యువతి యిక్కడలేదు. చూడదు."

సానిన్ బలవంతాన చిరునవ్వు నవ్వాడు. మేర్యా నికొలయెవ్నా జెమ్మా సంగతి ఎత్తినపుడల్లా అతనికి చెడ్డ అసహ్యంవేసేది. కాని ఏం చేస్తాడు? తొందరగా నమ్రతతో ఆమెవైపుకు వంగాడు .... మేర్యా నికొలయెవ్నా చేయి మెల్లగా అతని చేతిమీదపడి అంటిపెట్టుకుంది.

"యీవేపుకురా" అంది గొడుగుతెరిచి బుజంమీద పెట్టుకుని "యీ తోటలో నీ కెంతో స్వస్థతగావుంటుంది. యిక్కడున్న రమణీయ దృశ్యాలన్నీ చూపిస్తాను. యిలాచూడు." (యీ రెండుమాటలు ఆమెకి చాలా ఇష్టం.) "అమ్మకం విషయిం యిప్పుడుకాదు, భోజనాలయాక తీరుబడిగా మాట్లాడుకుందాంలే. నీ విషయమంతా నాతో చెప్పు .... అందువల్ల యెటువంటివానితో నేను వ్యవహరించాలో తెలుస్తుంది. ఆ తరవాత, నీ కిష్టమైతే నా విషయం చెపుతాను. సరేనా?"

"కాని, మేర్యా నికొలయెవ్నా! నా విషయంలో ఆసక్తి కలిగించేదేముంటుంది?...."

"ఆగు, ఆగు, నువు నన్ను అపార్థం చేసుకుంటున్నావు నీతో సరసాలాడాలని నాకేంలేదు," అని మేర్యా నికొలయేవ్నా బుజాలు ఎగరవేసింది. పురాతన ప్రతిమలాంటి యువతిని పెళ్ళాడబోయే నీతో సరసాలేమిటి? నువు సరుకులు అమ్మజూపుతున్నావు, నేను వ్యాపారస్తురాలిని. నీ సరుకుల విషయం నేను బాగా తెలుసుకోవాలి. యిక వాటినిగురించి చెప్పు. నేను కొనబోయే సరుకులను గురించేగాదు అమ్మేవారినిగురించి కూడా తెలుసుకోవాలి. అది మా నాయనగారి నియమం. సరే ప్రారంభించు....నీ బాల్యంసంగతులు వదిలివేసి విదేశాలలో వుంటున్నప్పటినుంచి చెప్పుకురా. యిప్పటివరకు యెక్కడెక్కడికి వెళ్లావు? అంత గబగబా నడుస్తావేం? మరేం తొందర లేదులే,"

"నేను యిటలీ వెళ్లాను. అక్కడ కొన్ని నెలలపాటు వుండి యిక్కడికి వచ్చాను."

"యిటలీకి సంబంధించిన ప్రతి ఆకర్షణకి నువు లోనవుతావు గదూ! అక్కడ నీకేమీ దొరకకపోవడం ఆశ్చర్యంగానే వుంది! నీకు లలితకళలంటే ఆసక్తేనా? చిత్రాలా? లేకపోతే సంగీతమంటే యెక్కువ యిష్టమా?"

"నాకు కళలంటే మహాయిష్టం," రమణీయమైన ప్రకృతిని ప్రేమిస్తాను."

"సంగీతం?"

"సంగీతంకూడా?"

"కాని సంగీతమంటే నా కేమాత్రం యిష్టంలేదు రష్యన్ గీతాలంటే నాకిష్టం! అదైనా గ్రామసీమలో, వసంతకాలంలో - గీతం నాట్యం....యెర్ర కాలికోకాగితం, స్త్రీల నుదుటికి కట్టుకునే ముత్యాల హారాలు, మైదానంలోని లేతపచ్చిక, పొగవాసన....యివి నా కిష్టమైనవి. నా విషయం యెందుకుగాని, నీ విషయం చెప్పు...."

మధ్యమధ్య సానిన్ కేసి చూస్తూ మేర్యా నికొలయెవ్నా ముంధుకు సాగిపోతోంది. ఆమె చాలా పొడగరి. ఆమె మొహం అతని మొహం దగ్గరకు వస్తుంది.

మొదటలో అయిష్టంతో, అసంబద్ధంగా తన జీవితగాధను సానిన్ చెప్ప నారంభించాడు. చెపుతూంటే క్రమేపీ ఉత్సాహం రేకెత్తింది. లొడలొడ వాగజొచ్చాడు. మేర్యానికొలయెవ్నా ఇతరులు చెప్పేది మహా ఓపికగా వింటుంది. మర్మంలేని స్వభావమేమో ఇతరులకుకూడా వారికి తెలియకుండానే అలాంటి స్వభావమే అలవడుతుంది, కార్డినల్ రెడ్జ్ చెప్పినట్టు అతిచనువుగా మెలగగల నేర్పుగలది. సానిన్ తన యాత్రలనుగురించి. పీటర్స్‌బర్గ్‌లో తన జీవితం గురించి, తన యవ్వనదశను గురించి చెప్పాడు....మేర్యా నికొలయెవ్నాయే గనక నవనాగరిక స్త్రీ

అయినట్లయితే సానిన్ అంత స్వేచ్ఛగా ఆమెతో మాట్లాడగలిగేవాడు గాదు. తను చాలా మంచిమనిషిననీ, మర్యాదలు తనపట్ల అనవసరమనీ తెలియజేసింది. మేర్యా నికొొలయెవ్నా తను ఈవిధమైనదానినిగాసానిన్‌కు ద్యోతకం చేసింది: ఈ "మంచిమనిషి" అతనిచేతిమీద ఆనుకుని, అతని మొహంలోకి చూస్తూ పిల్లిలాగా అతనిపక్కనే నడుస్తోంది. మనో నిబ్బరంలేని మానవులకు పిచ్చెత్తించి, స్వాధీన పర్చుకుని ప్రమాధకరంగా పరిణమించే ఆకర్షణను విరజిమ్ముతూ ఆ యువతి అతని పక్కనే నడుస్తోంది. ఆ ఆకర్షణ ఒక్క స్లావోనిక్ జాతులవారికే ఉంటుంది. అదైనా మిశ్రమరక్తంగల వారికే.

సానిన్, మేర్యా నికొొలయెవ్నా గంటకుపైగా షికారుచేస్తూ మాట్లాడుకున్నారు. ఒకమాటయినా ఎక్కడా నిలబడలేదు. ఆపార్కులో అంతులేని దోవలవెంట నడిచారు. ఒకరిచేయి ఒకరు పట్టుకుని సులేబీలు ఎక్కారు. నిలబడకుండానే ప్రకృతిదృశ్యాలను మెచ్చుకున్నారు. పల్లపు నేలమీదకుదిగి చూడశక్యంగాని చీకటినీడలో మునింగిపోయారు. మధ్య మధ్య సానిన్‌కి విసుగుపుట్టేది. అతను ప్రేమించే జెమ్మాతో ఎన్నడూ ఇలా ఇంతదూరం నడవలేదు.... ఇక ఈ యువతి అతనిని స్వాధీన పర్చుకుంది - ఇదీ అతనిస్థితి;

"అలిసిపోయావా?" అని ఆమెను చాలాసార్లు అడిగాడు. "నాకెపుడూ అలపురాదు"అని జవాబిచ్చింది వీరిలాగానే షికారు వచ్చిన వారిని మధ్య మధ్య కలుసుకున్నాదు వారిలో చాలామంది మేర్యా నినొొల యెవ్నాకి, కొంతమంది గౌరవపురస్కరంగా, కొంతమంది సవ్రమత తోను అభివందనాలు తెలిపారు. ఒకషోకిల్లా పెద్దమనిషిని దూరాన్నుంచే స్థిరుష్టమైన పారిస్ ఉచ్చారణతో పిలిచింది.

అతనూ హాటుపైకెత్తి వంగి నమస్కరించాడు. "యెవరతను?" అని ప్రశ్నించాడు సానిన్. రష్యన్లకి ప్రశ్నలువేయడం అలవాటు.

"అతనా? ఫ్రెంచివాడు,యిక్కడ చాలామంది ఫ్రెంచివారు తిరుగు తుంటారు....యితను నా అనుగ్రహం సంపాదించాలని పాటుబడు

తున్నాడు, సరేగాని కాఫీవేళయింది. యింటికి పోదాంపద. నీకు ఆకలి వేస్తోందనుకుంటాను. యీపాటికి మా ఆయన కళ్ళు తెరిచి వుంటాడు."

"మా ఆయన! కళ్ళు!" అని తనలో తాను తిరిగి అనుకున్నాడు. "ఫ్రెంచిభాష అద్భుతంగా మాట్లాడుతుంది! బలే విచిత్రమైన మనిషి!"

మేర్యా నికొలయెవ్నా పొరబడలేదు. ఆమె, సానిన్ హోటలుకు చేరుకునేసరికి 'ఆ ఆయన', ఆ "లడ్డూ' తలమీద బొచ్చుటోపీ పెట్టుకుని పలహారాలు పెట్టిన మేజాముందు కూర్చుని ఉన్నాడు.

"మీరసలు రారనే అనుకున్నా" అంటూ ఆశ్చర్యం వెల్లడించాడు, చిన్న పిల్లవాడిలా మారాం చేస్తూ. "యేం చేయనూ ఒక్కడినే కాఫీ తాగబోతున్నా"

"మరేం పరవాలేదులే" అంది మేర్యా నికొలయెవ్నా హుషారుగా. "కోపం వచ్చిందా? నీకు కోపం రావడమే మంచిది. లేకపోతే మొద్దు బారిపోతావు. యిదిగో చూడు, అతిధిని తీసుకువచ్చాను. ఊఁ - గంట వాయించి, తెల్లటి గుడ్డ పరిచిన మేజామీద పెట్టి డ్రెస్టెన్ పింగాణీ కప్పులతో మాంచి కాఫీ తెమ్మను,"

ఆమె హాటు, చేతితొడుగులు తీసిపారవేసి చప్పట్లు కొట్టింది.

పొలొజోవ్ ఆమెకెసి కనులు పైకెత్తి దృష్టి సారించాడు.

"యివాళ యింత చలాకిగా వున్నావేం?" అని అడిగాడు విని పించీ వినిపించకుండా,

"అదంతా నీ కెందుకు? ముందు గంట వాయించు. కూర్చో. డిమిత్రీ పావ్లోవిచ్! మళ్ళీ కాఫీ తాగుదుగాని అవీ యివీ తెమ్మని పురమాయించడం నాకెంత యిష్టమనుకున్నావు! అంతకంటె నాకు వేరే సంతోషంలేదు!

"నీ ఆదేశాలు పాటించినపుడు" అంటూ ఆమె భర్త మూలిగాడు.

"ఆఁ - అవును. అందుకే నాకు అంత సంతోషం. అందులో ముఖ్యంగా నీతో. అవునా, కాదా? లడ్డూ! అదిగో కాఫీ వచ్చింది"

వెయిటర్ పెద్దపళ్లెంలో కాఫీ తెచ్చాడు. అందులో కాఫీతోపాటు నాటక కరపత్రంకూడా ఉంది. మేర్యా నికొలయెవ్నా ఆ కరపత్రం ఒడిసి పట్టింది.

"నాటకం!" అంది కోపంతో. "జర్మన్‌నాటకం: ఓ-సరే, జర్మన్ ప్రహసనంకంటే నయమే!" అని వెయిటర్‌కేసి తిరిగింది. "నాకోసం ఒక బాక్సు- స్టేజీబాక్సు కొనేసేయ్ ఉహుఁ- ఫ్రెండెన్ బాక్సు అయితే మరీమంచిది. వినిపించిందా? ఫ్రెండెన్‌బాక్సు కావాలి."

"ఫ్రెండెన్‌బాక్సు స్టాట్ డైరెక్టరు యిదివరకే కొనివుంటే...." అన సాహసించాడు వెయిటర్.

"ఆయనకి పది థాలర్లు యిచ్చి ఫ్రెండెన్‌బాక్సు నాకు ప్రత్యేకించబడేటట్టు చూడు. వినిపించిందా?"

ఇక ఏంచేయలేక వెయిటర్ వినయవిధేయతలతో తల వంచుకున్నాడు.

"నాతో నాటకానికి వస్తావా, డిమిట్రీ పావ్లోవిచ్! జర్మన్ నటులు- ఘోరమేననుకో. వస్తానను....వస్తావు. నిజంగానా? యెంత మంచి వాడివి! లడ్డూ! నువు రావద్దులే!"

"సరే, నీ యిష్టం" అన్నాడు పొలొజోవ్ కాఫీకప్పు పెదవుల దగ్గర పెట్టుకుంటూ.

"నువు యింటిదగ్గర వుండడమే మంచిది. నువు నాటకానికి వచ్చినా యెలాగా నిద్రపోతావుగా. పైగా జర్మనీ భాష నీకు సరిగా అర్థంకాదు. నీకు పని చెపుతాగా. మనకార్యదర్శికి మన మిల్లును గురించీ. రైతుల ధాన్యం కొట్టించడం గురించీ వుత్తరంరాయి. ఆదేం కుదరదని చెప్పు! యీ వుత్తరం రాయడానికి సాయంకాలందాకా పడుతుందిలే."

"సరే అలాగే" అన్నాడు పొలొజోవ్.

"సరే. బాగుంది. నువు చాలా తెలివిగలవాడివి. సరే యెలాగో కార్యదర్శిపేరు వచ్చింది, యిక మన వ్యవహారం విషయం చర్చించు

కుందాం. వెయిటరు యివన్నీ తీసేయగానే నీ జమీనిగురించి అంతా చెప్పుదువుగాని. ధర యెంత చెప్పదలచావు? బజానా యెంతకావాలి? ("అమ్మయ్య! అనుకున్నాడు సానిన్)

"నువు యిదివరకు కొంతచెప్పావు. నీ తోటను యెంత ఆనందంతో వర్ణించావో నాకు జ్ఞాపకమే. కాని లద్దూ వినలేదు....ఆయనకి వినిపించు, యేదయినా యుపయుక్తమయిన సూచన చేస్తాడేమో! నువు పెళ్ళి చేసుకోడానికి సాయపడాలనే నాకు వుంది. అదీగాక, పలహారాలయినాక నీ వ్యవహారం సంగతి చూస్తానని మాట యిచ్చానా నేనెపుడూ మాట తప్పను. అంతేగదూ, యిప్పోలిట్ సిడోరిచ్! "

పొలొజోవ్ మొహం చేతితో తుడుచుకుని, "అందులో అబద్ధమేమీలేదు. నువెన్నడూ యెవరినీ మోసంచెయ్యవు."

"యెన్నడూ మోసంచెయ్యను. యిక డిమిత్రీ పావ్లోవిచ్, సెనేటులోచెప్పేటట్లు, నీవ్యవహారం విశదీకరించు"

# 37

సానిన్ తన వ్యవహారం విశదీకరించసాగాడు. తన జమీ సహజ సౌందర్యాన్ని విస్తరించి చెప్పకుండా, రెండోసారి వర్ణించాడు. మధ్య తను చెప్పినదానిని రూఢిపరచమని పొలొజోవ్‌ను అభ్యర్థించాడు. కాని పొలొజోవ్ గుర్రుమని తలాడించాడు. ఆ తలాడింపు ఆమోద సూచకమో. తిరస్కారసూచకమో భగవంతుడికే తెలియాలి. కాని మేర్యా నికొలయెవ్నాకి అతని ఆసరా ఏమి అక్కరలేదు. ఆశ్చర్యపోయేటంతగా వాణిజ్యపరిపాలనా శక్తిసామర్థ్యాలను వెల్లడించింది. కార్యనిర్వహణలోని లోతుపాతులన్ని ఆమెకు బాగా తెలుసు. విషమ

ప్రశ్నలు వేసింది. ప్రతిదీ ఆకళింపుచేసుకుంది. ఆమె ఉచ్చరించిన ప్రతిమాటా సూటిగా వెళ్ళి తగిలేది, ఇలాంటి విషమప్రశ్నలకు జవాబు చెప్పవలసి వస్తుందని సానిన్ ఎన్నడూ అనుకోలేదు, తయారుకాలేదు. ఈ ప్రశ్నోత్తరాలు గంటన్నరసేపు సాగాయి. సానిన్‌కి తప్పుచేసినవాడి అవస్థ అనుభవంలోకి వచ్చింది. దయాదాక్షిణ్యాలు లేని న్యాయాధిపతి ముందు, కుశాగ్రబుద్ధి అయిన న్యాయాధిపతిముందు కూర్చున్నట్టుంది. "యిదేదో దర్యాప్తులావుంది"అని తనలో తాను విచారంతో గొణుక్కున్నాడు. ఇదంతా ఎదో పరియాచకమన్నట్లు మేర్యా నికొలయెవ్నా ఎడతెగకుండా నవ్వింది. కాని ఇలా నవ్వినా సానిన్‌కి స్వస్థత చిక్కలేదు. 'దర్యాప్తు'లో 'భూమితిరిగి పంచండం' 'వ్యవసాయం' అనే పదాలకు ఖచ్చితమైనఅర్థంఅతనికి తెలీదని తేలిపోయేసరికి ముచ్చమటలు పట్టాయి.

"సరే, సరే" అంది మేర్యా నికొలయెవ్నా ఒక నిశ్చయానికి వచ్చినట్టు. నీ జమీనిగురించి తెలిసింది....నీకు తెలిసినంతలో తలకి ఖరీదెంత? (ఆ రోజులలో జమీధర అందులో రైతుల సంఖ్యనుబట్టి నిర్ణయించేవారు).

"అయిదువందల రూబుళ్ళకి తక్కువ అయితే...." (ఓ- పాంటలియోన్! పాంటలియోన్ ఎక్కడ ఉన్నావు? 'అమానుషం!' ఇదే అనడానికి తగిన సమయం.)

మేర్యా నికొలయెవ్నా ఆలోచించుతున్నట్లుగా లోకప్పుకేసిచూడసాగింది.

"యెందుకనేం?"అంది కొంచెంసేపు ఆగి, "ఆ ధర సబబయిందేననుకుంటా. కాని నేను రెండురోజులు వ్యవధికోరానా, రేపటిదాకా నువు ఆగవలసిందే. ఒక అంగీకారానికిరాగలుగుతామనే అనుకుంటున్నా. అపుడు బజానా యెంతకావాలో చెప్దువుగాని యిక చాలిద్దాం" అంది సానిన్ ఎదో అభ్యంతరం లేవదీయనున్నాడని గమనించి "యీ విషయం చాలాసేపు చర్చించీ చర్చించీ విసుగెత్తింది. చూడు. నీకు (నడుము పటకాలో పెట్టుకున్న చిన్న పింగాణీగడియారంకేసి

తేరిపార జూసింది)....మూడింటివరకు వ్యవధి యిస్తున్నాను.... విశ్రాంతి తీసుకో. వెళ్ళి యీ ఆటఆడు"

"నేను జూదం ఆడను" అన్నాడు సానిన్.

"నిజంగానే? నువు బుద్ధిమంతుడివి. నేనూ జూదం ఆడను. డబ్బు తగలేసుకోవడం వట్టి తెలివితక్కువపని. కాసినోకి వెళ్ళి వాళ్ళ మొహాలుచూడు. చిత్రవిచిత్రమైన మొహాలు కనిపిస్తాయి. అక్కడ ఒక ముసిలిదివుంది. ఆవిడకి నెత్తిమీదకిరీటం, మూతిమీద మీసాలు వున్నాయి. అద్భుతమైంది! ఒక సంస్థానాధిపతికూడా వున్నాడు. చాలా తమాషామనిషి! మహాఠీవిగా వుంటాడు చిలకముక్కు, ఒకధేలరు వొడ్డినపుడల్లా వేస్టుకోటులో చేయిపెట్టి నేర్పుగా శిలువగుర్తు వేసుకుంటాడు. పత్రికలు చదువు. షికారుచేయి. ముక్తసరిగా చెప్పాలంటే నీకు తోచినట్లుచేయి....కాని మూడింటికల్లా యిక్కడికి రావాలి....వేళకి భోజనం చేయాలి....జర్మన్లు....అసందర్భంగా యేడింటికి నాటకం మొదలుపెడతారు. అని చేయిజాపి "క్షమించు" అంది

"క్షమించడానికి నాకేం అపకారం చేసావని?"

"నిన్ను నానాయాతనా పెట్టాను. కాస్త నిదానించుచూడు, ముందున్నది ముసళ్ళ పండగ" అంది కళ్ళు కుంచించుకుంటూ. చెంపలు ఎరుపెక్కాయి, సొట్టలు పడ్డాయి. "గుడ్ బై!"

సానిన్ వంగి అభినందించి బయటికి వెళ్ళిపోయాడు. వెనక సంతోషంతో నవ్వు మారుమోగింది. వెళుతూంటే అద్దంలో ఈ కింది దృశ్యం కంటపడింది. మేర్యా నికొలయెవ్నా భర్తనెత్తిమీద బొచ్చుటోపీ కళ్ళమీదికి లాగింది. అతను నిరాధారంగా రెండుచేతులూ ఊపుతున్నాడు.

# 38

ఒంటరిగా గదిలో కూర్చుని సానిన్ పీడవదిలినట్లుగా దీర్ఘంగా నిట్టూర్చాడు. నీకు విశ్రాంతి కావాలి' అని మేర్యా నికొలయెవ్నా అన్న మాటలో ఎంతైనా నిజం ఉంది. ఈ నూత్న పరిచయాలనుంచి, సంఘటనలనుంచి, సంభాషణలనుంచి దూరమై విశ్రాంతి పుచ్చుకోవాలి అతనికీ ఆమెకూ స్వభావంలో ఎక్కడా పోలికలేదు. ఆమెతో చనువుగా ప్రవర్తించడంవల్ల అతని హృదయంలో, మనసులో అజ్ఞాతంగా రేగిన ఉద్రేకం అణచుకోడానికి విశ్రాంతి అవసరం. ఎటువంటి సమయంలో ఇదంతా జరుగుతోంది ? జెమ్మాను ప్రేమించానని తెలుసుకుని వివాహం నిశ్చయం చేసుకున్న మరుసటి దినం ! ఛీ ! పాపం ! తప్పు చేసానని చెప్పుకోవడానికి ఎదీ లేకపోయి పవిత్రమైన, పరిశుద్ధమైన తన ప్రియురాలికి వేయి క్షమాపణలు మనసులో చెప్పుకున్నాడు. ఆమె ఇచ్చిన శిలువను వేయిసార్లు ముద్దిడుకున్నాడు. వీస్‌బాడెన్‌కు అతను వచ్చిన పని తొందరగా అనుకూలంగా అవుతుందనే ఆశే లేకపోతే సూటిగా ప్రియమైన ఫ్రాంక్‌ఫోర్టుకు, ఇంటికి, ఆమెదగ్గరికి పరుగెత్తుకుని వెళ్ళి ఆమె పాదపద్మాలమీద వాలేవాడే....కాని గత్యంతరం లేదు అనుభవించాలిసిందే. దుస్తులు ధరించాలి, భోజనం చేయాలి, ఆ తరవాత నాటకానికి వెళ్లాలి....మరునాడు పొద్దున్నే వెళ్ళనిస్తే ఎంత బావుండును ! .

అతనిని కలతపెట్టిన విషయం, కోపకారణమైన విషయం ఇంకొకటుంది : ఎడతెగని ఆప్యాంగా, కృతజ్ఞతా పూర్వకంగా ఆనందంతో జెమ్మానిగురించి, ఆమెతో కలిపి సంసారంచేస్తూ అనుభవించే ఆనందంగురించి తలపోస్తున్నాడు. అయినా ఈ విచిత్రమైన స్త్రీ, ఈ మదాం పొలొజోవ్, నిరంతరం అతనిని వెంటాడుతోంది, కళ్ళముందు

ప్రత్యక్షమవుతోంది. ఆమె రూపాన్ని మనసులోనుంచి తరిమివేయలేక పోతున్నాడు. ఆమె కంఠస్వరం, ఆమె మాటలు, ఆమె దుస్తులనుండి వెలువడే సువాసన మరవ లేకపోతున్నాడు అనువాసన పసుపుపచ్చ కలువ వాసనలాగా అతనిలోకి చొచ్చుకుపోయింది. ఆమె అతనిని ఆడిస్తోంది, నిజం! ఒకటి తరవాత ఒకటి అనేకమైన ఎత్తులు వేస్తోంది. ఎందుకు ? ఆమెకేం కావాలి ? ఇదంతా భాగ్యవంతురాలయిన స్త్రీయొక్క చెడి పోయిన, పతనమైపోయిన స్త్రీ యొక్క చిత్తచాంచల్యమా ? ఇక అభర్త ఎంత చిత్రమైన వ్యక్తి ! అతనికి ఆమెతో గల సంబంధం ఎటువంటిది? అయితే ఈ ప్రశ్నలన్నీ అతని తలలో ఎందుకు పుట్టాలి? పొలొజోవ్ దంపతులు ఏమైపోతే అతనికేం ? అతని హృదయమంతా వేసవి వెలుగులాగా కాంతివంతమైన, నిర్మలమైన ఇంకొక స్త్రీవైపు మరలి నపుడుకూడా వెంటాడే ఆమెరూపాన్ని పారదోలలేక పోతున్నాడేం? దేవ కన్యలాంటి జెమ్మా ఆకృతి వెనకాల ఈఆమె ఆకృతి దాగిఉందే ? దాగి ఉండడమేకాదు వెనకాలనుంచి వెక్కిరిస్తోంది, మనసును దోచుకునే ఆ బూడిదరంగు కళ్లు ఆ బుగ్గల సొట్టలు, తాచుపాములవంటి ఆ జడలు మనసులోనుంచి తరిమివేయలేనంతగా వశపర్చుకుందా ?

ఛత్ ! ఛత్ ! రేపీపాటికల్లా ఆనవాలు లేకుండా మటుమాయమై పోతుంది ! కాని ఆమె అతనిని రేపు వెళ్ళనిస్తుందా ?

---

ఈ ప్రశ్నలన్నీ తిరిగి తిరిగీ మనసులో వేసుకున్నాడు. మూడు గంటలు కావచ్చింది. నల్లటి పొట్టికోటు వేసుకుని పొలొజోవ్ గదికి వెళ్ళేముందు కాసేపు షికారు చేదామని పార్కుకు వెళ్ళాడు.

వారి కచేరిగదిలో ఏదో విదేశరాయబార కార్యాలయ కార్యదర్శి కనిపించాడు. జర్మను. పొడగరి. చక్కటిజుట్టు. గుర్రపు మొహం. వెనకపాపిడీ (అది ఆ రోజుల్లో షోకు). ఇక రెండవవ్యక్తి ఎవరు? ఎవరోగాదు, కొద్దిరోజులకితం అతనితో ద్వందయుద్ధం చేసిన వాన్ డాన్‌హాఫ్! ఇక్కడ కలుసుకుంటామని అనుకోలేదు. ఒకక్షణం తొట్రు పడి వంగి నమస్కరించాడు.

"యిదివరలో మీరు కలుసుకున్నారా?" అది అడిగింది మేర్యా నికొలయెవ్నా, సానిన్ తొట్టుపడటం గమనించి.

"కలుసుకునే భాగ్యం కలిగింది" అన్నాడు డాన్‌హాఫ్. మేర్యా నికొలయెవ్నా వైపుకు కొద్దిగావంగి, మందహాసం చేస్తూ మెల్లగా "నీకు చెప్పినవ్యక్తి యితడే.... మీదేశస్థుడు....రష్యను...." చెప్పాడు.

"అలాగా? నిజం?"అని ఆమె అంది మెల్లగా వేలితో బెదిరిస్తూ. తక్షణమే అతనివద్ద శెలవుతీసుకుంది. ఆమె ఆకర్షణకు పూర్తిగా లోంగిపోయి చూచినపుడల్లా నోరు తెరిచే ఆ బక్కపలచని కార్యదర్శిని పంపించి వేసింది. ఏమిచేయాలో చెప్పనక్కరలేకుండానే గ్రహించే కుటుంబ స్నేహితునిలాగా డాన్‌హాఫ్ తక్షణమే ఆమె ఆదేశం పాటించి చక్కాబోయాడు. కాని కార్యదర్శిమాత్రం మొండికేసే సూచనలు కని పించాయి. దానిమీద మేర్యా నికొలయెవ్నా అతనిని చల్లగా సాగనంపింది.

"నీరాణీదగ్గిరికేవెళ్ళు" అంది మేర్యానికొలయెవ్నా. (ఆసమ యంలో చచ్చురకం వేశ్యని పోలిన ఒక మొనాకో రాణి మాకాం వేసి ఉంది.) "నాబోటి సామాన్యురాలితో కాలం వృధాచేసుకోవడం యెందుకు?"

ఆ దురదృష్ట కారదర్శి, "ప్రపంచంలోని రాణులంతా...."అని ఆమెకు నమ్మబలకబోయాడు.

కాని మేర్యా నికొలయెవ్నాకి దయాదాక్షిణ్యాలు లేవు. ఆ కార్య దర్శిచల్లగా తోవపట్టవలసి వచ్చింది.

మేర్యా నికొలయెవ్నా బాగా ఒడుపుగా ముస్తాబయింది. గులాబి రంగు పట్టుదుస్తులు వేసుకుంది. చెవులకు ధగధగా మెరిసే వజ్రాల తమ్మెటలు పెట్టుకుంది. మహోత్సవంగా ఉన్నట్టు కనిపించింది.

సానిన్‌ను తనపక్కన కూర్చోబెట్టుకుని పారిస్‌నుగురించిచెప్పింది. కొద్దిరోజులలో అక్కడికి వెళుతున్నానన్నది. ఆ తరవాత జర్మన్లను గురించి చెపుతూ వారంటే తనక విసుగనీ, తెలివిగా ప్రవర్తించబోయి తెలివితక్కువతనం బైట పెట్టుకుంటారనీ, తెలివితక్కువవాళ్ళు అతి

తెలివితేటలు ఒలికించుతారనీ తెలిపింది. అపుడే వెళ్ళిన అధికారితో ఒక స్త్రీ మూలంగా ద్వంద్వయుద్ధం చేసావా అని సానిన్ సూటిగా ప్రశ్నించింది.

"నీ కెలా తెలిసింది ?" అని ఆశ్చర్యంతో గొణిగాడు, సానిన్.

"ప్రపంచంలో పుకార్లు వ్యాపిస్తూంటాయి. డిమిట్రీ పావ్లోవిచ్, నువు సరైన పనే చేశావనీ వాస్తవమైన యోధునిలాగా ప్రవర్తించావనీ విన్నాను. సరేగాని, ఆ స్త్రీనేనా నువు పెళ్లాడబోయేది?"

సానిన్ కొద్దిగా కోపంతో మొహం ముడుచుకున్నాడు....

"సరే. సరే. అడగనులే!" అంది మేర్యానికొలయెవ్నా తొందర తొందరగా, "ఆ విషయం మాట్లాడడం నీ కిష్టం లేనట్లుంది, క్షమించు. యిక ముందెపుడూ అడగనులే కోపపడకు" పక్క గదిలోనుంచి పొలొజోవ్ చేతిలో ఒక వార్తాపత్రిక పట్టుకుని చక్కావచ్చాడు. "యేం కావాలి ? భోజనం సిద్ధమైందా ?" అని ఆమె అడిగింది.

"ఒక్క నిమిషంలో వడ్డిస్తారు. 'నార్తరన్‌బీ' పత్రికలో యేం జదివానో చెప్పుకో చూదాం. రాజా గ్రొమోబాయి చనిపోయాడు."

మేర్యా నికొలయెవ్నా తలెత్తి చూసింది.

"అలానా? అతని ఆత్మకు శాంతి లభించుగాక! ప్రతీ ఫిబ్రవరిలో నా పుట్టినరోజు పండుగనాడు" అంది సానిన్‌కేసి తిరిగి, "నా గదులన్నిటినీ చామంతిపూలతో అలంకరింపజేసేవాడు. కాని శీతాకాలంలో అందు కోసరమని పీటర్స్‌బర్గులో నివసించడం మంచిదిగాదు. డభై యేళ్ళు దాటి వుంటుంది." అంది భర్తను సంబోధిస్తూ.

"అవును. పత్రికలో అతని అంత్యక్రియలను గురించి ఘనంగా వర్ణించారు. రాజదర్బారంతో అక్కడే వుంది., రాజా కొవ్రిజ్‌ఖిన్ ఆయనమీద పద్యాలు రాసాడు."

"బలే, మంచిపని చేసాడు"

"చదివి వినిపించనా ? కొవ్రిజ్‌ఖిన్ అతను నిజమైన రాజకీయ వేత్త అని వర్ణించాడు"

"ఉహుం - కాదు, కాదు. అతను రాజకీయవేత్త యేంకాదు. అతను వట్టి టాట్యానా యుర్యేవ్నా మొగుడు! అంతే యిక భోజనాలు చేదాం పదండి. చచ్చినవాళ్ళతో మనమూ చస్తామా! డిమిత్రీపావ్లోవిచ్ యెదీ నీచేయి!"

---

ఆ కిందటి రోజునలాగానే భోజనం దివ్యంగా ఉంది. హుషారుగా సంభాషణలో జరిగిపోయింది. మేర్యా నికొలయెవ్నా మంచి మాటకారి. ఈమాటకారితనం స్త్రీలలో ముఖ్యంగా రష్యన్ స్త్రీలలో అపూర్వమైంది. ఆమె మాటలకోసం వెతుకుకోలేదు; స్వదేశ స్త్రీలమీద తన వాక్చాతుర్యాన్ని ప్రయోగించేది. వ్యంగ్యంగా, హుషారుగా మాటవదలినపుడల్లా సానిన్ పొట్టచెక్కలయేటట్టు నవ్వాడు. మేర్యానికొలయెవ్నా కపటాన్ని, తియ్యని మాటలను, అబద్ధాలను అసహ్యించుకునేది.... ఎక్కడ చూసినా ఆమెకి ఇవే కనిపించేవి. ఆమె పుట్టి పెరిగిన నీచపరిసరాలను గొప్పచేసి వర్ణిస్తూ తన బంధువులను గురించీ, తన బాల్యం గురించీ చిత్రవిచిత్రమైన కథలు చెప్పింది. తాను నాగరికతలేని పల్లెటూరి పడుచునని చెప్పుకుంది. పడుచుతనంలో ఆమె సాటి స్త్రీలకంటె ఎక్కువ అనుభవించిందని సానిన్ గ్రహించాడు.

పొలొజోవ్ మస్తుగా తిన్నాడు. తాగాడు. మధ్య మధ్య ఎపుడో ఒక మారుమాత్రం భార్యవైపు, సానిన్‌వైపు తెల్లటికళ్లు ఎత్తి చూసాడు. కళ్ళు మూతలుపడున్నట్టు కనిపించాయేగాని నిజానికి అతను మేలుకునే ఉన్నాడు. "యెంత తెలివిగలవాడివి!" అంది మేర్యా నికొలయెవ్నా అతని కేసి తిరిగి, "ఫ్రాంక్‌ఫోర్టులో నాకు కావలసినవన్నీ యెంత చక్కగా కొనుక్కొచ్చావ్! నీ నుదురు ముద్దుపెట్టుకుందునుగాని అటువంటివి నీకు పనికిరావుగా."

"ఉహుం-పనికిరావు" అన్నాడు పొలొజోవ్ వెండిచాకుతో అనాస పండుకోస్తూ.

మేర్యా నికొలయెవ్నా మేజామీద తట్టుతూ అతనికేసి తదేక దృష్టితో చూసింది.

"పందెం ఖాయమేగా?" అంది నర్మగర్భంగా.

"ఓ"

"మంచిది. నువు వోడిపోతావు!

పొలొజోవ్ గడ్డం ముందుకు పెట్టి,

"నీకెంత గట్టినమ్మకమున్నా యీతడవమాత్రం నువు వోడి పోతావు" అన్నాడు.

"పందెం దేనినిగురించి? చెప్పవచ్చా?" అని అడిగాడు సానిన్.

"యిపుడుకాదు" అని జవాబిచ్చి మేర్యా నికొలయెవ్నా పక్కున నవ్వింది.

గడియారం పదకొండు కొట్టింది. బగ్గీ సిద్ధంగా ఉందని వెయిటరు వచ్చిచెప్పాడు. పొలొజోవ్ భార్యనిసాగనంపి వెంటనేవచ్చి కుర్చీలో కూలబడ్డాడు.

"కార్యదర్శికి రాయాల్సిన వుత్తరం సంగతి మర్చేపోకేం" అని కేకపెట్టింది మేర్యా నికొలయెవ్నా హాలులోనుంచి.

"మర్చేపోను. మరేం బెంగెట్టుకోకు మాట తప్పేవాడిని గాను."

# 39

1840లో వీస్‌బాడెన్ నాటకశాల అసహ్యం గొలుపుతూండేది. దానికి అనుబంధించిన నాటక సమాజం పై డాబేగాని నిజానికి సాధారణ మైంది. బుద్ధిపూర్వకంగా సామాన్యకార్యక్రమానికి అలవాటు పడిపోయింది. జర్మన్ నాటక కళాస్థాయికి ఏమాత్రం చేరుకోలేదనే చెప్పాలి. ఇటీవల విఖ్యాతదర్శకుడు కారల్‌స్రూదర్శకత్వాన ప్రదర్శనలిచ్చే సమాజం ఆదర్శప్రాయమైంది.

మదాం వాన్ పొలొజోవ్‌కి ప్రత్యేకించిన బాక్సు (వెయిటర్ దీనిని యెలా సంపాదించాడో పరమాత్ముడికే ఎరుక! స్టాట్‌డైరెక్టరుకు లంచం ఇచ్చిఉంటాడా? ఉహుం!-) వెనక చిన్నగదిలాంటిది ఉంది దానినిండా సోఫాలే! బాక్సులోపలికివెళ్ళేముందు సన్నటి తెరను దించవలసిందని మేర్యా నికొలయెవ్నా సానిన్‌నుకోరింది.

"నలుగురూ నన్నుచూడడం నాకిష్టంలేదు. వచ్చిచుట్టూ మూగుతారు" అని తన పక్కనే సానిన్‌ను ప్రేక్షకులవైపు వీపుపెట్టి కూర్చునేటట్లు చేసింది. అందువల్ల బాక్సు ఖాళీగా ఉన్నట్టుకనిపిస్తుంది.

బృందవాయిద్యం ప్రారంభమైంది.... తెర లేచింది, నాటకం ఆరంభించారు.

ఆ నాటకం అసంఖ్యాకమైన దేశీయ రచనలలో ఒకటి. అందులో రచయిత ప్రతిభకన్న పాండిత్యం విశేషంగా గోచరించింది. ఎంతో కష్టపడి, నిర్దుష్టమైనదైనా, జీవంలేని శైలిలో అతి ప్రధానమని తలచే ఒక విషాద సంఘర్షణను నాటకంలో చొప్పించాడు. విసుగెత్తిపోయింది. ఆ విసుగును, మామూలు కలరా, ఆసియాటిక్ కలరా అన్నట్లే, ఆసియా

టిక్ విసుగు అనవచ్చు. మేర్యా నికొలయెవ్నా సగం అంకం అయేవరకూ ఓపికపట్టి కూర్చుంది. కాని ఆ నాటకంలోని ప్రియుడు (గోధుమరంగు పొడుగాటి కోటు వేసుకున్నాడు. ఆ కోటుచేతులు చిరుసుగా ఉన్నాయి. మొఖములు మెరపట్టీకుంది. చారల వేస్టుకోటు. దానికి ముత్తెపుచిప్పగుడ్డీలు. ఆకుపచ్చపట్లాం. తోలుపటకా. తెల్లటి తోలు చేతి తొడుగులు) తన ప్రియురాలి ద్రోహం తెలుసుకున్నవాడై, ఎదురురొమ్ముమీద పిడికిలితో గుద్దుకుంటూ మోచేతులు లఘుకోణంలో పెట్టి శునకంలాగా బిగ్గరగా మొరగసాగేసరికి మేర్యా నికొలయెవ్నా ఇక భరించలేకపోయింది.

"మారుమూల చిన్న చిన్న పట్టణాలలోని ఫ్రెంచినటులు, పేరు ప్రఖ్యాతులు పొందిన జర్మన్ నటులకంటె వుత్తమంగా, సహజంగా నటిస్తారు" అంది మేర్యా నికొలయెవ్నా కోపంతో, "యిలారా" అంది పక్కసోఫాను చేతితో తట్టుతూ. "మాట్లాడుకుందాం"

సానిన్ ఆమె ఆదేశాన్ని శిరసావహించాడు.

మేర్యా నికొలయెవ్నా అతనికేసి తేరిపార జూసింది. "నువు గంగిగోవులా వున్నావు. నీ భార్యకు శ్రమవుండదు. ఆ విదూషకుడు-" అంటూ చేతిలోని విసనకర్ర కొనతో ఆ మొరిగేనటుని చూపించింది. "ఆ విదూషకుడు నా పడచుతనపు రోజుల్ని జ్ఞాపకం చేస్తున్నాడు. నే నొకపుడు ఒక ప్రయివేటు పంతుల్ని ప్రేమించాను. అతడే నా మొదటి- కాదు, రెండోప్రియుడు. మొదటిసారిగా డాన్‌స్టాయ్ మఠంలోని ఒక 'బ్రదర్' (పాదరీలాంటి మత ప్రచారకుడు)ను ప్రేమించాను; అప్పటికి నాకు పన్నెండేళ్ళు. ఆదివారాలమాత్రమే అతను నాకు కనిపించేవాడు. మొఖమల గౌను వేసుకుని, పన్నీరు జల్లుకునేవాడు. హారతిపళ్ళెం పట్టుకుని జనంగుండా వెళుతూ ఆ వాళ్ళని 'క్షమించు, క్షమించు' అని ఫ్రెంచిభాషలో అనేవాడేగాని కన్నెత్తి ఎవరివంకా చూసేవాడుకాదు. ఇక అతని కనురెప్ప వెంట్రుకలు యింత పొడుగుండేవి" అంటూ చేతి బొటనవేలి గోరుతో చిటికెనవేలు సగం కొలిచి చూపించింది. "యిక ఆ ప్రయివేటుపంతులు పేరు మాల్షియర్ గాస్టన్. బాగా చదువుకున్నవాడు

ఖచ్చితమైనవాడు. స్విజ్జరులాండు దేశీయుడు. మొహం దృఢంగా వుండేది, మీసాలు కారునలుపు. గ్రీసుదేశీయుల ముఖాకృతి పెదవులు యినుము కరిగించి పోతపోసినట్టుండేవి. ఆతనంటే నాకు భయంవేసేది. నేను యింతవరకు భయపడిందల్లా అతనొకణ్ణిచూసే. మా తమ్ముడికి పాఠాలు చెపుతూండేవాడు. మా తమ్ముడు నీట్లోమునిగి చనిపోయాడు. నేను అలాగే దారుణపుచావు చస్తానని ఒక సోదెది జోస్యం చెప్పింది. ఊఁ-వట్టి చెత్తవాగుడు! నాకు నమ్మకంలేదు, నేను కత్తితో పొడుచుకు చచ్చిపోతాననినీవు వూహించగలవా, యిప్పోలిట్ సిదోరిచ్!"

"కత్తితో పోడుచుకోకుండానే చనిపోవడానికి అనేకమార్గా లున్నాయి" అన్నాడు సానిన్,

"వట్టి చెత్తవాగుడు పోదూ! నీకు మూఢనమ్మకాలున్నాయా? నాకేమాత్రం లేవు. సరే, జరిగేదేమిటో జరుగుతుంది, మాన్షియర్ గాస్టన్ మాయింట్లోనే నివసించేవాడు. అతని గది నా గదిమీద వుండేది. ఒక్కొక్కపుడు అర్ధరాత్రి నాకు మెలుకు వచ్చేది. పైనగదిలో అతని అడుగుల చప్పుడు వినిపించేది. అతను రాత్రి బాగా పొద్దుపోయి పడుకునేవాడు. భయంతో....యితరభావాలతో, కొయ్యబారిపోయేదాన్ని, మా నాన్న చదువుకున్నవాడుగాదుగాని మాకుమాత్రం బాగా చదువు చెప్పించాడు.... నాకు లాటిన్ భాషకూడా వచ్చు. తెలుసునా?

"నీకు లాటిన్ భాషవచ్చా?

"ఆఁ-అవును. మాన్షియర్ గాస్టన్ నాకు నేర్పాడు అయనతో కలిసి 'ఈనీడ్' చదివాను. అబ్బ! విసుగెత్తేది! కాని అక్కడక్కడా మంచి ఘట్టాలున్నాయి. డిడో, యీనీస్‌లు అడవిలో వుండగా.... జ్ఞాపకంవుందా?...."

"అవునవును జ్ఞాపకం వుంది" అన్నాడు సానిన్ తొందర తొందరగా. చదువుకున్న లాటిన్‌భాష ఎన్నడో మరిచేపోయాడు. ఈనీడ్ చూచాయగామాత్రమే జ్ఞాపకం ఉంది;

మేర్యా నికొలయెవ్నా కనులు పైకెత్తి క్రీగంట చూసింది. "కాని నేను బాగా చదువుకున్నదానినని మాత్రం అనుకోకు. నేను యెక్కువ చదువుకున్నదానిని గాను. నాకు ప్రావీణ్యం లేదుసరిగ్గా రాయనుకూడా లేను.... నిజానికి, బిగ్గరగా చదవలేను. పియానోవాయించలేను. బొమ్మలుగీయలేను కుట్టుపనిరాదు. యేపనీ చేయలేను విగ్రహపుష్టే అంతకుమించి యెందుకూ పనికిరాను."

చేతులు చాచింది. "యిదంతా నీ కెందుకు చెపుతున్నానో తెలుసా? మొదటి కారణం: ఆ అక్కుపక్షులగోల వినకుండా తప్పించుకొవడానికి. (ఆ సమయంలో నటుడుకి బదులు ఒక నటి అతనిలాగానే మోచేతులు పెట్టి అరుస్తోంది.) రెండోకారణం: నేను నీకు రుణపడివున్నా. నిన్న నీ గొడవంతా నాతో చెప్పావుగా."

"నన్నుగురించి చెప్పమని కోరడం నిజంగా నామీద దయతోనే" అన్నాడు సానిన్.

"నేను యెటువంటిదానినో నువు తెలుసుకోవద్దా? కాని నాకు ఆశ్చర్యం వేయడంలేదు," అంది సోఫామీద ఆనుకుంటూ. "పురుషుడు పెళ్ళాడబోతుంటే, అందులోనూ ప్రేమించి ద్వంద్వయుద్ధంచేసి మరీ పెళ్లాడబోతుంటే, యితర స్త్రీలనుగురించి ఆలోచిస్తానికి అతనికి సావ కాశం యెక్కువుంటుంది!"

మేర్యా నికొలయెవ్నా ఆగి, పెద్దగా నున్నగా తెల్లగాఉన్న పళ్ళతో విసనకర్ర పిడిని కొరకసాగింది.

రెండు రోజులనుంచీ మనసును చుట్టుముట్టి ఉక్కిరిబిక్కిరి చేస్తున్న ఉద్వేగాలు తిరిగి అతనిలో రేగాయి.

మేర్యా నికొలయెవ్నాకి అతనికి సంభాషణ చాలా మంద్ర స్వరంతో, చెవులో చెప్పుకున్నట్టు, సాగింది. ఇది అతనికి కోపకారణ మైంది, ఆందోళనపర్చింది.

ఇదంతా ఎపుడు అంతమవుతుందో? మనోనిబ్బరంలేని మను షులు దేనినీ అంతం చేయరు. అంతం దానంతటదే వస్తుందని కాచుకుని కూర్చుంటారు.

రంగస్థలంమీద ఎవరో తుమ్మారు హాస్యరసం పోషించడానికని రచయిత దీనిని నాటకంలో ఇరికించాడు. ఇదితప్ప నాటకంలో ఇక హాస్యమేమీ లేదు. ప్రేక్షకులు ఈ మాత్రం హాస్యమైనా పెట్టినందుకు కృతజ్ఞతతో నవ్వారు.

సానిన్‌కి ఒళ్ళు మండింది. కోపంతో ఉన్నాడో. సంతోషంతో ఉన్నాడో, విసుగెత్తిందో, హుషారుగా ఉందో అతనికే తెలియదు. జెమ్మా అతనిని చూస్తే?

---

"తమాషాగాలేదూ?" అంది మేర్యా నికొలయెవ్నా హఠాత్తుగా. "ప్రశాంతంగా, 'పెళ్ళి చేసుకోబోతున్నాను' అని యెవరైనా చెపుతారు గాని 'నేను నీటిలోపడి మునిగిపోవాలని చూస్తున్నాను' అని యెవరూ చెప్పరు. యింతకీ ఆరెంటికీ భేదమేమిటి? తమాషాగా లేదూ?"

సానిన్ సంకటావస్థలో పడ్డాడు. "చాలా భేదంవుంది, మేర్యా నికొలయెవ్నా! కొంతమందికి నీటిలో వురకడమంటే మరేంఘోరంగా వుండదు; యీదగలరు. కాని చిత్రమైన వివాహం విషయం - నువీ విషయం యెత్తావు గనక...."

నాలుక కొరుకుకుని మాట్లాడడం ఆపేసాడు.

మేర్యా నికొలయెవ్నా విసనకర్రతో అరచేతిమీద కొట్టుకుంది.

"చెప్పదలచిందేమిటో చెప్పు. డిమిత్రీ పావ్లోవిచ్! నువు చెప్ప దలచిందేమిటో నాకు తెలుసు, 'యీ విషయం యెత్తావుగనక, నీ వివాహంకన్న విచిత్రమైందేముంది? యింతప్పటినుంచీ నా భర్తను యెరుగున్నా' అని చెప్పదలచావు. యీత కొట్టడం తెలిసినవాడివిగదూ, యిదే నువు చెప్పదలిచింది."

"క్షమించు." అంటూ ప్రారంభించాడు సానిన్!

"అవునుగదూ, అవునుగదూ?" అంటూ హఠం పట్టింది మేర్యా నికొలయెవ్నా. "నామొహంచూసి, నే చెప్పిందంతా అబద్ధమని చెప్పు చూదాం."

ఎక్కడ చూడాలో సానిన్‌కు తెలియలేదు.

"సరే- నువు యింతగా పట్టుబడుతున్నావుగాబట్టి- నిజమే! " అని మనసులోమాట కక్కేశాడు సానిన్ "అలా అయితే సరే- యీత కొట్టడం తెలిసినవాడివాయెను. 'యీామె బీదదికాదే, తెలివితక్కువది కాదే, అమాయకురాలుకాదే, అటువంటపుడు యీ చిత్రమైన పెళ్ళి యెందుకుచేసుకుంది? ' అని నీలో నీవు యెన్నడైనా ప్రశ్నించుకున్నావా? బహుశా నీకీ విషయం ఆసక్తి గొల్పలేదేమో! మరేంపరవాలేదు. కారణ మేమిటో చెపుతా యిపుడుమాత్రం కాదు, 'విశ్రాంతి' అవనీ. యెవరో ఒకరు లోపలికి వస్తారేమోనని యెడతెగకుండా భయపడుతున్నా. "

ఈ మాటలు మేర్యా నికొలయెవ్నా నోటినుంచి వెలువడ్డాయో లేదో బాక్సు తలుపు సగం తెరుచుకుంది. సందులో ఎవరో తల దూర్చారు మొహం ఎర్రగా, చెమటతో మెరుస్తోంది. పడుచుమొహమే గాని పళ్ళూడిపోయాయి. చిలకముక్కు, పెద్దపెద్ద గబ్బిలపుచెవులు, చెవులచుట్టూ పొడుగాటి జుట్టు, మందకొడికళ్ళు, కళ్ళకి బంగారపుజోడు, జోడు పైభాగానతీగ, బాక్సులోకి తొంగిచూసి మేర్యా నికొలయెవ్నా కంటపడగానే అసహ్యంగొలిపేటట్లు ఇకిలించాడు. తల వంకించాడు. నన్నటిమెడ బయటపడ్డది.

మేర్యా నికొలయెవ్నా జేబురుమాలు ఆ మొహంకేసి విసిరి, "ఉహుం- యిపుడు మాట్లాడడానికి వీల్లేదు" అంది.

అతనికి ఆశ్చర్యంవేసింది. బలవంతానవవ్వి నిట్టూర్పు స్వరంతో 'సరే. సరే! ' అంటూ వెళ్ళిపోయాడు.

" యెవరా చిత్రమైనవ్యక్తి? " అని సానిన్ అడిగాడు.

"అతనా! వీస్‌బాడెన్ విమర్శకు లో ఒకడు. సాహిత్య విమర్శకుడు గులాం. యేపేరన్నాపెట్టు యిక్కడి స్థానిక కంట్రాక్టర్ల దగ్గర జీతానికి వున్నాడు. అందుచేత ప్రతిదానినీ పొగడవలసిందే. ప్రతివారి విషయంలోవుత్సాహం చూపాల్సిందే, కాని నిజానికి యెదురుతిరిగే తత్త్వమేగాని, యేం జేస్తాడుపాపం! అతనంటే నాకు చెడ్డభయం. వట్టి

బాతాఖానీరాయడు. నేను నాటకం చూడడానికి వచ్చానని చాటిస్తాడు. చాటిస్తేమాత్ర యేంలే? "

వాయిద్య సమ్మేళనం నృత్యగీతం ఎత్తుకుంది. తెర రెపరెపలా డింది, కృత్రిమ నటన, ఏడుపు....

"సరే" అంది మేర్యా నికొలయెవ్నా సోఫాలో తిరిగి కూల బడుతూ. "నీ వధువుతో కులాసాగా కాలక్షేపం చేయకుండా నా పక్కన తప్పనిసరయి బలవంతాన కూర్చోవలసి వచ్చింది- భయంకరంగా కళ్ళు రిమి చూడకేం. నీ స్థితి అర్థంచేసుకున్నాను. అందుకే నువ్వు యెక్కడికి వెళతానంటే అక్కడికి పంపుతానని మాట యిచ్చాను. యిక నాగాధ సాంతం విను. అన్నిటికంటే నేను దేనిని ఎక్కువగా ప్రేమిస్తానో తెలుసుకోవాలని వుందా? "

"స్వేచ్ఛ" అని సూచించాడు సానిన్.

"అవును, డమిట్రీ పావ్లోవిచ్! అంటే- " ఆమె స్వరంలో నిజాయితీ, గాంభీర్యం వాస్తవంగా ధ్వనించాయి. "అన్నిటికీ మించి ముందు స్వేచ్ఛ! నే వేవో డాబులు కొడుతున్నాననుకోకు. యిందులో పొగడదగిందేమీ లేదు. నేను స్వేచ్ఛను ప్రేమిస్తున్నాను, చనిపోయే వరకూ ప్రేమిస్తూనే వుంటాను. బహుశా బానిసత్వం కళ్ళారా చూసి వుంటాను. బాల్యంలో అనుభవించి వుంటాను .... మా ప్రయివేటు పంతులు, మాన్సియుర్ గాస్టన్ నా కళ్ళు తెరిచాడు. యిప్పోలిట్ సిడో రిచ్‌ని యెందుకు పెళ్ళిచేసుకున్నానో యిపుడు నీకు అర్థమయివుంటుంది. గాలిలాగా స్వేచ్ఛగా, పూర్తిగా స్వేచ్ఛగా ఆయనతో సంచరిస్తున్నాను. ........... యీ విషయం వివాహానికి ముందే నాకు తెలుసు. వివాహం చేసుకున్నా నాకు నేనే యజమానురాలిననికూడా యెరుగుదును."

మేర్యా నికొలయెవ్నా ఆగి, విసనకర్ర పక్కన పెట్టింది,

"యింకో విషయం నీకు చెప్పదలిచాను. ఆలోచించడానికి నాకేం అభ్యంతరం లేదు, తమాషాగా వుంటుంది. మరి మనకు మనసంటూ

వున్నది యెందుకు? ఆలోచించడానికేగా! కాని నా చర్యల పర్యవసానం గురించిమాత్రం నేను ఆలోచించను- వాటినిగురించి ఆలోచించను. పర్యవసానం యేమయినాసరే యేమాత్రం పస్తాయించను. పస్తాయించ వలసిన అవసరంలేదు. నా జీవిత సిద్ధాంతమేమిటో తెలుసా ? 'పర్యవ సానంగురించి ఆలోచించకు' యిది రష్యన్ భాషలో యెలా చెప్పాలో నాకు తెలియదు. పర్యవసానంగురించి ఆలోచించడాని కేముంది ? యీ ప్రపంచంలోగాని ఆ ప్రపంచంలోగాని (వేలితో పైకిచూపించి) నన్ను విచారణకి లాగేవారులేరు. సరే, పరిస్థితులు వాటంతటవే చక్కబడ తాయి! నన్ను విచారణచేసే సమయానికి నేను నేనుగా వుండను. వింటు న్నావా? విసుగెత్తడంలేదుగదా? "

సానిన్ తలవంచుకుని కూర్చున్నవాడల్లా ఇపుడు తల పైకెత్తి, "నాకేమాత్రం విసుగెత్తడంలేదు, మేర్యా నికొలయెవ్నా ! యెంతో ఆసక్తితో నువు చెప్పేది వింటున్నాను. కాని యిదంతా నాతో యెందుకు చెపుతున్నావా ? అని మాత్రం నాలో నేను తర్కించుకుంటున్నాను." అన్నాడు.

మేర్యా నికొలయెవ్నా సోఫామీద కొద్దిగా కదిలింది "తర్కించు కుంటున్నావా ? లేకపోతే....యీ మాత్రం గ్రహించలేకపోయావా ? లేక పోతే మర్యాదకోసమా ?"

సానిన్ తల ఇంకా పైకెత్తాడు.

"నే నిదంతా యెందుకు చెపుతున్నానంటే" అంటూ కొనసాగించి మేర్యా నికొలయెవ్నా, స్వరంలో మొహంలో ప్రశాంతత కనవచ్చింది. "నువంటే నా కెంతో యిష్టంకాబట్టి. ఆశ్చర్యపడకు. నేనేం తమాషాకి చెప్పడంలేదు. నీ స్మృతిపధంలో నన్నుగురించి అసహ్యకరమైన భావాలు- అయినా నేను లక్ష్యపెట్టనులే-అంటే బూటకపుభావాలు హత్తుకుపోవటం నా కిష్టంలేదు. అందుకే నిన్నిక్కడికి లాక్కొచ్చాను. నీతో ఒంటరిగా కూర్చుని మర్మం విడిచి మాటాడుతున్నాను. అవును. మర్మంవిడిచి! నేను అబద్ధం చెప్పడంలేదు. డిమిట్రీ పావ్లోవిచ్, జ్ఞాపకముంచుకో, నువు

యింకొకరిని ప్రేమిస్తున్నావని నాకు తెలుసు, ఆమెను పెళ్ళాడబోతున్నావనీ నాకు తెలుసు....యిందులో నాకు స్వార్థమేమీలేదు, గుర్తుంచుకో. సరే, యిపుడు నీవంతు వచ్చింది. 'పర్యవసానం గురించి ఆలోచించకు' అని నువ్వూ అనవచ్చు."

ఇలా అని ఆమె నవ్వింది. కాని ఒక్క-క్షణం మాత్రమే. నవ్వు ఆపి తన మాటలకు తనే ఆశ్చర్యపోతున్నట్టు కదలకుండా కూర్చుంది. సర్వసాధారణంగా ఆమె కళ్ళల్లో ఉల్లాసము, ధైర్యమూ ద్యోతకమయేవి. కాని ఇపుడు భయం, విషాదఛాయలు గోచరించ సాగాయి.

"అబ్బ! యెంత కపటం! యెంత కపటం! అయితేనేం అందమైంది!" అనుకున్నాడు సానిన్.

"నా దూరదర్శిని యిలాయియి" అంది మేర్యా నికొలయెవ్నా హఠాత్తుగా. "చూస్తాను. ఆ నటి నిజానికి అంత భయంకరంగా వుందా? యువకులు ప్రేమలో పడకుండా యిటువంటి దానిచేత వేషం వేయిస్తున్నారని తలుస్తున్నావా?"

సానిన్ దూరదర్శిని ఆమె చేతికి అందించాడు. ఆమె దానిని తీసుకుంటూ కొద్దిసేపు అతనిచేతిని పట్టుకుంది.

"అలా నరాలు బిగుంచుకుని కూర్చుంటావేం?" అని అతని చెవిలో అన్నది మందహాసం చేస్తూ, "చూడు. నాకు అడ్డువచ్చే దెవరూ లేరు. నేను యితరులకి అడ్డురాను. నేను స్వేచ్ఛను ప్రేమిస్తాను. యెవరినీ నిర్బంధించను. నిర్బంధానికి లోనుగాను. యిక, కాస్త జరుగు, నాటకం చూదాం."

మేర్యా నికొలయెవ్నా దూరదర్శినితో రంగస్థలం చూడసాగింది. సానిన్ కూడా అదే చూసాడు. సగం సగం చీకటిలో ఆ కాముకురాలి పక్క కూర్చుని, ఆమె శరీరపు వెచ్చదనాన్ని, సువాసనను అనుకోకుండానే ఆస్వాదిస్తున్నాడు. ఆ సాయంకాలం, ముఖ్యంగా కొద్ది నిమిషాల క్రితం, ఆమె చెప్పిందంతా మనసులో నెమరువేసుకోసాగాడు.

# 40

నాటకం ప్రారంభించి గంటా గంటన్నర అయింది. కాని మేర్యా నికొలయెవ్నా, సానిన్ నాటకం చూడడం మానివేసి తిరిగి సంభాషణలో నిమగ్నులయారు. సంభాషణ మునుపటి ధోంణిలోనే నడిచింది కాని ఈ తడవ మాత్రం సానిన్ నోరు కట్టేసుకోలేదు. మనసులో తనమీద, మేర్యా నికొలయెవ్నా మీద అతను కోపగించుకున్నాడు ఆమె జీవిత సిద్ధాంతం ఆధారరహితమైందని నిరూపించాలని యత్నించాడు. ఆమెతో వాదించాడు. అతను వాదనకు దిగడం ఆమెకు సంతోషకారణమైంది, వాదనకు దిగాడంటే లొంగిపోయాడన్నమాటే; లేకపోతే లొంగి తీర తాడు. ఎరలోపడ్డాడు. యిక లొంగిపోతాడు మచ్చికయిపోతాడు. ఆమె కూడా వాదించింది, నవ్వింది, అతనితో ఏకీభవించింది, ఆలోచిస్తున్నట్లు నటించింది, విరుచుకుపడింది .... అంతసేపూ వారి మొహాలు క్రమేపీ దగ్గరకు చేరుకున్నాయి అతనిచూపు ఆమెనుంచి ఇంకొకవైపుకు మరల లేదు....ఆమె కళ్ళు అతని మొహంమీద, అతని ఆకృతి అంతటిమీద విహరించాయి. మర్యాదకోసం అతను చిరునవ్వు నవ్వాడు. అతను భావ ప్రపంచంలోకి పడడం, పరస్పర సంబంధాలలో నిజాయితీ గావాలని వాదించడం, విద్యుక్తధర్మం గురించీ, ప్రేమ, వివాహంలోని పవిత్ర తను గురించి వాదించడం ఆమె పన్నాగాలకు అనుకూలంగానే ఉంది. భావప్రపంచంలో పడడం ఇక మొదలు....అందరికీ తెలిసిందే....

బలీయమైన ఆమె ప్రకృతిలో లలితమైన, సక్రమమైన భావాలు, లజ్జాయుతమైన భావాలు రేకెత్తితే, ఇంకేముంది, కొంపమునిగి పోతుందని ఆమెను బాగా ఎరుగున్నవారు అంటారు.

సానిన్ కొంప మునిగేటట్టే ఉంది. మనసును కేంద్రీకరించుకోవ డానికి ఒక్క నిమిషం వ్యవధి చిక్కితే తనకు తాను ఏవగించుకునే వాడే! కాని మనసును కేంద్రీకరించుకోవడానికి గాని, తనను తాను ఏవ గించు కోవడానికి గాని, వ్యవధి చిక్కలేదు..

ఆమె కాలమంతా ఇలా వినియోగించింది ఇంతకీ కారణం అతను అందవిహీనుడు కాకపోవడమే! ఏది లాభదాయకం, ఏది నష్ట దాయకం? ఎవరు చెప్పగలరు?

నాటకం అఖరైంది. మేర్యా నికొలయెవ్నా శాలువా కప్పమని సానిన్ని కోరింది శాలువా మడతలు విప్పి బుజాలమీద కప్పుతూంటే మెదలకుండా నిలబడింది. అతనిచేయి పుచ్చుకుని నడవలోకి వెళ్ళింది. బాక్సు గుమ్మంలో దెయ్యంలాగా డాన్‌హాఫ్ ప్రత్యక్షమయేసరికి కెవ్వున కేకవేసింది. అతని వెనక ఆ విమర్శకుని వికారరూపం కనపడింది. ఆ సాహిత్య విమర్శకుని మొహం ద్వేషంతో మండిపోతోంది.

"బగ్గీ దగ్గరికి తీసుకువెళ్ళనా?" అన్నాడా అధికారి. అతని గొంతులో అణగారిన కోపం ధ్వనించింది.

"వద్దు, వద్దు" అని ఆమె జవాబిచ్చింది "నౌకరున్నాడు. కూడా రానక్కర్లేదు." అని ప్రార్థిస్తున్నట్టు అతని చెవిలో ఊది, సానిన్‌ను ఈడ్చుకుంటూ గబగబా వెళ్ళిపోయింది.

"నిన్ను తగలెయ్య! నన్ను అంటిపెట్టుకుని చస్తున్నావేం?" అంటూ మండిపడ్డాడు విమర్శకునివైపు తిరిగి. ఎవరిమీదనో ఒకరిమీద విరుచుకుపడాలిగా!

"సరే, సరే" అని గొణిగాడు, విమర్శకుడు తిన్న తిట్లు దులిపి వేసుకుంటూ.

మేర్యా నికొలయెవ్నా నౌకరు పోర్చిలో కాచుకుని కూచున్నాడు. కనుమూసి తెరిచినంతలో బగ్గీదగ్గరికి తీసుకువెళ్ళాడు. ఆమె తొందర తొందరగా బగ్గీ ఎక్కింది. సానిన్ ఆమె వెనకాలే లోపలికి ఉరికాడు

తలుపు టపేలుమని మూతపడింది· మేర్యా నికొలయెవ్నా కడుపు చెక్కలయేటట్లు నవ్వింది.

"యెందుకు నవ్వుతున్నావు ?" అని సానిన్ అడిగాడు.

"ఓ-క్షమించు .... ఒక ఆలోచన వచ్చింది. నా కోసం నువూ, డాన్‌హాఫ్ మళ్ళీ ద్వంద యుద్ధం చేస్తే....అద్భుతంగా వుండదూ?"

"అతనిని బాగా యెరిగున్నావా ?"

"ఆ కుర్రాడా ? నాకు ఆ పనీ యీ పనీ చేసిపెడుతూంటాడు. నువేం గొడవపడక్కర్లా ?"

"నేనేమాత్రం గొడవపడను."

మేర్యా నికొలయెవ్నా నిట్టూర్చింది.

"అవును. నువేమాత్రం గొడవపడవని నాకు తెలుసు. యిదిగో చూడు. నువు చాలా మంచివాడివి. ఆఖరికోరిక నువు నిరాకరిస్తావని అనుకోను. మూడురోజుల్లో నేను పారిస్ వెళ్ళిపోతాను. నువు ఫ్రాంక్‌ఫోర్టుకు తిరిగి వెళతావు. మళ్ళీ మనం కలుసుకుంటామో లేదో ?"

"యేమిటా కోరిక ?"

"నీకు గుర్రమీద స్వారీచేయడం చేతనవుననుకుంటా ?"

"ఆఁ-చేతనవును."

"అలాఅయితే, రేపు వుదయం నిన్ను వచ్చి తీసుకువెళతాను. మనిద్దరం గుర్రాలమీద స్వారీచేదాం. మాంచి గుర్రాలు పట్టుకువస్తాను. తిరిగివచ్చి, నీ వ్యవహారం ఫైసలు చేసేసుకుందాం. ఆశ్చర్యపోవద్దు. యిదంతా ఏదో నా చిత్తచాంచాల్యం అనవద్దు. నేను పిచ్చిదానిని అనుకోకు-యేమో పిచ్చిదానినేమో - అయినా 'వస్తాను' అని అను. అంతే చాలు."

మేర్యా నికొలయెవ్నా మొహం అతనికేసి తిప్పింది. బగ్గీలో చీకటిగాఉంది. కాని ఆ చీకటిలో ఆమెకళ్ళు ఇంకా మెరిసిపోతున్నాయి.

"సరే. వస్తాను" అన్నాడు సానిన్ నిట్టూరుస్తూ.

"హోహో...." అంది తమాషా పట్టించడానికి.

"నువెందుకు నిట్టూరుస్తున్నావో నాకు తెలుసు. దాని అర్థం : పెన్నీకోసం, పౌనుకోసం! ఉహుం-కాదు. కాదు. నువు మంచివాడివి. ప్రేమించతగినవాడివి. నా మాట నేను నిలబెట్టుకుంటాను. యిదిగో చేయి, తొడుగుకూడా లేదు అందులోనూ కుడిచేయి. కుడిచేయి వ్యవహారాల చేయి. తీసుకో-అందులో నమ్మకం వుంచు. నే నెటువంటి దానినో నాకే సరిగా తెలియదు. కాని నేను నిజాయతీపరురాలిని. వ్యవహారాలు మాట్లాడడానికి తగినదానిని."

ఏం చేస్తున్నాడో తెలుసుకోకమునుపే సానిన్ ఆమె చేతిని పైకి ఎత్తి పెదవులకు హత్తుకున్నాడు. మెల్లగా చేతిని వెనకకు తీసుకుంటూ మేర్యా నికొలయెవ్నా హఠాత్తుగా మౌనం వహించింది. బగ్గీ గమ్యస్థానం చేరుకుని ఆగేవరకు ఆమె మరి మాట్లాడలేదు.

బగ్గీ దిగడానికి లేచింది. ఏమిటది? అది సానిన్ ఊహామాత్రమేనా లేక చెంపలమీద వెచ్చవెచ్చని స్పర్శా?

"రేపు" అని అతని చెవిలో చెప్పింది మెట్లు ఎక్కుతూ. పచ్చని జుట్టు హాలునౌకరు నాలుగురెమ్మల దీపపుసెమ్మా తీసుకు వచ్చాడు. ఆ దీపపుకాంతిలో ఆమె మెరిసిపోతోంది. ఆమె కిందచూస్తూ "రేపు" అని మళ్ళీ అంది.

గదికి సానిన్ తిరిగి వెళ్ళేసరికి మేజాబల్లమీద జెమ్మా వ్రాసిన ఉత్తరం కనిపించింది. ఆ ఉత్తరం చూసేసరికి ముందుగా అతనికి భయంవేసింది. ఒకక్షణం తరవాత భయాన్ని కప్పిపుచ్చుకోవడానికని సంతోషించసాగాడు ఆ ఉత్తరంలో కొద్దిపంక్తులే ఉన్నాయి. వ్యవహారం సానుకూలం అవడం ప్రారంభమయినందుకు సంతోషాన్ని వెలిబుచ్చుతూ, ఓరిమి వహించవలసిందనీ, ఇంటిదగ్గర అంతా కులాసాగా ఉన్నారనీ ఎపుడు తిరిగి వస్తావా అని సంతోషంతో ఎదురు చూస్తున్నామనీ జెమ్మా వ్రాసింది. ఆ ఉత్తరంలో సానిన్‌కు ఉదాసీనత పొడగట్టింది. అయినా కలం కాగితం తీసుకుని ఉత్తరం వ్రాయబోయి మళ్ళీ

"యేం రాయను? యెలాగో రేపు బయలుదేరి వెళుతున్నాగా! పైగా పొద్దుపోయిందికూడానూ" అనుకుని కలం కాగితం కిందపెట్టేసాడు.

వెంటనే పడుకుని సాధ్యమైనంత తొందరలో నిద్రపోవాలని యత్నించాడు. నిద్రపోకుండా మెలకువగానే ఉంటే తప్పకుండా జెమ్మానుగురించి తలపోసేవాడే కాని ఎందుకో ఆమెను గురించి తల పోయడమంటే సిగ్గేసింది అతని అంతరాత్మ గొంతు విప్పింది. రేపటితో గొడవంతా చల్లారిపోతుందనీ ఆ వెర్రిమనిషిదగ్గర శెలవు పుచ్చుకుని, ఆ చెత్తంతా మరిచేపోతాననీ అనుకుని తనకుతానే ఊర డించుకున్నాడు.

మనోనిబ్బరం లేనివారికి, తమలోతాము మాట్లాడుకునేటపుడు మాంచి పసందయిన మాటలు ఉపయోగించడం సరదా "పర్యవసానం గురించి ఆలోచించకు!"

# 41

ఇవీ సానిన్ మనసులో తారాడిన భావాలు! కాని ఆమర్నాడు ఉదయం మేర్యా నికొలయెవ్నా ఆదుర్దాగా తలుపుమీద కొరడా పగడపు పిడితో కొట్టి గుమ్మంలో ప్రత్యక్షమయేసరికి అతనికి ఎలాంటి భావాలు కలిగాయో? ఆమెచేతిమీద పొడుగాటి స్వారీ కంచుకం, వదులువదులుగా వేసుకున్న జడలమీద మగ హేటు, బుజాలమీద ముసుగుచీర ఉన్నాయి. పెదవులమీద, కళ్ళల్లో, మొహంలో మందహాసం వ్యాపించి సవాలు చేస్తున్నట్లుంది. ఆ సమయంలో అతను ఏమనుకున్నాడో చరిత్ర వివరిం చలేదు.

"యేం? సిద్ధంగా వున్నావా?" అని ఆమె గొంతు సంతోషంతో గణగణా మోగింది.

సానిన్ కోటుగుండీలు పెట్టుకుని మెదలకుండా హాటు తీసుకున్నాడు. మేర్యా నికొలయెవ్నా అతనికేసి ఉల్లాసంగా చూపుబరపి గబగబా మెట్లు దిగింది. అతనూ ఆమె వెనకనే గబగబా మెట్లు దిగాడు.

సింహద్వారం ముందు మూడుగుర్రాలు సిద్ధంగా ఉన్నాయి. ఒకటి మేర్యా నికొలయెవ్నాకి. అది ఆడగుర్రం, కపిలవర్ణం. మంచి పోషణలో పెరిగింది. సన్నటిముట్టె. వంపుతిరిగిన పెదవి. విస్పష్టంగా కనిపించే నల్లటి కళ్ళు, దుప్పికాళ్ళు. పీలగా ఉన్నా అందంగా ఉంది. జ్వాజ్వసమానంగా ఉంది సానిన్‌గుర్రం నల్లనిది. బాగాబలిసి భారీగా ఉంది. ఇక మూడోది నౌకరుది మేర్యా నికొలయెవ్నా సుళువుగా జీను మీదికి ఉరికింది. ఆ ఆడగుర్రం గిట్టలతో నేల గీకి, తోకముడుచుకుని, ముందుకు దూకింది. మేర్యా నికొలయెవ్నా స్వారీలో నేర్పరి ఏమో జీనుకు అంటిపెట్టుకునే ఉంది. ఆమె పొలొజోవ్‌కు వెళుతున్నానని చెప్పవలసి ఉంది. బొచ్చుటోపీ పెట్టుకుని, గౌనుకు గుండీలు పెట్టుకోకుండా మేడమీది వరండాలో కనిపించాడు. చిరునవ్వు నవ్వలేదు. పైగా మొహం ముడుచుకుని జేబురుమాలు ఊపాడు. సానిన్‌కూడా గుర్రం ఎక్కాడు. మేర్యా పొలొజోవ్ స్వారీ కంచుకంతో భర్తను అభినందించి నిలువంపుగా నున్నగా ఉన్న గుర్రంమెడమీద ఒకటి కొట్టింది. ఆ ఆడగుర్రం ఎగిరి ముందుకు దుమికి ఒడలంతా వణికించుకుంటూ, నోటిలోని కళ్ళెం గుంజుతూ, బుసకొడుతూ, టకటకధ్వని చేసుకుంటూ గబగబా అడుగులు వేయసాగింది. ఆమెవంకే చూస్తూ సానిన్ వెనకాల గుర్రాన్ని నడిపించాడు సున్నితమైన, మృదువైన ఆమె మూర్తి ఆత్మ విశ్వాసంతో, లాలిత్యంతో సుళువుగా ఊగిసలాడుతోంది.

"బలే బాగుందలా ?" అంది. "మనం విడిపోయేముందు నువ్వు ప్రేమించదగిన వాడవని చెప్పాలని వుంది. నువ్వు యెన్నటికీ పస్తాయించవులే,"

ఈ చివరి మాటలు అంటూ వాటిని నొక్కి చెప్పాలనే తలంపుతో, వాటి ప్రాముఖ్యమును అతను గ్రహించేటట్లు చేయాలనే ఉద్దేశంతో చాలా తడవులు ఆమె తల వంకించింది.

ఆమె అంత ఆనందంగా ఉండడం చూసి సానిన్ చకితు డయాడు. బాగా సంతుష్టి చెందినపుడు చిన్నపిల్లల మొహాలలో గోచ రించే కవళిక ఆమె మొహంలో పొడగట్టింది.

నగరసమీప ద్వారాలకడకు గుర్రాలను నడిపించుకుంటూ వెళ్లారు. అక్కడ రాజబాటఎక్కి గుర్రాలను కదనుతొక్కించ సాగారు. వాతావరణం బహుపసందుగా ఉంది. వేసవి, సుఖప్రదమైన ధ్వని చేసు కుంటూ గాలి వారి చెవులమీదుగా ఈలవేసుకుంటూ వెళ్ళి వారి మొహాల మీద ప్రవహించసాగింది. వారు ఆనందంలో మునిగిపోయారు. యవ్వన వంతమైన, ఆరోగ్యవంతమైన జీవితచైతన్యం, స్వేచ్ఛగా సాగిపోతున్నా మనే చైతన్యం వారిద్దరినీ చుట్టుముట్టింది. ప్రతి కదలికా ఆ చైతన్యాన్ని పెంపొందించింది. మేర్యా నికొలయెవ్నా కళ్ళెం బిగపట్టి మళ్ళీగుర్రాన్ని నడిపించసాగింది. సానిన్ ఆమెను అనుసరించాడు.

"ఆఁ-" అంది ఆనందంతో గాఢంగా నిట్టూరుస్తూ. "యింత కంటే జీవితంలో యేంకావాలి? కోరిక నెరవేర్చుకోవడం, అసాధ్య మైనది సాధించడం! ఆనందం ఒలమునకలైంది. నా ఆత్మ సంపూ ర్ణంగా ఆనందంతో నిండిపోయింది." ఇలా అని చేతిని గొంతుకమీద వేసుకుంది. "నువెంత మంచివాడవు! నాకెంత దయో చూడు. యీ ప్రపంచాన్నంతటినీ కౌగలించుకోవాలని వుంది, ఉహుఁ- యీ ప్రపంచా న్నంతటినీ కాదు, వాడిని కావలించుకోమ్మంటే కావలించుకోను." రోడ్డు పక్కనే పాకుతూవెళ్ళే ఒక ముసిలివాడిని కొరడాతో చూపించింది. "కాని వాడిని సంతోషపెట్టడానికి వెనుదీయను. యిదిగో తీసుకో" అంటూ జర్మనీ భాషలో బిగ్గరగా అరిచి డబ్బుసంచి ముసిలివాడి కాళ్ళముందు పడవేసింది, సంచి చిన్నదైనా బరువుగా ఉందేమో డబీ మని చప్పుడు చేసుకుంటూ రోడ్డుమీద పడింది. (ఆ రోజులలో నేటి

మసీపర్సులు లేవు.) ఆ బాటసారి ఆశ్చర్యపోయి ఆగాడు. కాని మేర్యా నికొలయెవ్నా విరగబడి నవ్వి గుర్రాన్ని దౌడుతీయించింది.

"నీకు స్వారీ అంటే యింత యిష్టమా?" అని సానిన్ అడి గాడు, ఆమెను కలుసుకోగానే.

మేర్యా నికొలయెవ్నా హఠాత్తుగా కళ్ళెం వెనకకు లాగింది. గుర్రాన్ని ఆపడానికి ఇంకేవిధానం ఆమెకు నచ్చదు.

"వాడి కృతజ్ఞతాభివందనాలు అందుకోకుండా తప్పించుకోవాలని దౌడు తీయించాను. కృతజ్ఞతాభివందనాలు వింటూంటేనాకుఆనందంభంగ మవుతుంది. ఆసంచీ పారవేశానంటే వాడికోసమేంగాదు. నా ఆనందం కోసం. నాకు కృతజ్ఞత తెలపడానికి వాడికి యెన్ని గుండెలున్నాయి! నువేమి టన్నావు? నాకు వినిపించలేదు."

"నిన్ను అడిగాను.... నువింత హుషారుగా యివాళ యెందుకు న్నావో తెలుసుకోవాలని వుంది."

"యిలా చూడు," అంది మేర్యా నికొలయెవ్నా. ఈ తడవ కూడా సానిన్ అడిగింది వినిపించుకోలేదో, లేకపోతే ఆతని ప్రశ్న జవాబు చెప్పతగింది కాదని భావించిందో తెలియదు. "మనవెంట ఆ నౌకరు గాడు రావటం నాకు తలనొప్పిగా వుంది. యెప్పుడు మనం యింటికి వెళ్ళుతామా అనే వాడు ఆలోచిస్తుంటాడు. యీ పీడ వదిలించుకునే దెలా?" జేబులోనుంచి చర్రున ఒక నోటుపుస్తకం తీసింది. "వుత్తరం యిచ్చి వెనకకు వీడిని పంపించేయనా? ఉహుం- అది మంచిపనికాదు. ఓ- ఆ కనిపించేది సారాదుకాణం కాదూ?"

సానిన్ ఆమె చూపినవైపు దృష్టి సారించాడు.

"అలాగేవుంది,"

"భేష్! మనం తిరిగి వచ్చేదాకా అక్కడ సారా తాగుతూ వుండ మని చెపుతా?"

"కాని వాడేమనుకుంటాడో?"

"యేమనుకుంటేమట్టుకు మనదేం పోయింది? మరేం అనుకోడు. సారాతాగుతూ కూచుంటాడు. రా. సానిన్." (సానిన్ అని అసలుపేరు పెట్టి ఆమె అతనినిపిలవడం ఇదేమొదలు) "ముందుకు కదంతొక్కించు"

సారాదుకాణానికిచేరుకోగానే మేర్యానికొలయెవ్నా నౌకరునుపిలిచి తనవాంఛింతం తెలియజేసింది. ఆ నౌకరు ఇంగ్లీషువాడు. తత్త్వమూ, ఇంగ్లీషువారి తత్త్వమే. మెదలకుండా చేయి టోపీ గుబ్బమీదకు ఎత్తి జీనుమీదనుంచి కిందకు ఉరికి. కళ్లెం పుచ్చుకొని గుర్రాన్ని నడిపింప సాగాడు.

"యిక మనకి స్వేచ్ఛ. స్వేచ్ఛ" అంది మేర్యా నికొలయెవ్నా. "యెటువెళదాం? వుత్తరంగానా, దక్షిణంగానా, తూర్పుగానా, పడమర గానా? చూడు-నేను పట్టాభిషేక సమయంలో హంగరీ రాజులా వున్నాను. (కొరడాతో నలుదిక్కులా చూపించింది.) యిదంతా మనదే. ఉహుఁ- చెపుతావిను. అదిగో! ఆ రమణీయమైన కొండలు చూడు. ఆ అడవి చూడు. అక్కడికి వెళదాం. కొండల దగ్గిరికి, కొండల దగ్గిరికి!"

రాజబాట వదలి కొండలకు వెళ్ళే ఒక ఇరుకు రోడ్డువెంట, ఎవరూ తొక్కని రోడ్డువెంట గుర్రాన్ని దౌడుతీయించింది. సానిన్ కూడా ఆమె వెనకనే గుర్రాన్ని దౌడుతీయించాడు.

# 42

కొంచెందూరం వెళ్ళేసరికి రోడ్డు కాస్తా కాలిబాటగా మారింది ఇంకా కొంచెందూరం వెళ్ళేసరికి పెద్ద గొయ్యితో అంతమయింది. వెనకకు తిరిగి వెళ్ళిపోదామని సానిన్ సూచించాడు. కాని మేర్యా నికొలయెవ్నా అంది: "ఉహుఁ, కొండలదగ్గిరికి వెళ్ళాలసిందే. కాకి యెగిరేట్టే సూటిగా వెళదాం" గొయ్యిమీదుగా గుర్రాన్ని దూకించింది. సానిన్ కూడా అలానేచేశాడు. గొయ్యి దాటగానే మైదానం కనిపించింది. మొదట కొంతమేరవరకు మెట్ట ఆమీద చిత్తడినేల, ఆపైన బురద, ఎక్కడ బడితే అక్కడ నీరు ఊరుతోంది. మేర్యా నికొలయెవ్నా బుద్ధిపూర్వకంగానే నీళ్ళల్లోంచి గుర్రాన్ని నడిపిస్తూ నవ్వుతూ పేలుతూ,

"మనం చిన్న పిల్లలగా వర్తిద్దాం" అంది.

"బురదనీటిలో వేటాడడం అంటే యేమిటో తెలుసా?" అని సానిన్‌ను అడిగింది.

"తెలుసు" అని సానిన్ జవాబిచ్చాడు.

"మా మామయ్య కుక్కలను వెంటేసుకుని వేటాడేవాడు. వసంత కాలంలో నేనూ ఆయనతోపాటు గుర్రంమీద స్వారీ చేసేదానిని. బలే! యిపుడు నువ్వూ నేనూ యీ బురద నీటిలో వేటాడుతున్నాం. కాని యిలా చూడు. నువు రష్యనువు. యిటాలియన్ అమ్మాయిని పెళ్ళాడబోతున్నావు. ఓ- అదేగా నీకు వచ్చిపడ్డచిక్కు! యేమిటిది? యింకో గొయ్యి! ఊఁ-" గుర్రం దూకింది, మేర్యా నికొలయెవ్నా హాటు కిందపడిపోయింది. బుజాలమీద ఆమె ఉంగరాలజుట్టు నాట్యమాడింది.

సానిన్ హాటు తీయడానికి గుర్రం దిగబోయాడు. ఆమె బిగ్గరగా అంది: "దానిని ముట్టుకోకు. నేనేతీస్తాను" జీనుమీద కూర్చునే బాగావంగి ముసుగు చీరఅంచుకొరడామీద వేసి పట్టుకుని హాటుపైకితీసి పెట్టుకుంది. కాని హాటుకింద జుట్టు దోపుకోలేదు పిచ్చిగా కేక వేస్తూ గుర్రాన్ని దౌడు తీయించింది. ఆమె పక్క నే సానిన్ కూడా గోతులమీదగా. కొర డులమీదగా, పిల్లకాలవలమీదగా దుమికిస్తూ, ఎగబాకిస్తూ, కొండలపైకీ కిందికీ దౌడుతీయిస్తూ ఆమె మొహం కేసి చూడసాగాడు. ఆ మొహం విచ్చుకుంటున్న పుష్పంలా బహూ అందంగా ఉంది. ఆదుర్దాతో కళా కాంతులతో, కామంతో వెలుగొందుతూ కళ్ళు నిండా తెరుచుకున్నాయి. పెదవులు విడిపోయాయి. ముక్కు పుటాలు పెద్దవై గాలిని జోరుగా పీల్చుకుంటున్నాయి. ఆమె కంటికి కనిపించేటంతటినీ - భూమినీ, ఆకా శాన్నీ, సూర్యుని, గాలిని, ఆమె ఆత్మ సాహసించి స్వాధీన పర్చుకో దలచినట్టు, సూటిగా ముందుకు చూసింది. తప్పించుకోవడానికి ఇక అపాయం ఎదీలేదే అని వస్తాయిస్తున్నట్లుంది. "సానిన్! యిదంతా బర్జర్ 'లినోరీ'లోలాగా లేదూ? నువు చనిపోలేదు. అంతే భేదం. చని పోలేదూ? నేను బతికే వున్నాను!" ఆమెలో నిర్లక్ష్యంగా పాశవత పరా కాష్ట చేరుకుంది. గుర్రాన్ని దౌడుతీయిస్తున్న శూరనారి ఇకేమాత్రమూ ఆమె కాదు, యవ్వనంలో ఉన్న నరగోడిగ. సగంమృగం, సగందేవత; వారి పిచ్చి సంతోషం చూసి ఆ గ్రామసీమ ఆశ్చర్యంతో మూగవోయిన ట్టుంది.

మేర్యా నికొలయెవ్నా గుర్రం ధూళి కొట్టుకుపోయింది. నురు గులు కక్కుతోంది. కళ్ళెం పట్టుకుని వెనకకు లాగింది మేర్యా నికొల యెవ్నా. ఆమె బరువుకు ఆ గుర్రం ఊగిసలాడింది సానిన్ గుర్రం భారీ గుర్రం. మాంచి చురుకు. అయినా అదీ రొప్పుతోంది.

"యేమిటి? యిదంతా మహా సంతోషంగాలేదూ?" అని అడి గింది మేర్యా నికొలయెవ్నా పరమానందంతో మెల్లిగా,

"అవును" అని సానిన్ మహోత్సాహంతో జవాబిచ్చాడు. అతని రక్తంకూడా పిచ్చిగా వేడెక్కిపోయింది.

"కాస్త ఆగు, యింతటితో అవలా" అని ఆమె చేయి జాపింది. చేతి తొడుగు చినిగిపోయి ఉంది.

"నిన్ను అడవికి, కొండలకు తీసుకువెళతానని చెప్పాను గదూ. అవిగో కొండలు! " అవును. కొండలు!

కిరీటాలులాగా ఎత్తున అడవులు! కొండకు రెండువందల గజాల దూరంలోకి వారు చేరుకున్నారు. "అదిగో చూడు, ఆ కొండల దగ్గిరికి వెళ్ళేరోడ్డు. కాస్త వూపిరి పీల్చుకుని గుర్రాలను ముందుకు నడిపిద్దాం. వాటికీ కాస్త విశ్రాంతి యివాలిగా."

ఇలా గుర్రాలమీద స్వారీచేయసాగారు. మేర్యా నికొలయెవ్నా ఒక్క విసురుతో జుట్టు వెనకకు పడవేసుకుంది. చేతి తొడుగులకేసి చూసుకుని వాటిని తీసివేసింది. "నాచేతులు తోలు వాసన కొడతాయి. మరేం అనుకోకేం" అంది.

మేర్యా నికొలయెవ్నా మందహాసంచేసింది. సానిన్‌కూడా మందహాసంచేసాడు. పిచ్చిగా దౌడు తీశారేమో పూర్తిగా చనువు ఏర్పడింది. స్నేహితులైపోయారు.

"నీ వయసెంత?" అని ఆమె హఠాత్తుగా అడిగింది.

"యిరవై రెండు."

"నిజంగానా? నాకూ యిరవై రెండేళ్ళే. బలే వయసు! మనిద్దరి వయసులూ కలిపినా ముసిలితనంరాదు. అబ్బ! యెంతవేండ్రంగావుంది? నేను యెర్రబారానా? చెప్పు"

"యెర్ర గసగసాలంత యెర్రగా వున్నావు"

మేర్యా నికొలయెవ్నా మొహం జేబురుమాలుతో తుడుచుకుంది.

"అడవికి చేరుకుంటేనా, చల్లగా వుంటుంది. పురాతనమైన అడవి. పాతస్నేహితుడిలాంటిది. నీకెవారన్నా స్నేహితులున్నారా?"

సానిన్ ఆలోచించుకోవడానికి కాస్త ఆగి, "ఆఁ- వున్నారు. కాని ఆప్తేమందిలేరు. నిజమైన స్నేహితులు అసలేలేరు." అన్నాడు

"నాకు నిజమైన స్నేహితు లున్నారుగాని మనుషులువాళ్లుగాదు. యిదిగో నా గుర్రం. మంచి స్నేహితురాలు చూడు యేఁతజాగర్తగా నన్ను మోసుకువెళుతూందో! యిక్కడ యెంత పసందుగా ఉంది? నేను నిజంగా యెల్లుండి పారిస్ వెళతానా?"

"ఆఁ- అవును, నిజంగానే వెళతావు" అని సానిన్ జవాబిచ్చాడు,

"నువు ఫ్రాంక్‌ఫోర్ట్ వెళ్ళిపోతావుగదూ?"

"నేను తప్పకుండా ఫ్రాంక్ ఫోర్ట్ వెళతాను."

"సరే, మంచిది. శుభం". కాని యీరోజు మనది- మనది! "

---

గుర్రాలు అడవి మొగదలకు చేరుకుని దానిలో ప్రవేశించాయి. విశాలమైన, అనుకూలమైన ఛాయలు వారిని నలువైపులా అలుముకున్నవి.

"ఓ-స్వర్గమే ననుకో" అంది మేర్యా నికొలయెవ్నా. "యింకా లోపలికి పోదాం పద, సానిన్!"

కొద్దిగా అటూ ఇటూ ఊగుతూ బిగ్గరగా నిశ్వసిస్తూ గుర్రాలు ఇంకా లోపలికి దోవతీసాయి. బాట హఠాత్తుగా మలుపుతిరిగి సన్న గిలింది. పొదలవాసన, మొక్కలవాసన, తడిఆకుల వాసన, కుళ్ళి పోతున్న ఆకులవాసన కలిసి చిక్కగా మత్తుగొలిపే వాతావరణంలో గుప్పుమంటున్నాయి. బూడిదరంగు పెద్ద పెద్ద శిఖరాల పగుళ్ళలోనుంచి చెడ్డచలి వ్యాపిస్తోంది. ఆకుపచ్చని నాచు తెగపెరిగిన గుండ్రటి గుట్టలు బాటకు ఇరువైపులా గోచరించాయి.

"ఆగు" అంది మేర్యా నికొలయెవ్నా. "యీ మొఖమలు పరుపు మీద కూర్చుని విశ్రాంతి తీసుకోవాలని వుంది. గుర్రం దిగాలి, కాస్త సాయపడుదూ."

సానిన్ జీనుమీద నుంచి కిందకుదుమికి ఆమె దగ్గరకు పరుగెత్తు కుంటూ వెళ్ళాడు, ఆమె అతని బుజంమీద అనుకుని, గబుక్కున కిందికి దూకి నాచుకప్పిన దిబ్బమీద కూర్చుంది. రెండుగుర్రాల కళ్లాలూ పట్టు కుని సానిన్ ఆమె ముందు నిలబడ్డాడు.

ఆమె అతని మొహంకేసి చూస్తూ, "మరిచేపోవడం యెలాగో నీకు తెలుసా ? సానిన్ !" అని అడిగింది.

ఆ కిందటిరోజున బగ్గీలో జరిగింది ఆమెకు జ్ఞాపకం వచ్చింది. "యిది ప్రశ్నా లేకపోతే నిందించడమా ?" అని ఎదురుప్రశ్న వేసాడు సానిన్.

"నా జీవితంలో యెన్నడూ యెవరినీ నేను నిందించలేదు. నీకు మంత్రాలలో నమ్మకం వుందా ?"

"యిలా అడగడంలో నీ వుద్దేశమేమిటి ?"

"మంత్రాలలో. మన పాటలలో, రష్యన్ జానపదగేయాలలో ప్రస్తావిస్తూంటారే !"

"ఓ-అదా !" అంటూ దీర్ఘాలుతీసాడు సానిన్.

"అవును. నాకు వాటిలో నమ్మకం వుంది. యెపుడో ఒకప్పుడు నీకూ నమ్మకం కుదుసతుంది."

"మంత్రాలు ?" అన్నాడు సానిన్. "యేమైనా జరగవచ్చు. యింతకు పూర్వం నాకు మంత్రాలలో నమ్మకం లేదు. కాని యిపుడు నమ్మకం కుదుసతోంది. నన్ను నేనే తెలుసుకోలేక పోతున్నాను."

మేర్యా నికొలయెవ్నా ఏదో ఆలోచిస్తున్నట్టు వెనకకు తేరిపార జూచింది.

"యీ స్థలం నాకు పరిచితమైందే. ఆ పెద్ద సిందూరం చెట్టు వెనక చూడు, సానిన్ ! యెర్రటి కొయ్యశిలువ కనిపిస్తోందా ?

సానిన్ ఆ పక్కకి నాలుగడుగులు వేసి, "ఆఁ, కనిపిస్తోంది" అన్నాడు.

మేర్యా నికొలయెవ్నా తనలో తాను నవ్వుకుని "మంచిది. మనం యెక్కడున్నామో తెలిసింది. యింకా దారి తప్పలేదు. యేమిటాచప్పుడు? కట్టెలు కొడుతున్నారా ?" అంది.

సానిన్ పొదలోకి తొంగిచూసి "యెవడో యెండుకొమ్మలు కొడుతున్నాడు." అన్నాడు.

"జుట్టు సవరించుకోవాలి" అంది మేర్యా నికొలయెవ్నా. "నన్ను చూసి యేమేమో అనుకోవచ్చు." ఇలా అని ఆమె హాటు తీసివేసి మాట్లాడకుండా హుందాగా పొడుగాటి జడలు తిరిగి చుట్ట చుట్టుకో సాగింది. సానిన్ ఆమెముందు నిలబడ్డాడు. అక్కడక్కడా నాచు అంటుకున్న దుస్తులకింద లలితమైన ఆమె అవయవాలు కనవచ్చాయి.

సానిన్ వెనకనున్న గుర్రాలలో ఒకటి హఠాత్తుగా తల ఆడించింది. సానిన్ ఆపాదమస్తకం వణికిపోయాడు. అతనిలో తుపాను రేగింది. నరాలు ఫిడేలుతీగల లాగా బిగుసుకుపోయాయి. 'నన్ను నేనే తెలుసుకోలేక పోతున్నాను' అని అతను అన్నది అక్షరాలా నిజం. మంత్రముగ్ధుడైపోయాడు. అతని తనువంతా ఒకే ఒక ఆలోచనతో, ఒకేఒక కోరికతో నిండిపోయింది. మేర్యా నికొలయెవ్నా అతనిని పరీక్షగా చూసింది. "అలానేవుంది" అంది చివరకు హాటు పెట్టుకుంటూ. "కూర్చోవేం ? యిదిగో యిక్కడ, ఉహుఁ. ఒక్క నిమిషం ఆగు- కూర్చోకు. అదేమిటి ?"

చెట్ల చిటారుకొమ్మలమీద ఉరుము-ఉరిమింది. గాలి అల్లల్లాడిపోయింది.

"వురుమేనా ?"

"అలాగేవుంది." అని సానిన్ సమాధానమిచ్చాడు.

"బలే! బలే పసందుగావుంది, పసందుగావుంది! స్వర్గ సుఖమేననుకో." మళ్ళీ ఉరుము ఇంకా పెద్దగా ఉరిమి ప్రతిధ్వనించి గుర్రుమన్నది. "బలే! నిన్న, ఈనీడ్ ను గురించి మాట్లాడుకున్నాం

గ్యాపకం వుందా ? వాళ్ళు ఒక అడవిలో తుపానులో చిక్కుకున్నారు. కాని మనం యెక్కడో అక్కడ తల దాచుకోవాలి" అంటూ ఆమె దిగ్గునలేచింది. "నా గుర్రాన్ని దగ్గిరికి తీసుకురా. చేయిజాపు. బలే! నేనే మంత బరువులేనులే."

పక్షిలా చర్రున జీనుమీదికి ఉరికింది. సానిన్ కూడా తన గుర్రం ఎక్కాడు.

"యింటికేనా ?" అని అడిగాడు సంశయిస్తూ.

"యిల్లు !" అంది కళ్లాలు ఒడిసిపట్టుకుంటూ, స్థాయి హెచ్చించి, "రా !" అని మోటుగా ఆజ్ఞాపించింది.

గుర్రంమీద ఆ బాటవెంటే బయలుదేరి ఎర్రశిలువను దాటింది. మైదానంలోకి దిగి రోడ్డు కూడలివరకూ వెళ్ళి కుడిచేతివైపుకు తిరిగి, కొండదగ్గరకు దారితీసింది. ఆ దారివెంటే అడవిమధ్యకు చేరుకుంది. ఎక్కడికి వెళుతున్నదీ ఆమెకు తెలుసు. ఒక్క మాటయినా మాట్లాడ లేదు. వెనకకు తిరిగి చూడలేదు. తీవిగా ముందుకుసాగి వెళ్ళింది. ఇక అతనో వినయవిధేయతంతో భృత్యుడిలాగా ఆమెను అనుసరించాడు. గుండె టకటకా కొట్టుకుంటూంది. కాని అందులో సంకల్పశక్తి అనేదే లేకుండాపోయింది. జల్లుపడసాగింది. ఆమె గుర్రాన్ని వడిగాపోనిచ్చింది. సానిన్ వెనకపడలేదు. ఆకుపచ్చని దేవదారు చెట్లగుండా, ముందుకు చొచ్చుకువచ్చిన కొండ నీడకింద ఒక చిన్నగుడిసె కనిపించింది. గుమ్మానికితడికఉంది మేర్యా నికొలయెవ్నా సరాసరివెళ్ళి గుమ్మంముందు ఆగి కిందకు దూకింది, "ఈనీస్" అని మెల్లగా అతని చెవిలో అంది.

---

నాలుగుగంటల తర్వాత, జీనులో తూలుతూ నౌకరువెంటరాగా మేర్యా నికొలయెవ్నా, సానిన్, వీస్‌బాడెన్ హోటలుకు చేరుకున్నారు. కార్యదర్శి వ్రాసినజాబు చేతిలోపట్టుకుని మాన్షియర్ పొలొజోవ్ భార్యకు ఎదురైనాడు. ఆమెవంక పరీక్షగా చూసాడు. అతని మొహంలో అసంతృప్తి గోచరించింది. "నేను వోడిపోయానా యేమిటి? అని గొణిగాడు.

మేర్యా నికొల్గియెవ్నా సమాధాన మీయకుండా బుజాలు ఎగరవేసి ఊరుకుంది.

---

అదే రోజున రెండుగంటల తరవాత సానిన్ అతని గదిలో ఆమెముందు పూర్తిగా పతనమైపోయి నిలబడ్డాడు.

"యెక్కడకివెళతావు?" అని ఆమె అడిగింది. "పారిసా? ఫ్రాంక్ ఫోర్టుకా?"

"నువు యెక్కడికి వెళితే అక్కడికి వెళతాను. నువు గెంటేసే వరకూ నువు యెక్కడ వుంటే అక్కడ వుంటాను" అని తెగించి జవాబిచ్చి సానిన్ ఆమెముందు మోకరిల్లాడు. ఆమెచేతులు పెదవులకు హత్తుకున్నాడు. చేతులు విడపించుకుని ఆమె అతని తలమీద పెట్టింది. హఠాత్తుగా చేతితో అతని జుట్టు ఒడిసి పట్టుకుంది. మచ్చిక పడిన అతనిజుట్టును మెల్లమెల్లగా వేళ్ళతో మెలితిప్పి నిటారుగా నిలబడింది ఆమె పెదవులమీద విజయ మందహాసం నర్తించింది. తెలటి కాంతితో వెలిగే ఆమెకళ్ళు నిండా విప్పారాయి. ఆ కళ్ళల్లో కఠోరత, విజయగర్వం గోచరించాయి. పట్టుబడ్డ పక్షి శరీరంలో గోళ్ళు గుచ్చే డేగ కళ్ళూ అలానే ఉంటాయి.

# 43

చదువుల గదిలో నిశ్శబ్దితమధ్య కాగితాలు చూసుకుంటూంటే కెంపురంగు శిబివ కంటపడేసరికి సానిన్‌కి పై కథంతా జ్ఞాపకం వచ్చింది. పైన వర్ణించిన సంఘటనలు అతని మనోనేత్రం ముందు ఒక దాని తరవాత ఒకటి విస్పష్టంగా గోచరించాయి. మానాభిమానాలు విడిచి మదాం ఫొలొజోవ్ ముందు మోకరిల్లడం, ప్రార్థించడం, బానిసత్వం ప్రారంభం కావడం - ఆ ఘట్టందగ్గరకు వచ్చేసరికి ఇక భరించలేక పోయాడు. జ్ఞాపకశక్తి మందగించలేదు, కారణం అదేమీకాదు. ఆ తర వాత ఏం జరిగిందీ అతనికి బాగా తెలుసు. చాలా సంవత్సరాలు గడిచినా ఇప్పటికీ సిగ్గుతో అతను ఉక్కిరిబిక్కిరి అయిపోతున్నాడు. ఆ సంఘట నల స్మృతికి స్వస్తి చెప్పకపోతే తనకుతాను అసహ్యించుకునే స్థితి జయింపరానిదై తనను ముంచెత్తుతుందని అతనికి భయం వేసింది. రేగే స్మృతులను అణచివేయాలని ఎంత యత్నించినా వాటిని పూర్తిగా అణచివేయలేక పోయాడు. కన్నీళ్ళతో, అబద్ధాలతో, దయపుట్టేట్టు, జెమ్మాకు వ్రాసిన ఆ ఉత్తరం జ్ఞాపకం వచ్చింది, ఆ ఉత్తరానికి ఆమె జవాబివ్వనేలేదు. ఇంతద్రోహం, మోసం చేసింతరవాత మళ్ళా ఆమె దగ్గరకు వెళ్ళి కంటపడడమా ? ఉహుం - అటువంటిపని చేయనీయకుండా ఇంకా అతనిలో అంతరాత్మని గౌరవం మిగిలిఉన్నాయి. అంతేకాదు, ఆత్మవిశ్వాసంలో, ఆత్మగౌరవంలో అతనికి నమ్మకం పోయింది దేనికి సమాధాన మీయడానికీ అతనికి ధైర్యం నశించింది. తన సామాను తీసుకు వచ్చేయమని ఫొలొజోవ్ నౌకరును ఫ్రాంక్‌ఫోర్టు పంపడం, ఎంతగానో భయపడిపోవడం, సాధ్యమైనంత త్వరలో వెళ్ళాలని

ఒకపే ఆలోచన చేయడం జ్ఞాపకం వచ్చింది. సిగ్గుచేటు! మేర్యా నికొాల యెవ్నా ఆదేశానుసారం పొలొజోవ్ దయకోసం పాకులాడడం, వాన్ డాన్ హాప్‌తో సఖ్యత పడడం స్మృతికి వచ్చాయి. మేర్యా నికొాల యెవ్నా అతనికి ఇచ్చిన ఉంగరంలాంటిదే డాన్‌హాఫ్ చేతికికూడాఉంది, ఇంకా అర్థాన్నమైన స్మృతులు, ఇంకా సిగ్గుచేటయిన స్మృతులు అతని మనసులో తారాడాయి. పాంటలియోన్ పిప్పటోలా అని వ్రాసిన విజిటింగుకార్డు నౌకరు తెచ్చిఇచ్చాడు. ఆ వృద్ధుని కంటపడకుండా దాక్కున్నాడు. కాని చివరికి హోటలు నడవలో అతను తారసిల్లాడు·పైకి ఉంగరాలు తిరిగిన ముంగురులతో ఆ వృద్దిని మొహం ఇప్పటికీ అతని కళ్ళకు కట్టింది. ఆ ముదుసలి కళ్ళు ఎఱ్రనిప్పులా మండపోయాయి 'శాపనార్థాలు, కేకలు అతని చెవులలో గింగురుమన్నాయి. "ఛీ! ద్రోహీ!" అనే మాటలు వినిపించాయి. సానిన్ బెదిరిపోయాడు, తల పంకించాడు. స్మృతులనుంచి తప్పించుకోవాలని పదే పదే యత్నించాడు. కాని బగ్గీలోని ఇరుకుసీటుమీద కూర్చున్న అతని రూపం కళ్ళకు కట్టింది. సదుపాయంగా ఉండే వెనకసీటులో మేర్యా నికొాలయెవ్నా, ఇపొ్పలిట్ సిడొరిచ్ అనుకుని కూర్చున్నారు. వాస్‌బాడెన్ వీధులగుండా నాలుగు గుర్రాలు దూసుకుపోతున్నాయి. పారిస్‌కి! సానిన్ ఒలిచిఇచ్చిన బేరిపండు పొలోజోవ్ తింటున్నాడు. మేర్యా నికొాలయెవ్నా అతనికి పరిచితమైన చిరునవ్వుతో అతనికేసిచూస్తోంది. యజమాని, రాజు, దాసోహమ్మన్న వానిని చూసినట్లు చూసింది.

కాని, వీధిమూల, పట్టణశివార్లకు దగ్గరలో ఎవరూ?పాంటలియోన్ కాదుగదా? అతనుతోకూడా ఉన్నదెవరు? ఎమిలీ కాడుగదా? అవును, ఎమిలియే! మంచి ఉత్సాహవంతుడు! ఒకపుడు సానిన్ అంటే ప్రాణం ఇచ్చేవాడు! ఇపుడో? ఆ యువకుని హృదయం అతని యోధుడంటే, అతని ఆదర్శపురుషుడంటే భయంతో నిండిపోయింది. అందమైన ఆ ముఖంలోకోపం, అసహ్యభావం తాండవిస్తున్నాయి ఆమొహం అందం మేర్యా నికొాలయెవ్నా బగ్గీ కిటికీలోనుంచి తొంగిచూసింది. అతనికళ్ళు,

అచ్చంగా ఆమె కళ్ళలాంటి కళ్ళు, సానిన్‌కేసి ఉరిమి చూసాయి. పెదవులు గట్టిగా మూసుకున్నాయి... తెరిచినపుడల్లా తిట్లు వెలువడ్డాయి...

పాంటలియోన్ చేయిసాపి సానిన్‌ను చూపించాడు. ఎవరికి? అతని ప్రక్కన టార్టాగ్లియాకి. టార్టాగ్లియా సానిన్‌ను చూసి మొరిగింది. ఆ కుక్క మొరగడం భరించలేనంతగా అవమానిస్తున్నట్లుంది.... అబ్బ!

ఆ తరవాత - పారిస్‌లో జీవితం - అవమానాలు, అసూయ చూపడానికి, సణుగుకోవడానికి వీలులేని బానిస పడే యమయాతనలు, చివరకు చీకిపారవేసిన టెంకలాగా విసిరివేయబడడం....

మాతృభూమికి చేరుకోవడం, విషమయమై పతనమైపోయిన జీవితం, చిన్న చిన్న వేదనలు, తీవ్రము నిష్ప్రయోజనము అయిన పశ్చాత్తాపం, అంత తీవ్రము నిష్ప్రయోజనము అయిన మరుపు - భౌతికంగా శిక్ష అనుభవించలేదుగాని, ఎడతెగకుండా, ప్రతినిమిషం, కొద్ది కొద్దిగా వేధించే బాధలాగా, తడవకు ఫార్తింగు చొప్పున తీర్చుకుంటూవచ్చినా తీరనిఅప్పులాగా శిక్ష అనుభూతికి వచ్చేది.... అతని పాపం పండింది!....

---

జెమ్మా ఇచ్చిన ఆ శిలువ ఇప్పటికివరకూపోకుండా ఎలాఉంది? దానిని తిరిగి జెమ్మాకెందుకు ఇచ్చివేయలేదు? ఈ క్షణంవరకు అది అతని కంటపడలేదు. ఎందుచేతనో?ఆలోచిస్తూ చాలాసేపుకూర్చున్నాడు. ఇన్ని సంవత్సరాల అనుభవం ఉన్నా తనెంతో తీవ్రంగా మనఃపూర్వకంగా ప్రేమించిన జెమ్మాను వదలి, అతను ప్రేమించని ఆ స్త్రీ వలలో ఎలాపడ్డాడో అతనికే అర్థంకాలేదు....అమర్నాడు విదేశాలకు వెళుతున్నానని చెప్పేసరికి స్నేహితులు పరిచయస్థులు ఆశ్చర్యపోయారు.

అంతా నిర్ఘాంతపోయారు. మంచిఇల్లు అద్దెకు తీసుకుని అలంకరించి, మదాం వోటీ నటించే ఇటాలియన్ సంగీత నాటకానికి టికెట్లు కొని, ఇంతలో పీటర్స్‌బర్గ్ వదిలి వెళ్ళిపోవడమా? స్నేహితులు, పరిచయస్థులు తబ్బిబ్బయారు. కాని ఇతరుల వ్యవహారాలను గురించి ఎక్కువ

కాలం ఆలోచించడం మానవ ప్రకృతికే విరుద్ధం. విదేశాలకు సానిన్ బయలుదేరినపుడు అతనిని పంపడానికి స్టేషనుకు వెళ్ళుందల్లా ఫ్రెంచి దర్జీ ఒకడే. అతడైనా పాతబాకీ రాబట్టుకుందామని వెళ్లాడు.

# 44

విదేశాలకు వెళుతున్నానని స్నేహితులతో చెప్పాడేగాని సరిగ్గా ఫలానాచోటుకని చెప్పలేదు. సరాసరి ఫ్రాంక్‌ఫోర్టు వెళ్లాడని పాఠకులు తేలికగా ఊహించుకోగలరు. అవిచ్ఛిన్నంగా రైళ్ళు నడుస్తున్నాయేమో పీటర్సుబర్గ్‌నుంచి బయలుదేరిన మూడు రోజులకల్లా సానిన్ ఫ్రాంక్‌ఫోర్టు చేరుకున్నాడు. 1840 తరవాత మళ్ళీ ఆ పట్టణం వెళ్ళలేదు. వెనకటి చోటే 'శ్వేతహంస' హోటలు ఉందిగాని మొదటి తరగతి హోటలుగా ఇపుడెవరూ దానిని పరిగణించడంలేదు ఫ్రాంక్‌ఫోర్టులోని రాజవీధి జీల్ ఎక్కువగా మారిపోలేదు మదాం రోసెల్లీ ఇంటిగుర్తులు గాని, ఆమె దుకాణం ఉన్న వీధిగుర్తుగాని లేవు. ఒకపుడు పరిచితమైన వీధులవెంట మైకంతో తిరిగాడుగాని గుర్తుపట్టడానికి ఏదీలేదు పాత భవనాలు మాయమైపోయాయి. వాటిబదులు కొత్తవీధులు వెలిశాయి. ఆ వీధుల కిరువైపులా వరసగా ఇళ్ళు, అందమైన బంగళాలు తలెత్తాయి. ఇక పార్కులో, ఆ పార్కులోనేగదూ. జెమ్మాకు అతని ప్రేమ వెల్లడించింది! ఆ పార్కులో చెట్టూచేమా పొత్తుగా పొడుగ్గా ఎదిగి మారు రూపం తెచ్చాయి. ఆ పార్కే ఈ పార్కా అని సానిన్‌కు సంశయం కలిగింది ఏంచేయాలి? ఎక్కడ, ఎలా జెమ్మా విషయం వాకబుచేయాలి? ముప్ఫయియేళ్ళు గడిచిపోయాయి. అతను తలపెట్టినపని తేలికైందేం కాదు. ఎంతమందిని అడిగినా రోసెల్లీ అనే పేరే ఎవరూ విననట్లేలేదు.

గ్రంథాలయంలో కనుక్కోండి. అక్కడ పాతవార్తాపత్రికలన్నీ ఉంటాయి' అని హోటలు యజమాని సలహాఇచ్చాడు. కాని దానివల్ల ఏంప్రయోజనం జరుగుతుందో అతను చెప్పలేదు గత్యంతరంలేక హెర్ ఫ్లూబర్‌ను గురించి వాకబుచేసాడు. కాని ఇదీ ఫలప్రదం కాలేదు. ఆ దుకాణాదారుక్రమేపీ పెట్టుబడిదారుహోదా చేరుకుని వ్యాపారంలో బాగా దెబ్బతిని. దివాళాతీసి, జైలులో చనిపోయాడు. ఈ వార్త సానిన్‌ను కలవరపెట్టలేదు. ఈ ప్రయాణం వృథాప్రయాసేనని అనుకోవడం ప్రారంభించాడు. కాని ఒకరోజున ఫ్రాంక్‌ఫోర్ట్ 'సమాచారం' తిరగ వేస్తుంటే వాన్‌డాన్‌హాఫ్ పేరు కనిపించింది. వాన్‌హాప్‌మేజరుగా పని చేస్తూ ఉద్యోగంనుంచి విరమించుకున్నాడు. తక్షణమే బగ్గీవేసుకుని బయలుదేరాడు. ఈవాన్‌డాన్‌హాప్ అతనుఎరిగిన అతడుఅయిఉంటాడని, అయిఉన్నా రోసిల్లా కుటుంబంగురించి చెప్పగలుగుతాడనీ ఎలా అను కున్నాడో సానిన్‌కే తెలియదు, కాని నీటిలో మునిగిపోయే మనిషి గడ్డి పోచను ఆధారం చేసుకుంటాడు.

ఉద్యోగం విరమించుకున్న ఆ మేజరును సానిన్ ఇంటివద్ద కలుసుకున్నాడు. తల నెరసిన ఆ పెద్దమనిషిని ఇట్టే గుర్తుపట్టాడు. ఒకపుడు ఇద్దరూ ప్రబల విరోధులు. వాన్‌డాఫ్‌కూడా అతనిని గుర్తు పట్టాడు. కలుసుకున్నందుకుసంతోషించాడు. ఈసమావేశం డాన్‌హాఫ్‌కు అతని యవ్వనాన్ని, యవ్వనపు చిలిపిచేష్టలను జ్ఞప్తికి తెచ్చింది. రోసెల్లీ కుటుంబం చాలాకాలం కితమే అమెరికా వెళ్ళి న్యూయార్కులో స్థిరపడి పోయాననీ, జెమ్మా ఒక వ్యాపారస్తుని వివాహ మాడిందనీ డాన్‌హాఫ్ తెలియచేసాడు. అంతేగాదు డాన్‌హాఫ్‌కి ఒక వ్యాపారస్తునితో పరిచయం ఉంది. అతను అమెరికాతో ఎక్కువగా వ్యాపారం చేస్తున్నాడు. బహుశా అతనికి జెమ్మా చిరునామా తెలిసి ఉండవచ్చు. ఈసంగతులన్నీ విని సానిన్ ఆ వ్యాపారస్తుని దగ్గరకు వెళ్ళి చిరునామా తీసుకురమ్మని డాన్‌హఫ్‌ను బలవంతం చేసాడు. ఓ ఆనందమే ఆనందం! కాని డాన్‌హఫ్ వెళ్ళి జెమ్మా భర్త చిరునామా తీసుకుని తిరిగివచ్చాడు.

జెమ్మీస్లోకమ్, 50 బ్రాడ్వే. న్యూయార్క్ కాని ఈ చిరునామా 1863 నాటిది.

"పూర్వం ఫ్రాంక్‌ఫోర్టులో నివసించిన ఆ అందాలరాణి యింకా జీవించే వుందనీ, న్యూయార్కులోనే వుందనీ ఆశిద్దాం. సరేగాని" అన్నాడు స్వరస్థాయి తగ్గించి "ఆ రోజుల్లో వీస్‌బాడెన్‌లో మకాం పెట్టిన ఆ రష్యన్‌వారి. నీకు తెలుసుగా మాదాం వాన్ బో....వాన్‌బొలా జోల్ యింకా జీవించేవుందా?" అని డాన్‌హాఫ్ అడిగాడు.

"ఉహుఁ - జీవించిలేదు. చాలా కాలంకితమే చనిపోయింది."

వాన్‌డాన్‌హాఫ్ పైకి చూసాడు. కాని సానిన్ పక్కకి తిరగడం గమనించి, మొహం ముడుచుకుని మాట్లాడకుండా చక్కాబోయాడు.

ఆ రోజుననే సానిన్ జెమ్మా స్లోకమ్‌కి న్యూయార్కు ఉత్తరం వ్రాసాడు. ఫ్రాంక్‌ఫోర్టునుంచి ఆ ఉత్తరం వ్రాస్తున్నాననీ, ఆమె ఆచూకీ తెలుసుకోవాలనే ఏకైక ఉద్దేశంతో అక్కడికి వచ్చాననీ ఆ ఉత్తరంలో తెలియజేసాడు. జవాబుకోసం ఆశించే హక్కు పూర్తిగా ఎన్నడో పోగొట్టుకున్నాననీ, ఆమె క్షమాభిక్ష పొందడానికి తగించేమీ తాను చేయ లేదని తెలుసుననీ, ప్రస్తుతం సుఖంగా జీవిస్తున్న ఆమె తన (సానిన్) ఉనికినే మర్చేబోయి ఉంటుందని నమ్ముతున్నాననీ, గతమంతా కళ్ళకు స్పష్టంగా కట్టేటట్టు చేసిన ఒకానొక ఉదంతం మూలంగా తిరిగి ఆమెకు ఉత్తరం వ్రాయాలని సంకల్పించాననీ వ్రాసాడు. భార్య అనీ, పిల్లలనీ లేకుండా, సంతోషమంటూ లేకుండా ఒంటరిగా గడుపుతున్న తన జీవితాన్ని వర్ణించి చెప్పాడు. ఉత్తరం వ్రాస్తున్న వుద్దేశాన్ని అర్థం చేసుకుని చాలాకాలంగా క్షమించబడకుండా వున్న తన నేరాన్ని క్షమించమనీ, ఆమెను గురించీ, ఆ నూత్న ప్రపంచంలో ఆమె జీవితాన్ని గురించీ ఏ కొద్దయినా సరే చెప్పి సంతోష పెట్టవలసిందనీ వేడుకున్నాడు. "నాకు ఒక్క ముక్క రాసావంటే నీ విశాలహృదయానికి తగిన మంచి పని చేసినదాని వవుతావు. నేను జీవించి వున్నంతవరకు నీకు కృతజ్ఞుడనై వుంటాను. 'శ్వేతహంస' హోటలులో బసచేసాను, (శ్వేతహంస

అనే రెండు మాటలకింద గీతగీసాడు)." నీ జవాబుకోసం వసంతకాలం దాకా యిక్కడే వేచి వుంటాను" అంటూ ఉత్తరం ముగించాడు.

ఉత్తరం పోస్టులోవేసి అక్కడే ఉండిపోవడానికి ఏర్పాట్లు చేసుకున్నాడు. ఆ హోటలులో ఉంటూ గదివిడిచి బయటకు వెళ్ళకుండా ఏ ప్రాణినీ కలుసుకోకుండా ఆరు వారాలు గడిపాడు. రష్యానుంచిగాని మరెక్కడనుంచిగాని అతనికి ఉత్తరాలు వ్రాసేవారెవరూ లేరు. అదీ అతనికి అనుకూలించింది. అతనికి ఉత్తరం వచ్చిందంటే జెమ్మాదగ్గర నుంచే వచ్చిందని ముందుగానే భావించుకోవచ్చు. ఉదయంనుంచి రాత్రి దాకా పత్రికలు కాదుగాని చరిత్రకు సంబంధించిన ఉద్గ్రంధాలను చదివాడు....ఎడతెరిపలేకుండా చదవడం, నిశ్చబ్దత, ఒంటరిగా సన్యాసి జీవితం-ఇదీ అతనికి అవస్థకు తగింది. ఇలాంటి పరిస్థితి సంఘటనపడినందుకు జెమ్మాకు కృతజ్ఞత చూపాల్సింది. ఇంతకీ ఆమె బతికిఉందా, చనిపోయిందా? బతికేఉంటే జవాబిస్తుందా?

చివరికి ఒకరోజున ఆమెరికన్ తపాలాబిళ్ళ అంటించిన ఒక ఉత్తరం న్యూయార్కు-నుంచి వచ్చింది. కవరుమీదివ్రాత ఇంగ్లీషులాగా ఉంది. ఆదస్తూరిని గుర్తుపట్టలేకపోయాడు. గుండెలో శూలంపెట్టిపొడిచినట్లయింది. తక్షణమే కవరు చింపాలని నిశ్చయించుకో లేక పోయాడు. కాని కవరు చించీ చించగానె సంతకం ఎవరిదా అని చూసాడు-జెమ్మా సంతకం! కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగాయి. ఇంటిపేరు వ్రాయకుండా అసలుపేరుమాత్రమే వ్రాసింది కాబట్టి తనను క్షమించిందనీ, సమాధానపడిందనీ సానిన్ భావించుకున్నాడు. ఊదాకాగితం మడత విప్పేసరికి ఒకఛాయాచిత్రం దానిలోనుంచి కిందపడింది. తొందర తొందరగా ఆ ఛాయాచిత్రం తీసుకుని చూసి నిర్ఘాంతపోయాడు. అచ్చంగా జెమ్మాలాగానే. ముప్ఫయిఏళ్ళకితం తను చూసిన జెమ్మాలాగానే ఉంది. అవే కళ్ళు, అవే పెదవులు, అదేరకం మొహం! ఛాయా చిత్రం వెనకవైపున 'నా కూతురు మేరియానా' అని వ్రాసిఉంది. ఉత్తరం నిరాడంబరంగా ఆప్యాయంగా ఉంది. తటపటాయించకుండా ఉత్తరం వ్రాసినందుకు, తనయందు నమ్మకం ఉంచినందుకు జెమ్మా అతనికి కృతజ్ఞత తెలుపుతూ

వ్రాసింది. తనను విడిచి పారిపోయినతరవాత దుఃఖమయజీవితం గడిపా ననీ కాని అతనిని కలుసుకోవడం నిజంగా అదృష్టమేననీ, అతనిని కలుసుకోబట్టే హెర్ క్లూబర్‌ను వివాహమాడడం తప్పిపోయిందనీ, అప్రత్యక్షంగా ఈ వివాహానికి కారణమైనావనీ తెలిపింది. ఇరవై యేడు సంవత్సరాలనుంచీ ఈ భర్తతో సుఖంగా సర్వసంపదలతో తులతూగు తున్నది. న్యూయార్కులో అందరికీ వారిఇల్లు తెలుసు. జెమ్మాకి అయిదు గురు సంతానం-నలుగురు కొడుకులు, ఒక కూతురు. కూతురికి పద్దెనిమి దేళ్ళు. పెళ్ళికాబోతోంది.ఆమె అచ్చంగా తల్లిపోలికేఅని అంతాఅంటారు. అందుకే జెమ్మా ఆమె ఛాయాచిత్రం సానిన్‌కి పంపింది. ఇక చెడు వార్తలు ఉత్తరంచివర వ్రాసింది. ఫ్రా లెనోరీ కూతురూ అల్లుడూ వెంట న్యూయార్కు వెళ్ళింది. తన బిడ్డలు సుఖంగా జీవిస్తూంటే చూసి ఆనందించింది. మనుమలను మనుమరాళ్ళను ఎత్తుకుని ఆడించింది. ఇటీ వలనే. న్యూయార్కులో చనిపోయింది. పాంటలియోన్ కూడా అమెరికా వెళ్ళాలని ఉద్దేశించాడుగాని ఫ్రాంక్‌ఫోర్టునుంచి బయలుదేరకముందే మరణించాడు. "యిక ఎమిలియే, ప్రియమైన, అసదృశ్యమైన ఎమి లియే! గారిబాల్డీ నాయకత్వాన స్వదేశ స్వాతంత్ర్యానికి పోరాడిన 'వేయిమంది'తో పాటు ప్రాణం అర్పించాడు. ప్రియమైన సోదరుని మరణానికి బిట్టు విలపించాం, కాని కన్నీళ్ళు కారుస్తూనే అతనిని తలచు కుని గర్వపడ్డాం, గర్వపడుతూనే వుంటాం, అతని స్మృతిని పవిత్రంగా పరిగణిస్తాం విశాలమైన, నిస్వార్థమైన అతని ఆత్మ వీర బిరుదాంకితం కాదగింది " సానిన్ జీవితం దుఃఖభాజనం అయిపోయినందుకు జెమ్మా విచారం వెలిబుచ్చింది. అన్నిటికీ మించి ఆత్మశాంతి అతనికి కలగాలని భగవంతుని ప్రార్థిస్తున్నానని తెలిపింది. తిరిగీ అతనిని కలుసుకోవడం తనకు సంతోషదాయకంగా ఉంటుందిగాని అది సాధ్యమయే అవ కాశం కనిపించడంలేదని వ్రాసింది.

ఈ వుత్తరం చదువుతూ సానిన్ ఎటువంటి ఉద్వేగాలకు లోనై నాడో ఇక్కడ వర్ణించదలచుకోలేదు. ఆ వుద్వేగాలను వర్ణించడానికి ఈ మాటలు చాలవు - అవి చాలా లోతైనవి, బలీయమైనవి, మాటల

కంటే అస్పష్టమైనవి. సంగీతం ఒక్కటే, ఆ వుద్వేగాలను వ్యక్తీకరించ గలదు.

సానిన్ వెంటనే జవాబిస్తూ పెళ్ళికూతురికి ఒక బహుమానం - అందమైన ముత్యాలహారం దానికి తగిలించి కెంపువర్ణపుశిలువ, దాని మీద "ఒక అజ్ఞాతమిత్రునినుంచి మేరియానా స్లోకమ్‌కి బహూకరణ" అని చెక్కించి పంపాడు. ఈ బహుమతి చాలా విలువగలదైనా ఆర్థికంగా అతనికి పెద్ద దెబ్బేమీ తగలలేదు. ఫ్రాంక్‌ఫోర్ట్‌ను అతను మొదటి సారిగా దర్శించి ముప్ఫయి ఏళ్ళయింది, ఈ ముప్ఫయిఏళ్ళలోనూ చాలా నిలవచేయగలిగాడు. కాని ఆట్టేకాలం రష్యాలో వున్నట్టులేదు. జమీ అంతా అమ్మివేసి అమెరికా వెళ్ళిపోవాలని చూస్తున్నాడని పుకారులు బయలుదేరాయి.

[ స మా ప్తం ]

